# శ్రీమతి

శొంఠి బాలకృష్ణమూర్తిగారు

బుద్ధదేవుని స్మృతిచిహ్నముగ రచించె
చలువఱాతో వెలను బింబిసారనృపతి;
రాజపత్నీసమేతాదివర్గంబులెల్ల
సలుపుదురు సంజవేళఁ బూజలునివాళి.

* * *

తానురాజయి యానృపాత్మజుఁడు తొంటి
తండ్రిమతమును తుడిచె రక్తంబుతోడ;
తన్మతగ్రంథచయము దగ్ధమ్మొనర్చె.

* * *

అదిశరత్కాల మపుడెదినాంతమయ్యె;
సమయమాయెను సంజపూజలనుసల్ప;
శుద్ధజలములస్నాతరై బుద్ధదేవు
భక్తురాలు, శ్రీమతి, రాజపత్నిసకియ,
విరులదివ్వెలపైడి పళ్లెరమునందుఁ
గొంచురాణిమోమును దిలకించెనట్టె.
"వధ్యులలబుద్ధు నర్చించువార లనెడు
విభునిశాసనమెఱుఁగవే పిచ్చిపిల్ల!"
అనుచు, రాణికిమ్రొక్కి యయ్యతివవడిగ
వెడలియటనుండి, యలక్రొత్తపెండ్లికూతు,
'వమిత'యనురాకుమారువర్థాంగిఁదరిసె.
ఆమె, యద్దముఁగని యలకాళిదువ్వి
ఫాలమునదిద్దుచుండె సౌభాగ్యరేఖ;
శ్రీమతినిఁ, బళ్లెరముఁగాంచి, యామెకసరె,
"ఏవిపత్తునుఁగూర్ప నున్నావొ నాకు,
పొమ్ము తక్షణమిటనుండి పొమ్మునీవు".
ప్రణయకథపఠించుచు రాజతనయ, 'శుక్ల'
తన్మయతఁగూరుచుండె వాతాయనమున;
తలుపుతోనిల్చె శ్రీమతిద్వారముకడ;
తనచదువుపాత్తమున్ మానియనియె శుక్ల
"సాహసీ! మిత్తిదోరమ్ము జాడఁజొరకు".
ఇటులెశ్రీమతి యింటింటికేగితుదకు
పలికెనుచ్చైస్స్వరంబున వదనమెత్తి—
"రాజసౌధాంతరస్థితరమణులార!
బుద్ధదేవాలయమ్మున పూజసేయ
సమయమాయెను లెండిఁక జాగువలదు."
ఆమెముఖమున నే కొందఱతివలు తమ
తల్పులన్ మూసికొనిరి; కొందఱుదొడంగి
యామెఁబడఁదిట్టఁజొచ్చి రయ్యవసరమున

* * *

రాజభవనాగ్రతలగోపురమ్మునుండి
పగటితుదికాంతియున్ మాటుపడియె నెచటొ;
కాఱుచీకట్లు వీధులన్ గ్రమ్ముకొనియె;
జనులసందడియడఁగి నిశ్శబ్దమాయె;
యామినీపూజలకు వేళయాయెనంచుఁ
దెలిపెఁజేగంట శివునిదేవళమునుండి.

* * *

మిణుకుమనెడి నక్షత్రగణముదక్క—
తచ్ఛరద్రాత్రి గాఢాంధతమసవృతము;
కొంతదవ్వున బుద్ధుకోవెలవెలుంగు
దీపికలు చెట్లగుములఁ దేఁటపడఁగ
గాంచివనపాలకులు వింతగదురవడిగ
వాడికత్తులుదీసి దేవళముదూఱి
శ్రీమతింజూచి యిటు హుంకరించినారు:
"మృత్యుభయమింత లేని నీవెవ్వరితవు?
మూర్ఖురాల!" యన నిటులమ్ముదిత పలికె—
"శ్రీమతిని; బుద్ధదేవుని భృత్యురాల!"
ఉత్తరక్షణమందె యయ్యువిదహృదయ
రక్తమాశిలావేది నెఱ్ఱఁగనొనర్చె;
ఆప్రశాంతపువేళ బుద్ధాలయంపు
చరణసాన్నిధ్యమందు నక్షత్రకాంతి
నైక్యమొందెనా తుదిదీపికాళికాంతి.

—రవీంద్ర




## వ్యభిచారగృహనిర్మూలనచట్టము

వ్యభిచారగృహనిర్మూలనచట్టము చెన్నపురిరాష్ట్రశాసనసంపుటమున కెక్కి సంవత్సరముదాటినది. అయినను దాని నమలులోపెట్టుటకు ప్రభుత్వమువారు ఎట్టి ప్రయత్నములను చేయకున్నారు. వ్యభిచారగృహములమూలమున దేశమునకొనగూడుచున్న నష్టములు కొలదియిడరానివి. వానిమూలమున పుష్పములవంటి యువతుల జీవితములెన్నియో బుగ్గియగుచున్నవి; రత్నములవంటి యువకులజీవితములెన్నియో పచ్చముపాడగుచున్నవి; సంఘమున అవినీతి అల్లుకొనితీగెలుసాగుచున్నది; దుష్టరోగములు ప్రబలుచున్నవి.

కావుననే దేశహితమునాశించు మహనీయులు విశేషప్రయత్నముగావించి అట్టి గృహములను పెల్లగించివేయుటకు చట్టమును గొనివచ్చిరి. ఈచట్టమును గొనివచ్చుటలో ప్రముఖురాలగు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారిప్పుడు శాసనసభలోలేరు. శాసనము అమలులోపెట్టు ప్రయత్నములుగానరావు. ఇదిచూచి మద్రాసునందలి భారతస్త్రీసంఘమువారు సహింపజాలక ఈచట్టమును అమలులోపెట్టు విషయమై ప్రభుత్వమువారితో సంప్రదించుటకు ఒకసంఘము నేర్పఱచిరి. శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు ఈసంఘమునకు అధ్యక్షురాలు. గతమాసమున ఈసంఘమువారు హోంమెంబరును సందర్శించి వ్యభిచారగృహనిర్మూలనచట్ట విషయమున సంప్రదించిరి. ఈచట్టమును వెంటనే అమలులోపెట్టుటకు హోంమెంబరుకొన్ని అభ్యంతరములనుసూచించెను. సూచింపబడినఅభ్యంతరములివి: వ్యభిచారగృహములనుండి సంరక్షింపబడిన యువతులు నివసించుటకు తగినతావులేకుండుట. ప్రస్తుతచట్టమును రాజధానికంతకును వర్తింపజేయుట కష్టమగుట. ఈఅభ్యంతరములు రెండును నిలువజాలనివి.

వ్యభిచారగృహములనుండి సంరక్షింపబడిన యువతులు నివసించుటకు తగినతావు లేదనుట వ్యర్థవాదమని సంఘమువారు సూచించిరి. మద్రాసు శిశుసహాయకసంఘమువారు

ఇపుడు వ్యభిచారగృహములనుండి సంరక్షింపబడిన వారిలో పదునాఱుసంవత్సరములకు లోబడిన బాలికలకు ఆశ్రయమిచ్చుచున్నారు. ఆశ్రయమిచ్చుటయేగాదు వారు స్వతంత్రముగ జీవించుటకు అనువైనవృత్తివిద్యయందు వారికి తరిబీయతు నిచ్చుచున్నారు. సదరు శిశుసహాయకసంఘమువారే అవసరమున్నచో పదునాఱేండ్లకు పైబడిన పడతులనుగూడ లోగొనుటకు పూనుకొనవచ్చును. మదరాసు విజిలెన్సు సంఘమువారు ఇట్టియువతులకొఱకు ప్రత్యేకము శరణాలయము స్థాపించుటకు భగీరథప్రయత్నములుచేయుచున్నారు. ఈవిషయమున వారికి భారతస్త్రీసంఘమువారును బాసటయగుచున్నారు. పైగా సాల్వేషనుఆర్మీవారి శరణాలయముగలదు. వర్ణముతోడను, వయసుతోడను నిమిత్తములేకనే అందు పడతులు సంరక్షింపబడుచున్నారు. కాగా వ్యభిచారగృహములనుండి సంరక్షింపబడిన యువతులు నివసించుటకు తగినతావు, శరణాలయములేదనుట సాహసమేయగును. రంగూను, కలకత్తా, బొంబాయి, కొలంబొనగరములయందు ఇట్టిచట్టము అమలులో నుండుటయేగాక అచ్చటి శరణాలయములు ఆయాప్రభుత్వముల ప్రత్యేకధనసాహాయ్యమును పొందుచున్నవి. శరణాలయస్థాపనమునకు ధనసహాయముచేయ నొల్లకుండుటకుతోడు మద్రాసుప్రభుత్వమువారు అట్టిశరణాలయములకు అవసరమేలేకుండునట్లు చట్టమును అమలులోపెట్టకనేయున్నారు.

చట్టమును అమలులోపెట్టుటకుగల రెండవఅభ్యంతరము ప్రస్తుతచట్టమును రాజధానికంతకును వర్తింపజేయుటకష్టమని. తొలుతచట్టము ఒకమద్రాసునకు వర్తింపించునట్లే ఉద్దేశింపబడినది కాని శాసనసభవారు కూలంకషముగ విమర్శించి చట్టమును ఒక్కమద్రాసునకే వర్తింపింపజేయుటలో విశేషలాభముకలుగదనియు, మద్రాసులోనిర్మూలింపబడిన వ్యభిచారగృహములు రాజధానియందలి ఇతరపట్టణములకు వలసబోవుననియు, కావున చట్టమును రాజధానికంతకును వర్తింపజేయవలయుననియు తీర్మానించిరి. తిరిగి ఇప్పుడు చట్టము ఒకమద్రాసునకే వర్తించునటుల మార్పుజేయ ఆలోచించుచుంటిమని హోంమెంబరు వచియించెను. కంచముమార్చి మట్టెలు, మట్టెలుమార్చి కంచము అన్నట్లు చట్టమును తికమకలు చేయుటయేగాని అమలులోపెట్టు ఆలోచనలేదని ఇందుమూలమున స్పష్టమగుచున్నది. ప్రజాహితమును కాంక్షించుచో ప్రభుత్వమువారు కొంచముకష్టమైనను చట్టమును రాజధానికంతకునువర్తింపింపజేయుట లాభప్రదము. కాని ఒక్కమద్రాసునకే చట్టమును వర్తింపింపజేయుచో వ్యభిచారగృహములు స్థానభ్రష్టతనొందునుగాని సమసిపోవు. అవిచల్లగ కూము స్రోతస్వినీకూలమునుండి ఇతరప్రదేశములకు ప్రవహించును. ఇది కోరదగినదియా?

ఏవియోసాకులుకల్పించి ప్రభుత్వమువారు వ్యభిచారగృహనిర్మూలనచట్టమును ఆచరణకు గొనిరాకుండుట వారికి ప్రతిష్ఠగాదు. ఇప్పటికే సహింపరానికాలహరణము జరిగినది. ఇకనైనను ప్రభుత్వమువారు ప్రజాహితమునెంచి శీఘ్రముగచట్టమును ఆచరణలోనికి గొనిరావలయునని కోరుచున్నాము.

# పరాసుపతివ్రతలు

**శ్రీమతి రాజేశ్వరిగారు**

పడఁతికి పాతివ్రత్య మొకసహజధర్మము. దానికి దేశకాలవైపరీత్యములతో పనిలేదు. ప్రాణనాయకునిముందట నొదిగియుంటకు పావురమామె—ఆత్మార్పణమున కనాసక్తయోగిని—భర్తృసాహచర్యమున పగపట్టినపాము—విభురక్షణమున వేలమెరుగనియాఁడుసింగము. తల్లియై, భార్యయై, సోదరియై, యామె తెగువచేయని సాహసకృత్యమరిది.

*     *     *     *     *

ప్రపంచచరిత్రమున, పరగోళములకెగఁబ్రాకునంతటి స్వాతంత్ర్యసంచలనము, ఫ్రెంచివారిదేశమున పదునేడవ శతాబ్దిచివర కలిగినది. ఆగర్భశ్రీమంతుల సాముదాయిక జాలకమునకు మారకదశచేకూరినది. పెనుగాలికి పండ్లవలె బుజములనుండి తెగి శిరసులురాలినవి. సంహారణావేశమదోన్మత్తులగు సామాన్యప్రజలకు వినోదముగా శాతాసిధారావిచ్ఛిన్నములగు మానవోత్తమాంగములు తట్టలలోనిడిన తాటిపండ్లయినవి.

*     *     *     *     *

స్వాతంత్ర్యము (Liberty), సర్వసమత్వము (Equality), విశ్వభ్రాతృత్వము (Fraternity) అను ముమ్మొనవాలు చేతబట్టి, ప్రళయభీకరుడగు కపాలభిక్షువే పరాసుప్రజాసందోహము (Republic) నావేశించెను.

*     *     *     *     *

రాజశబ్దముచ్చరించినవాడు మరునాటి సూర్యోదయము చూచుట కనర్హుడు! రాజభక్తి సద్యోమృతిప్రదమగు నశనిపాతము!

*     *     *     *     *

ఆభీషణకాలగర్జాఘోషమున నిట్టపొడసూపి కాటుక మింటఁగలసిపోయిన విద్యుల్లతలెన్నోకలవు.

*     *     *     *     *

### లేఫర్జుసతి

భర్తను ప్రజాద్రోహియని చెరలోనుంచిరి. ఆమెయెట్లో కష్టించి యతడున్నగదిలోనికి ప్రవేశముగనెను. రెప్పవయు నంతలో యొకరిదుస్తులొకరు ధరించిరి. భర్తపైకిదాటి వచ్చెను. మరునాడు ఉరికంబమునొద్ద ప్రజానుశాసకుడామె నిజవ్యక్తిత్వముగ్రహించెను.

“ఓసీ, ద్రోహీ, దారుణము! ఏమొనర్చితివి?”

“నావిధిమాత్రము. నీవిధినీవొనర్పుము.”

మరునిముసము చిర్నగవుమోముగల యామెశిరసు నక్షత్రమువలె నేలకు తెగిపడెను.

* * * *

### మార్షల్ డిమాచీ భార్య

మార్షల్ డిమాచీ ప్రజాకింకరులచేబద్ధుడై శిక్షాస్థానమునకు తేబడెను. అతనిభార్యకూడ వెంబడించెను. “నీపై నేరారోపణములేదు. పో” మ్మని ట్రిబ్యునలు సెలవిచ్చెను. “శిక్ష అర్థశరీరమునకుమాత్రమేయెట్లెత్తు”రనివాదించి యా వీరసతి భర్తృకరావలంబనయై యమసోపానములెక్కెను.

* * * * *

### రోలెండుసతి

రోలెండుసతి తనఅంతిమవాంఛగా “భర్తశిరసుతోపాటు తనశిరసును ఒకతట్టయందేయుంచుటకు” కోరుకొనెను.

* * * * *

### బోయరుసతి

కత్తివ్రేటునకు తలయొగ్గినభర్తకు బోయరుసతి హెచ్చరిక :—“నాథా! హృదయావేగమువలదు—మీతరువాత వచ్చునదినేనే.”

* * * * *

ఆనాటి జగతీకంపమున కంకితముగా, నిట్టిరక్తతారక లెన్నో నభోంతరాళమున విరిసి కనుమొరగినవి! అక్షరము లగు వారియాత్మజ్యోతులకు నమోవాకము!

# కాకరకాయ

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

దీనికి సంస్కృతమున కారవేల్ల, కఠిల్లక, సుషవి, కారవేల్లక, రాజవల్లీ, కుషవీ, తోయవల్లీ, ఊర్ధ్వాపీత, కండూర, కాండకటుక, సుకాండ, ఉగ్రకాండ, కఠిల్ల, నాసాసంభేదన, పటు అనునామములుగలవు.

హిందూదేశమున నిరియెల్లయెడల తోటలయందు పెంచబడుచున్నది. లేనంతటనదియే పెరుగుటయు గలదు. కాకరతీగె పాతీంచుపాదుజాతులలో చేరినది. కాడ గెణుపులుగనుండును. ఒక్కొక్క ఆకు అయిదేసి కొనలు తేరియుండును. (కాయపొడుగుగను సన్నముగను ఉండురక మొకటి; పొట్టిగను సుంద్రముగను ఉండు రకమొకటి. కాయలు పాటకరించిన మెంటిమలతో గరుకుగానుండును. గింజలుచుట్టును నక్కులుగలిగి యుండును. కాకరపూవులు లేతపసుపురంగుగానుండును.

కాకరకాయ స్వస్తికరమైనది. కావుననిది విరివిగకూరగ ఉపయోగింపబడుచున్నది. పొడుగు కాకర రకము, పొట్టికాకరరకముగాక అడవికాకరయను భేదమొకటిగలదు. చిరితపత్రః, సూక్ష్మవల్లీ, కాండకటుకః, పీతపుష్పః అను కాకరకుగల సంస్కృతనామములనుబట్టి దానిరూపపరిచయము నొందవచ్చును.

కాయ రసాయనికగుణములు కలది. జీర్ణశక్తిని ఉద్దీపింపజేయును. పైత్యహరము, విరేచనకారి, బలవర్ధకము. కాకరపండుగుంజు, కాకరాకుపసరు, గింజలు క్రిమిహరములు. కాకరాకులు స్తన్యవర్ధనీగణమునకు చెందినది. కాకరవేరు వగరుగానుండును. ఔషధోపయోగములందు దీనిని సమూలముగనుపయోగించెదరు.

## సాధారణగుణములు

పెద్దకాకరకాయల సాధారణగుణములను తొలుత తెలిసికొందము. పెద్దకాకరకాయలలో వానిరంగును బట్టి రెండురకములు ఏర్పడినవి. ఆకుపచ్చగనుండునదొకరకము, తెలుపుడాలుగనుండునదొకరకము. ఇందు తెలుపురంగుకాయలు శ్రేష్ఠములు. పెద్దకాకరకాయలు చిరుచేదుగ రుచిగనుండును. కండ్లకుచలవచేయును. మేహము, వాతము, జ్వరము, కాసశ్వాసలు, కుష్ఠువీనిని హరించును. కొద్దిగకాక, పైత్యముకలిగించును. జఠరదీప్తినిగలిగించును. కడుపుకుతేలికనిచ్చును. వీర్యస్తంభనచేయును. అతిసారమును, శ్లేష్మమును, క్రిమిరోగమును అణచును. చల్లలోనుడికించి వార్చి పోగిచిపుచ్చుకొనిన ఆరోగ్యముగనుండును. ఈరకములేత కాయలు త్రిదోషహరమైనవి. సర్వరోగములను జయించును. ముదురుకాయలు విరేచనముచేయును, అగ్నిదీప్తినిచ్చును. పైత్యమునుకలిగించును. కాకరపండుకఫమునుపోగొట్టును. రుచినిబుట్టించును. పైత్యము, వాతము, గుల్మమువీనినికలిగించును.

ఇక పొట్టికాయలనుగూర్చి వివరింతము. ఇవిచేదుగనుండును. త్రిదోషములనుహరించును. జ్వరము, దద్దురు, కుష్ఠు, విషము, కఫము, వాతము, క్రిమిరోగమువీటిని పోద్రోలును. సర్వరోగములను అణచును. రుచినిపుట్టించును. కండ్లకు మేలుచేయును. తేలికగనుండును. జఠరదీప్తిని కాంతిని ఇచ్చును. కొద్దిపైత్యము కాక జేయును. ఇక అడవికాకరనుగూర్చి విచారింతము. అడవికాకరకాయలు మిక్కిలికాకచేయును. త్రిదోషములను, విషములనుహరించును. నోటియందు నీరూరుట, కాసశ్వాసలు, మూలవ్యాధి, క్రిములు, కుష్ఠువు, వ్రణములు వీటినిహరించును.

కాకరపండు కాలిబొటనవ్రేళ్లకు వంశపరంపరగావచ్చే వాతరోగము, కీళ్లనొప్పులు, కార్జముప్లీహము వీనికి సంబంధించిన రోగములను శమింపజేయుటలో ఉపయోగకారిగనుండును. రక్తశుద్ధిచేయును. చిత్తవికారములను, ఉద్రిక్తభావములను తగ్గించును. కాకరాకురసము వెగటుగచేదుగనుండును. కాకజేయును. శీతవాతజ్వరములను, చర్మరోగమును, క్రిమిరోగమును, శ్లేష్మమును, కుక్కనక్క కాట్లవిషమును, పాండువును హరించును. రుచినిబుట్టించును. జఠరదీప్తినిచ్చును. విరేచనముజేయును.

## గృహవైద్యము

పొట్టికాకరచెట్టు సమూలరసము, దాల్చినిచెక్క, పిప్పళ్లు, ఓయ్యామము, నీరుడివిత్తులనూనె వీనితో చేసిననూనె లోపలికిచ్చిన గజ్జి, కురుపులు, చిడుము మొదలగు చర్మరోగములను మాన్పును. చర్మముపై పూయుటకుగూడ దీనినివాడవచ్చును.

పొట్టికాకర సమూలచూర్ణము పైనచల్లిన కుష్ఠువ్రణములు, మురికివ్రణములు మానును.

పచ్చికాకరాకులపసరు పిల్లలకు విరేచనమగుటకు ఈయబడుటకలదు. కాని యిదినిరపాయకరమైన దని చెప్పుటకు వీలులేదు.

పిత్తాధిక్యమున వమనముకలిగించుటకు, విరేచనముచేయుటకు సోలెడుకాకరాకుపసరు ప్రత్యేకము గాని గంధపొడితోకలిపిగాని ఈయబడుచున్నది. ఓయ్యామము, నేయిదీనికి విరుగుళ్లు.

కాకరాకుపసరులో అరగతీయబడినగంధము కనుగుంటచుట్టును పట్టువేసిన రేచీకటినయమగును.

అరికాళ్లమంటలయందు కాకరాకుపసరు దినమునకు రెండుమూడుసారులు వ్రాయుటమంచిది.

ఒక అరతులము కాకరాకుపసరునందు కొంచము పసుపుగుండవైచి పిల్లలకు అరోచికముగనున్నప్పుడు ఇచ్చినచో వారికి దోకులువెళ్లి కడుపుశుద్ధిమును లేలికయునగును.

పిల్లలకు ప్లీహామునకు సంబంధించిన బాధకలిగినపుడు కాకరాకుపసరు, సీమచింతాకుపసరు, పండు తామలపాకులరసము, పచ్చినేరేడుపట్టతోకలిపి మర్దించబడిన సస ఈవస్తువులు ఏకముగాచేర్చి ఏడు దినములు ఈయవగును. మూలవ్యాధియందు కాకరవేరుగంధముపైన పట్టువేయుటకు వాడబడుచున్నది.

కాకరపండు చితుకగొట్టి తీసినరసము ఒకచెమ్చాడు సీమసున్నతోటిగాని పంచదారతోటిగాని కలుపబడి నోటిపుండ్లయందు వాడబడుచున్నది. బుతుబద్ధము పోగొట్టుటకు వినియోగింపబడుచున్నది. తలపుండ్లు, ముండు, కాలినపుండ్లు వీనియందును ఇది వాడబడుచున్నది.

వాతరక్తమునందు కాకరకషాయముతో చేసిన ఔషధములు వాడబడుచున్నవి. జ్వరితునకు కాకరకాయ హితమైనది. కాకరాకులరసమునందు పసుపువైచి త్రాగినచో జ్వరములు, స్ఫోటకము శమించును. కాకరవేరును గంధముతీసి లేపనముచేసిన బాహ్యాంతరములగు యోనిరోగములుపోవును. కాకరాకుపసరు నూనెతోకలిపి విషూచిరోగమునందు వాడిన హితము. కుఱుపుమచ్చలు, తదితరమగు చర్మగతరోగములందును కాకరసమూలముగ దాల్చినిచమురు మొదలగువానితోకలుపబడి వాడబడుచున్నది. కుష్ఠురోగమునందు కాకరపండు పైనపూయబడుచున్నది.

కాకరాకురసము మోతాదు 1 లేక 3 తులములయెత్తు. కాకరకాయ కాకశరీరులకునష్టముకలిగించును. ఈకాయకువిరుగుళ్లు నెయ్యి, పులుసు, ఆవాలచూర్ణము, అగాకరకాయలు, దోసకాయలు.

## పాకవిశేషములు : వానిగుణములు

కాకరకాయపచ్చడి చేదుగనుండును. పైత్యమునుబోగొట్టును. క్రిమిరోగమును నిర్మూలించును. రుచిబుట్టించును. మూలవ్యాధిని శాంతింపజేయును. కాకరకాయ ముక్కలుగకోసి ఎండించివరుగుచేసి నిలువయుంచుకొందురు. ఈవరుగునేతిలోవేయించినను, కూరవండినను చిరిచేదుగ మనోహరముగనుండును. రుచిని బుట్టించును. త్రిదోషములనుహరించును. ఆరోగ్యవర్ధకము.

కాకరయూకుకూర చేదుగనుండును. క్షయరోగము, పైత్యము, కడుపుబ్బు, జ్వరము, మేహము, క్రిమిరోగము, విషము వీటినిహరించును. వీర్యమునకు వేడిచేయును, రుచిని గలిగించును.

## పైరు : కాపు

కాకరవిత్తులను వర్షకాలాంతమున పొట్లవిత్తులవలెనే బోదెలలోనాటి పందిరివేసి దానిపైకి తీగలను పాకింపవలయును. శీతకాలమునందును, వేసవికాలమునందును కాకరపాదు బాగుగకాయును.

# త్యాగము

వడ్లమూడి వేంకటరత్నముగారు

లోకమునందు నర్థిజనలోకము విన్నదనంబుగాంచి యు
స్తోకకృపాతిరేకమునఁ దోఁచినవస్తుచయంబులిచ్చుచున్
వీఁకఁదనర్చువారలు దివింజరియింపఁగ నుత్సహించువా
రీకృతిఁ గంకణంబుధరియించినవారలు పెక్కురెంచినన్.

కాదనరాదుగాదె మెయిఁగల్గినమాంసము ఖండఖండము
ల్గాఁదగఁజేసికాచుట ఖగంబొకదానిని, వెన్నునెమ్ములన్
బ్రోదియొనర్చి యింద్రుకరపుష్కరసంపుటియందు భక్తితో
నాదటనప్పనంబొసఁగునాతనిఁ గాదననౌనె యేరికిన్.

లేరసలేము యాచకులలేమి దలంగఁగ స్వీయవైభవో
దారపదార్థజాతములు తక్కకయిచ్చు వదాన్యచంద్రులీ
ధారుణిఁ, గాని నీకరణి త్యాగమొనర్పఁగలారిఁగాంచఁగా
నేరుచునేరరంచు వచియింపఁగనౌఁ జెయియెత్తి కామినీ!

నీకై సల్పి వ్రతోపవాసములు దా నిష్ఠాత్మయై ప్రేమపా
శైకప్రాభవశక్తిచేత నవమాసాపూర్తిగామోసి నీ
కేకష్టంబును లేక పెంచుజననిన్ హృత్కంజమందుంచి ప్రే
మాకారమ్మున నన్నుఁగొల్తుగద జాయారూపవై కాంతరో!

జననంబాదిగ బొమ్మరిండులను నచ్చన్గాయలన్ స్వేచ్ఛమై
తనియన్ లీలలఁబుచ్చి యెల్లరును జెంతంజేరి యాహారముం
దినుచున్ బాహులతల్గళంబునను సంధిల్లంగ భేదంబులే
కను నిద్రించెడి చెల్మికత్తెల భ్రమల్గానంగనీవో, సతీ!

అరుగో! తండ్రియొసంగినట్టి మధురాహారంబులం దామెయొం
టరిపాటన్ దినలేక గ్రుక్కలిడుచున్గాంక్షించుచున్నారు నీ
కొఱకై సోదరు లీక్షణంబులరుచుల్ గ్రువ్వంగ నీవట్టు లే
మరియైనం దిలకింపఁగోర విదియేమాహాత్మ్యమో మానినీ!

ఇదినాదేహము నాదుమానసమునా నింతేనిభావింప కె
య్యెదినీకుంగలదద్ది 'సర్వమును నీదే'యంచు నాత్మేశు స
త్పదకంజంబులచెంత నిర్మలమనోభావంబులం దప్పనం
బదిగావింతువదేమి చెల్లదొకో యావంతేనహంభావమున్.

అబలవటంచు నిన్నుఁ బలుకాడునుగా పురుషుండు ధాత్రిఁదాఁ
బ్రబలుఁడుగా యదేది యొకమాటిటు నీవలెస్వీయభావమున్
విబుధులు మెచ్చఁబో విడిచి నిశ్చలబుద్ధిని నన్యనమ్ముమం
చుఁబలుకుము పైకొనఁబఱుఁజమ్ము బలాబలభేదభావముల్.
నీకుముదంబుగల్గునెడ నిల్చునుకల్మలకొమ్మ యెచ్చటన్
నీ కసుఖంబుగల్గు నది నిస్తులపాపగృహంబటంచిలన్
వాకొననేలకో యిటులఁ బ్రస్తుతియించనుకొంటిఁగాని నీ
యాకమనీయశక్తిఁగని యెంచితి నీమహిమంబు కాంతరో!

మానినీమణి! నీత్యాగమహిమఁగాంచ
నబ్బురంబొదవుచుండు మాయాత్మలందు
చాగమునయందు నీతోడఁదూఁగువారు
భువనమున లేరు; ముందును బుట్టఁబోరు.

## చీఁకటికన్నె పెండ్లి

శ్రీమతి వడ్లమాని నారాయణమ్మ గారు

చీఁకటికన్నె పెండిలికిఁ జేరిన భర్తపసిండిరిక్క ము
ల్లోకములందు వెల్గెను విలోకనముల్ కురియించి వెంటనే
భీకరతామసీప్రణయవీథుల తాండవమాడుచుండ నే
లాకను లెత్తకే నిదురలన్ పడి క్రుంగెను లోకమింతలో.
సంజమొయిళ్లలో బ్రతుకు చక్కని పెండ్లికుమారు తారకే
యంజనమోతగిల్చి 'తగు'దంచు, 'తమస్విని మాకుమారి నీ
కుంజవదాట'దంచు నొకకోరికలేని పసిండితారకై
యంజలిసాచి లోకమది యార్ద్రమతిన్ బొనరించె పెండిలిన్.
అంతట పెండ్లికూతు హృదయాశయముల్ గమనించి తాను న
త్యంతముసంతసమ్మున సుధామయమైన రహస్యగీతముల్
వింతగపాడు తారకకు వీడనికౌగిళులిచ్చు చీఁకటిన్
స్వాంతమునందు మెచ్చికొనజాలక లోకము నిద్దురించెడిన్.
ఒక్క రహస్యజీవితము నూరక యీవలకీడ్చినంత తా
నక్కజమైన రేయి హృదయమ్ముగ బంగరుచాయతారగా
నిక్కలుమ ప్రపంచమున నెవ్వరికందని ప్రేమగీతికల్
మక్కువమీరి పాడుకొనుమాదిరినయ్యె మదీయజీవమున్.

# పిచ్చికమ్మ

రాయసం వేంకటశివుఁడుగారు

౧

శోకమునమునింగియుండు జనులకెప్పటికిని ప్రొద్దుపోదు! మనస్సునావరించియుండు దుఃఖతిమిరము పగలు వెలుతురును, రాత్రి కూర్కును కంటినుండిపారద్రోలి, అహర్నిశల కఖేదముగలిగించుచుండును. అట్టి మనుజుల ఇంద్రియజ్ఞానము వన్నెవాసియుండును. కనులుచూచుచునే చూడకుండును. చెవులువినుచునే వినకుండును. దైవోపహతుఁడైన యావ్యక్తిమీఁద లోకమెల్ల సత్యాగ్రహముపూనినట్టుగ, సామాన్యజనులను రంజింపఁజేసెడి సృష్టిక్రమమేవానిమనస్సున నేమార్పునుచేయదు, ఏమాత్రము సంతోషమునుగలిగింపదు.

మీనాక్షీ యిప్పుడిటులేల శుష్కించియున్నది? పాలిపోయినబుగ్గలు, తేలిపోవుచరణములు, నడికట్టు, నులకమంచము,—ఈమెబాలెంతరాలని చెప్పకయె చెప్పుచున్నవి! పాలసముద్రమునుప్పొంగించు బాలచంద్రునివలె జననికి నేత్రోత్సవము సలుపు శిశువచటనెందునులేఁడే! ఓహో, జ్ఞాపకమువచ్చినది. చందమామవలె వదనబింబమువెలింగెడి మీనాక్షీబాలిక, పుట్టిననెలలోనె చనిపోయెను! ఆశిశువును గుఱించినవిచారమున పాపమాతల్లిమనస్సు రేయింబగళ్లుకళవళించుచున్నది! రూపురేఖావిలాసములతో నొప్పెడియాచక్కనిచుక్క, కన్నతల్లికడియాసలుగొలిపి, తుదకు సూర్యోదయసమయమందలి వేగుఁజుక్కయైపోయెను! చాలుఁజాలును సంతానపుసంబరము! మరలమీనాక్షీ నలుగురిమొగమును జూడఁగలదా? చిన్నికూఁతుని జీవితముతోనెయా మెదలిసంతోషము తెల్లవాఱిపోయెను. ఇంకముందుతానెప్పుడును, మందహాసమైనఁజేయక, సతతము తనమృతబాలికనుగూర్చియె తలపోయుచు, దలవాల్చి, దినములుగడుపుచుండునని మీనాక్షీతనమనస్సున నిశ్చయించుకొనెను!

౨

## పిచ్చికపిల్ల

పుత్రశోకార్తకావుననే యాయబలకిపుడు చేరువపెరటిలోని చెట్టుమీఁదిపిట్టలధ్వనులు వినరాకున్నవి. తనగోడువరయె తనకుసరిపోయి, చెంతలోమునిగియున్న యాదీనవదనకు పక్షులరవములజోలియేల? కాకులకూఁతల మధ్యకిచకిచమను నొకచిన్నయార్తనాదము అపుడపుడువినవచ్చుచుండెను. కాకులేదైన పిట్టనెత్తికొనివచ్చినవా? చూచుచునే తనపిల్లలనుగోలుపోయిన యాతల్లికి, పక్షులరక్షణతోఁ బ్రసక్తియేమి? ఇట్టితలఁచి వైరాగ్యమువాని యావనితయూరకకూర్చుండెను. కాని, చిన్నగొంతుకచప్పుడు హెచ్చి, యామెను పెరటిలోనికడుగుపెట్టునట్టుగ త్వరపెట్టెను!

ఒకప్పుడు మనముబుద్ధిపూర్వకముగఁ జేసికొనిననియమములు నిశ్చయములును వివేకరహితములుగను, అవిచారితముగఁజేసినవి అత్యుత్తములుగను బరిణమించును. మీనాక్షీపెరటిలో నడుగుపెట్టిననిముసమందే, చెట్టుమీఁదికాకులనుండి తప్పించుకొని, నెత్తురుగ్రక్కుపిచ్చికపిల్లయొకటి నేలపడెను! ఆయిల్లాలు క్షణమేనియుపేక్షచేసినచో, కాకులాయెరనుకొట్టవేసికొని పోయెడివియె! కాని యాపుణ్యవతి, చప్పట్లుకొట్టి, ముందుకుఁబరుగిడఁగనే కాకులుచెల్లాచెదరైపోయి, చెట్లమీఁదవాలి చూచుచుండెను. ఇంతలోమీనాక్షీ, యాపిచ్చికకందునుజేరఁగొని దానిని తనగదిలోనికట్టె తీసుకొనిపోయెను.

పాపమాచిన్నపిట్టగుండియలు భయాతిరేకమున తటతటమని కొట్టుకొనుచుండుట మీనాక్షీగనిపెట్టెను! ఈమానిసిచేతులలోఁ దనకేమిమూఁడునోయని పుల్కుపుల్కున పక్షిపిల్లయాకలికి కనులదెసఁజూచుచుండెను!

నిముసముక్రిందటనే వైరాగ్యమూనిన యావేదాంతిని హృదయమిదిచూచి కరఁగిపోయెను. ఆనెలఁతకుఁగనుల నీరుఁగ్రమ్మెను—పక్షి యొక్కలక్రింది నెత్తురుబొట్లు గుడ్డతోనొత్తివైచి, దానినక్కునఁజదిమిపట్టి, ఎటులైన దానిని రక్షింపవలయునని యుద్యమించెను. తనకెన్నికష్టములు వాటిల్లినను, ఆచిన్నపిట్టను గాపాడవలెనని యాదయావంతి నిశ్చయించుకొనెను.

ఒక జీవినికాపాడ నెంచుట సులభమే కాని, సంరక్షించుటమాత్రము కష్టసాధ్యము. బాల్యావస్థనుండు ప్రాణిపరిపోషణము దుస్సాధ్యము! సృష్టికార్యక్రమ మెంతటివిచిత్రమో కాని, తల్లి పెంపుదప్పిన శిశువును క్రమముగ సంరక్షణచేయఁగల మాఱుఁదల్లి లోకమునఁ గానఁబడదు! దీనికితోడు, మనుష్యజన్మమెత్తిన స్త్రీయొక పిచ్చిక పిల్లకెట్లు పెంపుడుతల్లి కాఁగలదు? ఐనను, ఆలోచించినకొలఁదిని, ఆపిచ్చికకందును రక్షింప మీనాక్షికి పట్టుదల హెచ్చెను. శిశువియోగదుఃఖమందెడియాతల్లికి, మాతృవియుక్తమైన యాపిచ్చికకందువమీఁద నెక్కుడు ప్రేమవాలెను! ప్రేమ యొక జాతియున్మత్తతయని కవులువర్ణింతురు. పిచ్చిబాలెంత చిట్టిపిచ్చివేసములు వేసి, యారోగ్యము చెడఁగొట్టుకొనరాదని తలిదండ్రులువారించిరి. కాని మీనాక్షికి, తనపిల్లయే యెట్టులో ఆపక్షిరూపమునవచ్చి తనశరణుఁజొచ్చెనని భ్రమగలిగెను! కావున, కంటవత్తినిడుకొని యాపిచ్చుకపిల్లను పోషింపనామె యుద్యమించెను.

ఒక్కొకరికి ఎంతటిస్వల్పకార్యమునకైన పెద్దయాటంకము లాసన్నమగుచుండును! పిచ్చికపిల్లను బెంచనెంచిన మీనాక్షికి మతిచంచలించెనని చెలికత్తెలు పరియాచకముచేసిరి. చనిపోయిన శిశువునకై వగచెడి తనయకు పిచ్చికపిల్లపెంపు మతింతవెతను బెంచునని తల్లిభయము. దేహమున మొదలు సత్తువలేని తనసుత కల్పించుకొనినయీపనిచే నీరసము హెచ్చి, మాలపడునని తండ్రిభీతి. ప్రసూతిక పరోపకారబుద్ధివహించి మంచమెక్కుట అనుచితమని పెద్దలవారింపు. కన్నపిల్లనుగోలుపోయి, తుదకు పిచ్చికపిల్లమీఁద భ్రమవాఱిన యాబాలెంతను, ఇరుగుపొరుగులయమ్మలక్కలు వెక్కిరింపసాగిరి. మీనాక్షియాపనిని జేయలేదనికొందఱు, చేయరాదనికొందఱును, ఆవాడగల యాఁడుపుట్టువులు పరిపరితెఱఁగులఁదలపోసిరి.

## 3

## పక్షి బస!

ఇతరులవారింపులు మీనాక్షిమనోనిశ్చయమును మతింతదృఢపఱచెను. ఎటులైన నానోరులేని పిట్టను బెంచవలెనని యామెపడతిపట్టుపట్టెను. ఆవనితపరోపకారబోధమునకు, వసతిగృహనిర్మాణము మొదటిసోపానము! మనుష్యశిశువునకేయుయ్యాలయో సిద్ధముచేయవచ్చునుగాని, పిచ్చికపిల్లకే యిరవునమకూరునని యాయిల్లాలుతల్లడిల్లెను. వెనుకటిచిలుకపంజరమొకటి తమ యటుకమీఁదనుండుట ఆమెకప్పుడుజ్ఞాపకము వచ్చెను. అది తీసిచూడఁగా, త్రుప్పుపట్టియుండెను. కొన్నికమ్ములువిఱిగిపోయెను. తక్కినవియొడ్డమై యుండెను. మీనాక్షియోపికతో దానినిశుభ్రపఱచెను. వెదురుబద్దలతో పంజరమును బాగుచేసెను. ఆసాయంకాలము చెలికత్తెలు వీరింటికివచ్చిచూచి, "సెబాసు, మీనాక్షీ! నీపెంపుడుకూఁతును పాలకిలోఁగూర్చుండు పెండ్లికూఁతునిఁజేసినావె! ఎన్నిసాధనములుచేసి, సదుపాయములు కలిపించినావు!" అని యాశ్చర్యపడిరి.

## ౪

## పిచ్చికపిల్లకు మేత యేమి?

మీనాక్షికంతట నింకొకకఠినసమస్యగానవచ్చెను! పిచ్చికపిల్లకిప్పటికి వాసమేర్పడెనుగాని, గ్రాసము మాటయేమి? ఆరగింపువిషయమున, పిచ్చికపిల్ల బిడియపడు పెండ్లికూఁతురయ్యెను! అదియేమితినును?

ఆఁకలిబాధతో 'చిర్పు' 'చిర్పు' మని సదా యఱచుచు, మీనాక్షి యేతినుబండము బెట్టిచూచినను పిట్ట మూచూచి పెడమొగము పెట్టుచుండెను! పిచ్చుకపిల్ల కేమి మేఁత పెట్టవలెనని యావాడఁగలయింటింటికిని మీనాక్షి చిన్నచెల్లెలుపోయి యడిగినప్పుడు, దానినిజూచి నవ్వుచుందురే కాని, ఎవరును తగినసమాధానము చెప్పలే కుండిరి! ఓపికవీడక మెతుకులు, నానపెట్టినగింజలు, మొదలగువస్తువు లెన్నెన్నియో తెచ్చిచూపి, మీనాక్షి యెట్టులో దానికడుపునిండించెను!

కొన్నిదినములయనేక వారియింటికేఁబోయి చూచినవారికాశ్చర్యము గొలుపుచు, పంజరమునందలి పిచ్చుక పిల్ల బలముపట్టి యాడుకొనుచుండెను! ఇపుడు దానికే వేళలందే మేఁత వేయవలెనో పెంపుడుతల్లి కనుభవ వేద్యమే! ఆపిట్టకాహారపానీయములు సమకూర్చుట, దానిగిన్నెలుతోముట, పంజరము బాగుచేయుట మొద లగు చిన్నిపనులతోనె మీనాక్షి కిపుడు కాలక్షేపము! మీనాక్షి తనమృదువగు చేతులతో పట్టుకొంటే యాపిట్ట ఈకలునిమురునపుడు, చెరలాటములాడు పక్షిముక్కులతో తల్లివ్రేళ్లనుపొడుచుచుండును! తనప్రక్కల నామె మేనికిరాయుచుండును. జననిముందు నృత్యమాడుచు, 'చిర్పు' 'చిర్పు'మని సంగీతముపాడుచుండును. పుత్ర శోకార్తయగు మీనాక్షి యిట్లు పక్షిపరిచర్యలలోఁ గాలముఁబుచ్చుచు, మెల్లమెల్లగ తనదుఃఖమును మఱచిపో సాగెను. పందిరికొయ్య నెగఁబ్రాకుపాదుతీఁగవలె ఆకోమలి డెందమందలి పుత్రమోహము, కనులముందరి పిచ్చుకపిల్ల నెసఁబ్రసరించి, ఆకారణమునఁ జిగిరింపఁదొడఁగెను! పచ్చికత్రనుండి పెడమొగము పెట్టు నిష్ప కణమువలె, ప్రేమపూరితమగు నాలేమమదినుండి శోకవహ్ని యెగిరిపోయెను! ఆశోత్సాహపూరితమగుమనస్సు రోగాంకురములను దేహముదరికిఁ జేరనీయకుండును! మీనాక్షికి శరీరమున క్రొత్తనెత్తురుపట్టెను. ఆమె సుందరవదనమిపుడు నూతనకాంతులతో తేజరిల్లుచుండెను. వారియింటికి పెత్తనములకువచ్చి పరామర్శచేరిట మీనాక్షి మనసున నానాటనిగురుగప్పుచుండెడి దుఃఖాగ్ని నికలికి రగులఁజేయుచుండెడి యంగనామణులు, తమసానుభూతి కిపుడవకాశములేక, తమప్రణాళికను మార్చుకొని, దినదినప్రవర్ధమానయగు యాసుదతి పెంపుడుకూఁతుని సుఖస్థితికభినందనములు గుప్పింపసాగిరి! నేస్తురాండ్రు నిరతమును, "మీనాక్షీ! నేఁడేవీ నీపెంపుడుకూఁతుని క్రొత్తవిద్యలవార్తలు!" అని కుశలప్రశ్నలుకురియించి, యాపాలఁతిసంతోషమునుం బెంపొం దించుచుందురు. నివారితమైన వ్రణముమచ్చయై మాసిపోవుచందమున, ఈక్రొత్తవ్యాసంగమువలన నామానిని మనస్సునందలి శోకకళంకము కాలక్రమమున రూపడంగెను.

ఆయురారోగ్యములతో విహరించెడి వ్యక్తియె యీలోకమున సుఖభోక్త! ఈతనిభోగోపభోగమునకే నింగినిసూర్యుడు వెలుంగుచున్నాఁడు. వెలుచంద్రికతో మందహాసములుచల్లుచున్నవి. చెట్లు తీఁగలును, తమ పుష్పసౌరభములతో వానినాసికమరంజించెడి భృత్యవర్గము. నదులు పర్వతములును వానికి నేత్రపర్వమొన రించెడి వినోదవస్తువులు. మలయమారుతపరిచారిక వానిని సేదదేర్చుటకే రాత్రియంతయు వీవనవీచుచున్నది!

ఎన్నియైశ్వర్యములున్నను, ఆయురారోగ్యభాగ్యములేనివాని కేభాగ్యమునులేదు! ఉద్యానవన సదృశమగు ధరణీతలము, రోగసంకలితునకు ఘాతుకమృగసాంద్రమగు ఘోరారణ్యము. పూలపాన్పుఁబోలిన యీభూతలము, ఆయుర్విహీనునికి శ్మశానవాటికయగుచున్నది. లోకపరిచారికయగు ప్రకృతి, వ్యాధిగ్రస్తు నికి కొఱకొఱలాడెడి యధికారిణియె! కడుపుపూర్తియైన మందభాగ్యునికది వేఁడికన్నులవేఁటకత్తె!

ఇపుడీవసంతకాలమున మలయమారుతమువీచుచుండఁగ హాయిగనీచెట్టునీడ విశ్రమించు సుందరియెవరు? కొలఁదికాలముక్రిందట కూఁతురుగోలుపోయిన మీనాక్షియె. శిశువును బాసి శోకనొందెడియాసుదతి, దుఃఖ జీర్ణచర్మమును దిగద్రోచి, నూతనప్రేమపల్లవముఁదాల్చి, ఆరోగ్యానందముల వలరారుచున్నది! కన్నకడుపు

నను, పెంచిన చేతులకును, దుఃఖమెపుడును పూర్తిగమఱుపురానిమాటసత్యమే. "అపుత్రికయై జీవించియుండిన నే నెంతటి యదృష్టవంతురాలను!" అని మనోసీమనుండి పూర్తిగ దుఃఖము తొలఁగకుండెడి యాదీనపలుకులు కంటఁబడి పెట్టుచునే యుండును. కాని, చనిపోయిన శిశువుమాట యసత్యము, బ్రదికి వర్ధిలుచున్న యీపిచ్చికయె నిజము—అనియామె మనస్సును దిట్టపఱచుకొనియెను. పిచ్చికపిల్లను జూచుకొని యిపుడా వనిత దినములు పుచ్చుచున్నది. అదియె యిపుడీమె కేడుగడ!...

భద్రమునకై రాత్రి పంజరమున నుంచినను, పగలు మీనాక్షి పిచ్చికను బైటవదలివేయుచుండును. ఇపుడది రెక్కలుపెట్టి, పిక్కటిలియున్నది. పిచ్చిక, చెట్లమీఁదికెగిరి యాహారము తినుచు, అప్పుడప్పుడు తల్లిమీఁద భ్రమవాఱినప్పుడు క్రిందికివచ్చి, ఆమెవేయు గింజలుతినుచు, ఆమెహస్తస్పర్శసుఖము ననుభవించుచుండెను. కాకులనోటఁబడనున్న యానెత్తురుకందు, ఇపుడీపెద్దపిట్టయై విహరించుచుండుటకుఁ దల్లి మిక్కిలి ముదమందుచుండును. ఎల్లకాలమీపిచ్చిక తనచెంతనుండి తనకానందము గలిగించుచుండునని యావెఱ్ఱితల్లి తలపోసి, వెఱ్ఱిసంతసమున మురియుచుండెను.

చనిపోయిన బాలికనుగుఱించి మనస్సునెటులో సరిపెట్టుకొని, ఉన్నపిట్టను జూచుకొని యుబ్బిపులూరెడి యాయువిదయానందమునకు విధి యసూయఁజెందెనాయనునట్టుగ నిపుడొక యుదంతము సంభవించెను! ఎప్పటివలెనే పిచ్చికయొక చేరువ చెట్టుమీఁదికెగిరిపోయి మేఁతమేయుచుండెను. అంతకొంతసేపటికా దిక్కునుండి "కిచకిచలు" వినవచ్చెను. తనపిట్టకొఱకుఁ జూచుతల్లి కన్నులకపుడొక మగపిచ్చిక యాకారముగానవచ్చెను. అటులైనపిమ్మట తనపిచ్చిక తనయొద్దకు వచ్చివాలునని తల్లితలంచెను కాని యట్లుజరుగలేదు. కొంతసేపటికి జివ్వున రెండుపిట్టలు నింగికెగిరిపోయెను! ఎంతసేపు కనిపెట్టుకొని, ఎన్నిచోట్ల వెదకినను, పాపము, మీనాక్షికి పిచ్చుక జాడగానఁబడలేదు! ఇపుడామె యేమిచేయఁగలదు?

## ౫

## ఎడబాటు

మీనాక్షి పిచ్చుక యిలువెడలిపోయి యిప్పటికిఁ గొన్నిదినములయ్యెను. ఈరెండవయెడబాటు పాపమామెలఁతకు కడుదుస్సహముగనుండెను. మాయదైవము మరల తనశోధన పాలుచేయనేలయని యావనిత విలపించెను. మరల తనముద్దులపిచ్చుకను జూచి తనకరములతో దానిమృదుదేహము నిమురు భాగ్యముగాంతునా యని యాదీనావనితలపోసెను—మీనాక్షి సహచరులు తమనేస్తురాలి నెటులీమాత్రోదార్ప వలయునో యెఱుఁగకుండిరి. ఊరఁగలయమ్మలక్కల వికటపరిహాసములకు మరల మీనాక్షి గుఱియయ్యెను. "మీనాక్షిపక్షి యత్తవారియింటికి వెడలిపోయినదా!" యనువారలహాస్యోక్తుల యాథార్థ్యమాయంగనకు సుబోధకముగాకుండెను.

## ౬

## పక్షిదొరకుట

ఒకనాఁడు మీనాక్షి నీరెండలో చెట్టుక్రిందఁబండుకొని, పైకిఁజూచుచుండెను. పలుచని మేఘమొకటి యాకాశపథమునఁగొమ్మలమధ్యనుండి కానవచ్చెను. కదలుచుండెడిది మేఘమైనను, వృక్షమె చలించుచుండునటులామెకంటికిఁదోఁచెను. అపుడంతచెట్టుమీఁద వాలినయొక పిట్టరూపమామెకుఁగానఁబడెను. అదియొక మగపిచ్చిక. అదితనపిచ్చికదైన నెంత యదృష్టమని యాతరుణితలంచుచుండఁగనే, వెంటనే వేఱొకపిచ్చికకూఁత వినఁబడెను. దానికంఠధ్వని మీనాక్షికిఁదెలిసినదియె! "పిచ్చికమ్మా!" అని యొక్కపెట్టున భావోద్రేకమునే నాకాంతయార్చెను. జివ్వున "పిచ్చికమ్మ" క్రిందికి దిగివచ్చి, రెక్కలతో తల్లిమేనువంటి రాసికొనెను.



కొంటెతనము

తల్లి:—పిల్లలారా! ఈసీసా పగిలిపోయిందని మీనాన్నగారితో చెప్పకండేమి?

ఇజారుతో డుక్కునుంచున్న పిల్లవాడు:—అమ్మా! అల్లాగేలే. నేను చెప్పను. కాని నాన్న రావటంతోటే 'నాన్నగారూ! మనయింట్లో ఏంగమ్మత్తు జరిగిందో చెప్పుకోండి అంటాను.'

తోడనె మీనాక్షి, పక్షిని చేతఁబట్టి, 'ఇదిగో నాపిచ్చికమ్మ వచ్చినది!" అని కేకరించి, దానినిముద్దాడుచు, ఇల్లుచొచ్చెను.

ఆనాఁడు మీనాక్షికి పండుగదినము! ఆమెభాగ్యము పొగడుపోరుగువారికిని, అదృష్టమునభినందించు ననుచరులకును, వారియిల్లు వేఁడుకవిడిదియయ్యెను. ముందన్నడును పిచ్చికను పంజరమునుండి విడువవలదని చెలికత్తెలుచెప్పినను, నోరులేనియాపక్షి స్వేచ్ఛ నరికట్టుటయు, దానిసంసారసౌఖ్యమునకంతరాయములుగలిగించుటయు పాపకృత్యములని మీనాక్షికిఁదోఁచెను. రాత్రియంతయును వారివాకిటఁగూసికూసి, మగపిచ్చుక వెడలిపోయి మఱునాఁడుప్రొద్దున్న మరలవచ్చి, తనప్రేయసిని సంబోధింపసాగెను. అంతనారెండు పిచ్చుకలును చెట్టుమీఁద విహారములుసలిపెను. ఎక్కడకుఁబోయినను, అపుడపుడు "పిచ్చికమ్మ" పుట్టినింటికివచ్చి, తల్లియిడెడి నూకలవారగించి వెడలిపోవుచుండును. పిచ్చికమ్మ తనతల్లిచెంత నుండునంతసేపును కీచుకీచుమని యార్చుచుతానుమాత్రము అత్తదగ్గఱకు రాకతీవితో దూరపుకొమ్మనెక్కి కూర్చుండుమగపిచ్చికను జూచి, "ఆహా! ఏజాతియందును అల్లునిపోకడలిట్టివియెకదా!" యని మీనాక్షి యచ్చెరువొందుచుండును.

అంతకొన్నిదివసములకు మీనాక్షియింటిచాటున నొకపిచ్చుకగూడేర్పడెను. దానిలో పిచ్చికమ్మ తన గ్రుడ్లనుపొదిగి, పిల్లలనుజేసి, వానిని సంరక్షించుచుండెను. ఆదినములలో మిగులపాటుపడి, ఆఁడుపక్షితన పిల్లలకెరతెచ్చి పెట్టుచుండును. తల్లిరాక కెదురుచూచు పిచ్చికపిల్లల చిన్నచంచువులను జూచుచును, ఎరదిను నపుడంతమకమునవవి సన్ననిగొంతులతోఁజేయు కీచకీచలువినుచును, మీనాక్షి ప్రొద్దుపుచ్చుచుండును. మీనాక్షి సహచరులిపుడు వినువార్తలామె కూఁతునిసంసారపుముచ్చటలె. తనకూఁతురుమంచిదకాని, అల్లుఁడు సోమరియై, పిల్లలకుమేఁతసరిగాఁ గొనిరాకుండుటచే, భార్యాభర్తలకుఁ "గీఁచులాటలు" తఱచుగతటస్థించుచుండునని మీనాక్షిపలుకునపుడు, కొందఱు మూతివిఱుచుచు, కొందఱు ముసిముసినవ్వులునవ్వుచు నూఁకొట్టుచుందురు!

౨

## పిచ్చికమ్మ వేఱింటి కాపురము

ఎల్లకాలమునిల్లఱికము నుండనొల్లనియల్లుని ప్రేరణమునఁ గాఁపురమెత్తివేసిరాయనునట్టుగ, ఆచటక దంపతులంత స్థలాంతరమునకు వలసపోయిరి! కాని పూర్వపామరత్వమున పిచ్చుకమ్మ దారితప్పివచ్చినదానివలె అప్పుడప్పుడు తల్లిదర్శనము చేయుచు, అరణములఁగొనిపోవుచుండును. కాని, కూఁతునిరాకపోకలంతకంతకడమగుచువచ్చి, ఇటీవలకొంతకాలమునుండి బొత్తిగనిలిచిపోయినవని మీనాక్షి కన్నీరొడ్చుచు మిత్రులకుఁజెప్పుచుండును. ముదిమిని పిచ్చికమ్మ జ్ఞాపకశక్తియంతరించి పోవుటచేతనె పుట్టినింటికి రాకున్నదిగాని యది యెచటనోసేమముగనే యున్నదని నెచ్చెలులు మీనాక్షినోదార్చుచుందురు. మీనాక్షి తనపెంపుడు కూఁతునుగుఱించి తలంచుకొనునపుడు, పెంచినమోహమునఁ గంటతడిపెట్టుచున్నను, తనకూఁతురుపెరిఁగి పెద్దదియై, కృతకృత్యయయ్యెననియు, దానివంశము తామరతంపరయై మనుచున్నదనియును, గుర్తెఱిఁగి తృప్తియు మనశ్శాంతియుఁగాంచియెయున్నది!

దైవానుగ్రహమున మీనాక్షికిటీవల మంచి సంతానముగలిగెను. తనపెంపుడు కూఁతుచలువయె తన సంతతిపెంపునకుఁ గారణమనిదలంచి, ఆమె పిచ్చికమ్మయెడ నధికానురాగము గాంచియున్నది. ఆమె పిల్లలు తమపెద్దయక్క "పిచ్చికమ్మ"నుగూర్చిన ముచ్చటలిప్పుడును ప్రేమాతిశయమునఁ జెప్పుకొనుచున్నారు.

# డొక్కా సీతమ్మ

చేబోలు చంద్రశేఖరశర్మగారు

మ. ఘనకీర్తిద్యుతిరాజమానమగుడొక్కా, వారివంశంబులో
ననజోగయ్యకు పత్నివై వెలసి సౌభాగ్యయుతచిత్తంబుతో
వినుతింపందగు శీలసంపదలతోఁ బెంపొందుసీతమ్మరో!
ప్రణుతింబొందితివమ్మ ద్రావిడులలో శ్లాఘైకమాణిక్యమై.

మ. ధనముంగల్గిన ధాన్యముంగలిగిన నీ దానానదానాళితో
డనుసంతోషసుఖంబుబొందగ మదిండాయంగధర్మార్థమం
దునచిత్తంబుఁజలింపనేర్చునొకొ ఎంతోపుణ్యసంపత్తిఁజే
సినజన్మాంతరకర్మమైవెలసెఁగా సీతాంబభూమండలిన్.

సీ. గోదావరీతీరఘోషానివాసమౌ గన్నవరంబులో కాపురంబు
'అన్న మోరామచంద్రా' యన్న వారల కాదరంబున మృష్టాన్నమిడుట
కంఠమెండెనటంచుఁ గడుఁగ్రుందువారికి తీయతీయనిమంచి. తీర్థమిడుట
కష్టసుఖములెన్ని కల్గియుండినగాని యతిథిసంతతుల సమర్చనంబు
పతికిఁ బరిచర్యచేయుటే ప్రబలధనము పలుగురింటభుజించుట భాగ్యగరిమ
వెనుకరీతిని నడచుటే వెలఁదిధర్మమనుచుఁజరియించె సీతాంబ యువనియందు.

మ. ఒకనాడంబరచుంబిభంగములతో నుద్వేలమైగౌతమీ
ప్రకటాటోపమెసంగ, నవ్వలదశుభంధ్ధాటిలోసంత్యజం
డొకడేతెంచిస్వపట్టణంపుదరి నాప్రోద్యన్నదింగల్గు వృ
త్తకపుంబై కెగబ్రాకియాకట గనుంగష్టంబునుంజెంది 'కీ
ర్తికళామానిత! సీతమా!'యనుచుపేర్కింపగాబిల్చి స్వ
యకశోరత్రుడపాటు దెల్పినటదానాయర్ధరాత్రి బెరిం
గికసుబొల్పుగనేరు దాటి జఠరాగ్నింవానికిందీర్ప యు
ల్లకసత్పుణ్యమునెల్ల భూదివిజమూరక్షోధిప్రగస్తుఁడా
నొకనిందీర్పగధారబోసె, నిటుదానుత్తంసురాలైన దే
వికి సీతాంబకు నైహికాపరశుభస్ఫీతుల్ గనున్మించవే.

ఉ. పంచమజార్జికయ్యపని పట్టముగట్టెడివేళదానమున్
సంచితమైనపేర్మిమెయి సల్పినవారెవరన్న నిన్నిలన్
మించినవారులేరనగ మిక్కుటభక్తిని నీదుచిత్రమం
దుంచిరిసింహపీఠపయి యున్నతినీకెసగంగ, సీతమా!

# మా సింహం పిల్ల

శ్రీమతి ప్రాతూరి లక్ష్మమ్మ గారు

నేను మావాళ్ళయింటికి వెళ్లేను. నేను యింటికివెడితేసరి పిల్లలంతానన్ను వదలి పెట్టరు. అందులో చింహాపిల్లంటే నాకు చాలాముద్దు. అందరిలోకి సింహామే అల్లరితక్కువ చేస్తాడు. ఏమాటమాట్లాడినా బహు ముద్దుగాను అందముగాను మాట్లాడుతాడు. మా సింహాము అసలుపేర్లు నరసింహ్మామూర్తిగాని అందరుముద్దుకు సింహాముఅంటాము. అవాళ మాయింటికి చిలకడదుంపలు తెచ్చేరు. మాపిల్లలకు దుంపలంటేచాలాయిష్టం. అందువల్ల దుంపలుచూస్తేబతకనివ్వరు. సాధ్యమైనంతవరకు వాళ్ల అమ్మ పిల్లలుచూడకుండాదాస్తుంది. ఎన్ని అంతఃపురాల్లో దాచినా వాళ్లకుతెచ్చుకునేనేర్పువుంది. అటువంటివాటిలో మాసింహం చాలప్రవీణుడు. నేతువుకి దుంపలురావడంచూచేడు. నిమ్మళంగా తమ్ముడు గోపాలంతో అంటకాల్చేడు 'ఓరేయి,గోపాలం! బుట్టెడుదుంపలొచ్చాయిరో' అంటూను. గోపాలం గబగబపరిగెత్తుకువచ్చేడు. ఇల్లంతా గాలించివెతికేడు. ఎక్కడాకనపడలేదు దుంపలు. తల్లిదగ్గరకొచ్చేడు. అమ్మా! నాకోదుంపయియ్యవే అంటూను వేపించుకుతినడం మొదలుపెట్టేడు. 'దుంపల్లేవు గింపల్లేవు. వెధవా! బళ్లోకివెళ్లకుండా యింకాయింట్లోయేంచేస్తున్నావు?' అని చల్ల చేసుకుంటూవాళ్లమ్మకేకలేసింది. ఇక వాడిమంత్రం పారదనుకొని పిల్లలంతా సీతక్కయ్య దగ్గరకొచ్చేరు. దానిపేరుఅసలుసీతగాని అంతా సీతక్కయ్యాఅంటారు. పెద్దవాళ్లుకూడాను. ఆఖరికి యింట్లోజీతగాళ్లుకూడా సీతక్కయ్యగారు అంటారు.

మాసీత చాలాచెడ్డది. ప్రసూనకి నాల్గుకబుర్లుచెప్పి వప్పించవచ్చునుగాని సీతచేత వప్పించలేము. సీత తనుపట్టినపట్టువిడువదు. ఎంతటివాళ్లేనాఅదిచెప్పినట్టువినవలసినదే. వాళ్ల నాన్న సీతఅల్లరిచేస్తూంటే భయపెట్టబోతాడు. కొట్టడానికివచ్చే వాళ్లనాన్ననిచూడ్డంతోటే సీత గబగబ బొజ్జాడించుకుంటూ దొర్లుకుంటూ పరిగెత్తుకువెళ్లి రెండుచేతులు తండ్రికాళ్లకు మెలేసి 'నాన్నోయి. ప్రసన్నక్కయ్యమాకుఅల్లరిచేస్తూందిచూడవేం కొట్టు' అంటుంది. వాళ్ల నాన్నకు యేమిచేయుటకుతోచక దెబ్బకొట్టబోయే సీతబుగ్గలమీద ముద్దులవర్షం కురిపించి అల్లరిచేయకు ప్రసన్న అని తన్ని నిజంగాకొడతాడేమొనని బిక్కమొగంవేసుకు చూస్తున్న ప్రసన్నమీద నాల్గుకేకలుపెట్టివెడతాడు. దెబ్బలుతప్పించుకోడంలో అంత నేర్పరి సీత.

మాసింహంఅసాధ్యుడు. దుంపలొచ్చింది వాళ్లమ్మయెక్కడపెట్టింది మాట్లాడకుండా చూస్తున్నాడు. చెల్లెలుశకుంతల సింహ్వానికుస్నేహం. వాళ్లది ఒకయీడుకూడాను. 'శకుంతలా!మనంగుంపలుతీచుకు కాల్చుకుందాం, దా' అని దాన్నిలాక్కొచ్చేడు. చిన్నకుర్చీపీట తెచ్చేడు. తనెక్కేడు. అందలేదు. చిన్నకర్రపుచ్చుకు ఉ ఉ ఉ అని పైన అలమరమీద విస్తళ్లకట్టకింద వాళ్లుపెట్టిన తాటాకుబుట్టనితోస్తున్నాడు. కాని అదిపడలేదు. అలసిపోయేడు. సింహంనిరాశతో కిందకుచూస్తున్నాడు. సీతక్కయ్యతలపుసందులోంచి తొంగిచూస్తూంది.

సింహానికి ప్రాణంలేచొచ్చింది. 'సీతక్కయ్యా! వచ్చావా దాదా దబ్బున దా దుంపలబుట్ట దిగో' అన్నాడు. సీతక్కయ్య కుర్చీపీటమీదయెక్కి కర్రపెట్టిబుట్టనుపడెయ్యాలని తంటాలు పడింది. అందలేదు. సీతక్కయ్యకు దిగులుపుట్టింది. నాల్గువైపులాచూసింది. 'ఇంతలోకె ఒకవుపాయంతోచింది. 'సింహం! సింహం! నీచిన్నకుర్చీ పట్టుకురారా' అంది.

సింహంచిన్నకుర్చీసంగతి కొంచెంచెప్పాలి. ఆకుర్చీచాలచిన్నది. అదియెవర్నిముట్టుకో నియ్యడు. సింహానికి ఒకరోజుకోపంవచ్చింది. ఎక్కడాకనపడడు. ఇల్లంతావెతకేరు. చుట్టు పక్కలయిళ్లన్నిచూచేరు. కనపడలేదు. వాళ్లమ్మ పిల్లలందర్ని కోప్పడింది. సింహాని వెతుక్కొనిరమ్మనింది. వాళ్లనాన్నవచ్చికోప్పడుతారు. ఇంకాస్సేపటికి సీతక్కయ్యవచ్చి సింహం గదిలో మూలకుర్చీలో నిద్దరపోతున్నాడు అనిచెప్పింది. అది సింహంకోపగృహమన్నమాట. అప్పటినుంచి ఆకోపం ధర్మమాఅంటూ ఆకుర్చీ సింహం ఆస్తిఅయింది.

చిన్నకుర్చీపట్టుకు సింహంవచ్చేడు. సీతపీటమీదకుర్చీవేసుకు కర్రతోబుట్టపడకొట్టింది. బుట్టకిందపడడంలో సీతమీదకూడా రెండుమూడుదుంపలుపడ్డాయి. దుంపలుచూచిన ఆనందంలో దెబ్బతగిలినట్టులేదు. బుట్టపడేశబ్దానికే పిల్లలంతాపోగయ్యారు. తలోదుంపయెత్తుకెళ్లి నీళ్లపోయిలోవేసుకు కాల్చుకున్నారు. అంతాకలసితిన్నవితినగా మిగిలినవి పెట్టుకు బువ్వాలాటఆడుతున్నారు. వాళ్లమ్మవంటయింట్లో చల్లచేసుకుంటూంది. ఈయడావిడంతా ఆమెకు తెలియదు. ఆవెడమడికట్టుకువంటచేస్తూ పులుసుపెడతామని బుట్టకేసిఅలమరుపైకి చూసింది. బుట్టపైనకనపడలేదు. కిందపట్టిబుట్టకనబడింది. ఆమెకు చాలాకోపంవచ్చింది. ఇదంతా పెద్దవాడు సేతువుడుచేసాడనే ఆమెఅభిప్రాయం. కనక 'చూడు, సేతు! బుట్టెడు దుంపలుపట్టుకెళ్లి బళ్లోపిల్లలందరికి పంచిపెట్టావు' అనికేకలుపెడుతూంది. ఆకేకలకే గోపాలం పరుగెత్తుకొచ్చేడు. సావిట్లోరాసుకుంటూకూర్చున్న వాళ్లనాన్నకూడావచ్చేడు. ఒట్టితాటాకులబుట్ట ఒకచేతులోపట్టుకొని రెండవచేతిలో సేతువుడ్ని బుగ్గలుపట్టుకు కోపపడుతూవున్న వాళ్లమ్మనిచూచి 'ఏమిటది? యెందుకు?' అన్నాడు వాళ్లనాన్న అమ్మకేసిచూచి. 'చూడండి బుట్టెడుదుంపలు పట్టుకొనివెళ్లి బళ్లో పిల్లలందరికిపంచివచ్చేడు పులుసులోకి ఒకదుంపన్నా లేదు' అని వట్టిబుట్టకిందపారవేసింది. 'తేగానే అందరికీ తలోదుంపాయిస్తే నీబుట్టెడుసీకేవుండేవిగా' అంటూవాళ్లనాన్న సేతువుడ్ని విడిపించుకు చెయ్యిపట్టుకొనిసావిట్లోకి తీసుకువెళ్లేడు. సీతక్కయ్య సింహంయింకా ఆడుతూనేయున్నారు. సేతువుడ్నివాళ్లనాన్నఅడిగేడు. 'నేనెరుగను నాన్నా' అని అన్నాడు. పిల్లలందర్నిపిలిచేడు. సింహాం, సీతక్కయ్యా దొంగలనితేలింది. 'ఏమేవు! దొంగలను పట్టుకున్నాను. నావంతుఅయింది. శిక్షవిధించుటనీవంతు' అని సీతక్కయ్యని, సింహాన్ని అప్పచెప్పేడు వాళ్లఅమ్మకు. అప్పుడు ఆదొంగలను కొట్టవలెనో తిట్టవలెనో తెలియలేదు. వాళ్లనాన్న సింహాంమీదను వాళ్లమ్మ సీతక్కయ్యమీదను ముద్దులవర్షం కురిపించేసేరు.

# గయ్యాళి గౌరమ్మ ప్రహసనము

[పాత్రలు:—గౌరమ్మ: మహాదేవశాస్త్రి రెండవభార్య; మహాదేవశాస్త్రి: డిప్టీకలక్టరు; రామమ్మ: వంటలక్క; సుబ్బాయమ్మ: మహాదేవశాస్త్రి తల్లి, గౌరమ్మ అత్త; సీతారామమ్మ: మహాదేవశాస్త్రి మొదటిపెళ్లాము రెండవకూతురు; రమణమ్మ: గౌరమ్మకూతురు. రంగము: ప్రవేశము: భోజనశాల.]

మహా:—ఏమె? రా రా అని అంతవేపుకుతిన్నావు. కాళ్లకు నీళ్లేవి? అంగవస్త్రమేది? ఏమిలేకుండా అంతతొందర పెట్టేవెందుకు?

గౌర:—ఏం? నేనే పెట్టాలా ఏమిటి? మీ అమ్మాయి లెవరైనా పెట్టేరేమో అని అనుకున్నాను. కాస్తపెడుతే అరిగిపోతారా ఏమిటి?

మహా:—ఏమి? వాళ్లెందుకుపెట్టాలి? నువ్వేపెట్టాలి.

గౌర:—మీసంపాదనంతా నేనేతింటున్నానా? ఏటికేడాది తినేవాళ్లుచేస్తే తప్పా? ఓ! నాకు పెట్టేవస్తువు లెక్కువ ఐపోయినవి యీ ఆరవచాకిరి చేయడానికి. నేనేమో గతిలేనిదానివట. దిక్కులేని దానినట. నాదిక్కు ఆరిపోయిందట. ఈలాంటిమాటలు మీతల్లిచేత పిల్లలచేత పడుతూ ఎవరు చేయగలరు? నాకు వెయ్యిరూపాయిలున్నాయి. మహారాజులా నేనుతిని పదిమందికి పెట్టుతాను.

మహా:—అయితే, ఇంతకీ ఏమైన ప్రసాదం తినమన్నావా? లేకపోతే ఆఫీసుకుపోనా - చెప్పు [అని మహాదేవశాస్త్రి కాళ్లుకడుక్కొని తలుపుమీదవున్న అంగవస్త్రము తడుపుకొని మొహము తుడుచుకొనుచుండెను.]

సుబ్బా:—[ఇంటిలోపలనుండి] నరసమ్మ వెలపలవున్నది. లేకపోతే అదే చేసిఉండేది.

గౌర:—ఓ! నువ్వూఆవిడా చేసేపనులేఅన్నీని. కీడులవంటి పరుగెత్తుచున్నాయి. మీరుండడముచేతనే భూమిమీద చినుకుపడుతోంది. రోజూ ఆవిడా మీరే చేస్తున్నారుగాబోలు? మనుమరాళ్లంటే ఆలా పడి చస్తావు. ఎంతసేపు మనుమరాళ్లంటేనే అపేక్ష. నీవాళ్లు పెద్దరాయిపెట్టుతారుండు. [అని విసుగుకొనుచు పీటవేసి కంచము పెట్టెను. వంటమనిషి రామమ్మ వడ్డించెను. మహాదేవశాస్త్రి భోజనముచేయుచుండెను. గౌరమ్మ యిటునటు ఏదో పనివున్నదానివలె తిరుగుచు రామమ్మను మైలపడచెను.]

సుబ్బా:—(లోపలనుండి అదిచూచి) అయ్యో! మాలసంత! అవతలకువెళ్లనేనా వెళ్లకపోయావా? రామమ్మా! ఈకొంపలో మడిమైలా లేదు. ఏదో యింతతినడమేగాని ఆచారవ్యవహారము, పూజాపునస్కారాలు లేవు. ఆవిడ సిమపెత్తినదానిలా తిరుగుతుంది. పో దబ్బునపో స్నానంచేసిరా ఏంగావాలో నే వడ్డిస్తాను.

గౌర:—నాకు సిమపెత్తిందీ? నీమనుమరాళ్లకు సిమెత్తింది. నీకూతురుకెత్తింది. నాకేమీ శిమపెత్త లేదు. ఈలాంటి కుళ్లుమాటలు పడుతూ ఎవరు ఆచారంగావుంటారు? మీమనుమరాళ్లుంటున్నారుగా! కావలసినంత ఆచారంతప్పులన్నీ మీదగ్గిరవుంచుకొని నన్నిలా నల్లేరుమీదబండిలాగు ఎందుకు అనడం? నామాటలన్నా, నాపిల్లమాటలన్నా అంతచకచక. ఎప్పుడు పక్షపాతమేకదా! వాళ్లకోలాగా, నాకోలాగ. వాళ్లకు పెరుగోపి, నాకునీళ్లోపి. ఏముంది? మళ్లీ పెద్దదానవు. ఈలాగేటమ్మా! చేయడం? వాళ్లు నీనెత్తిమీద రాయిపెట్టేరా? నేపెట్టకపోయినానా? అంత పక్షపాతమెందుకు?

సుబ్బా:—పూరుకో, అమ్మా! తల్లీ! నిన్నేమీఅనలేదు. నీకు నీపెద్దలకు ఒకదండం. తప్పువస్తే క్షమించమ్మా! తల్లీ! నువ్వూనేను అనుకుంటే వాళ్లమీదికెందుకెడుతావు. ఏమైనాఅంటే వాడు అన్నంవదలి లేచిపోతాడు.

గౌర:—నీకు అపేక్ష యెక్కడవుందో అక్కడేఎత్తుతా. ఎత్తనుమరి? నన్ను నీవేమైనాఅంటే నేను వాళ్లని, నిన్నుకూడా అంటాను? ఎందుకంత హక్కున్నగామాట్లాడుతావు? నిమ్మళంగామాట్లాడలేవు?

మహా:—(పెరుగుఅన్నంతింటూ) ఇస్స్. ఏమిటీగోల? ఆముండ ఎప్పుడూ ఏదోవొక కుళ్లుమాట అంటూనేవుంటుంది. నీవు ఏడుస్తూనేవుంటావు. ఏమీఎరుగని నంగనాచులలాగ పత్తిత్తులలాగ వాళ్లు సన్నిసన్నంగాఅంటారు. నీవు బడబడలాడుతావు. ఇందు ఎవరుతీసిపోరు. ఆముసిలిముండ చెప్పనక్కరలేదు. గడ్డోతుముండ. అందుకే భగవంతుడు నక్కలన్నిటినీ ఒకచోటికి, నవరాసులన్నిటినీఒకచోటికి చేరుస్తాడు. మీయిష్టమువచ్చినట్లేడవండి. అసలుపిల్లలమీద పెళ్లిచేసుకోడం నాదే బుద్ధితక్కువ.

సుబ్బా:—పిల్లలేంజేశారు? ఆడదాన్ని వంచుకోలేక అలాఏడుస్తున్నావు. న్యాయాన్యాయము విచారించక పేడాబెల్లం ఏకంజేస్తున్నావు.

మహా:—చేస్తేచేశానులే. పోనీలే. [అనిబల్కుచు మేడమీదికిబోయెను.]

గౌర:—[హస్తచాలనమొనర్చుచు] మీబుద్ధితక్కువగాదు. నాబుద్ధితక్కువ అంతా. లేకపోతే పిల్లల మీద రెండోపెండ్లివానిని చేసుకోడమేమిటి? చేసుకున్నానుగనుకనే 'దేవుడారాముడా' అంటూ మీజీవానికి, మీతల్లిజీవానికి ఉసూరుమని ఏడుస్తున్నా. తిండికికూడా మొహామువాచి కుళ్లుమాటలు సవతిపిల్లలచేత మీతల్లిచేత పడలేక శరీరం చిల్లుపడిపోతోంది. ఉత్తమయిల్లాలినిగనుక గాని లేకపోతే యింకొకర్తైతే యీపాటికి లేచి చక్కాబోదురు.

రామ:—పూరుకుందురమ్మా! పెద్దవారు ఏదోవకటిఅంటారు. ఇంతలో వచ్చినదేముంది? పెద్దలు అనడము చిన్నలుపడడము విధాయకముగదా?

గౌర:—పెద్దవాళ్లేమిటి?...... నేనుపడనమ్మా! ఇదివరదాకాపడ్డానుగాని యికపడను. నేనేమి వెర్రిగౌరమ్మనుగాను ఎల్లకాలం పడడానికి.

సుబ్బా:—నేనేమన్నానమ్మా! ఏదోవకటిపెట్టుకుని మొగుడూపెళ్లాం మీదకువస్తారు. వందలకువందలు చెల్లుతున్నాయి. పెట్టినపూరగాయలు చెల్లుతున్నాయి. తిండికి మొహంవాచావని చెప్పతోంది ఆయిల్లాలు. ఇంకేమిచెప్పమన్నావు? ఎప్పటివో తవ్వితే ఏంచెయ్యమన్నావు? తల్లిపోయినపిల్లల్ని పెంచేను. ఉంటే అపేక్షవుంటుంది. ఏంచెయ్యమన్నారు? వాజోలు నాపిల్లజోలు నీవు ఎత్తవద్దంటె. ఆఖరికి అల్లరిచేస్తూవుంటేకూడ పెద్దదాన్నిగదా అని కోపంచెయ్యబోతే వల్లగాదనడాయను. ఏమిచెయ్యనమ్మా! అపేక్షపడి వాళ్లకేంపెడుతున్నాను? దిక్కుమాలినదేముడు నన్నుచూశాడుగాడు. ఎవర్నిసంతోషపెట్టను నేనుబ్రతికి. వెళ్లినదిగాదు. [అని ఏడ్చును. ఒంటిగంటఅగుటచే స్కూలునుండి సీతారామమ్మ వచ్చినది.]

సీతా:—రామమ్మగారూ! అన్నముపెట్టండి. ఇల్లు చాలా సందడిగావుందే, చుట్టాలెవరైనావచ్చేరా ఏమిటి?

గౌర:—నీలాంటి, మీనాయనమ్మలాంటివాళ్లుంటే వెయ్యిమందిచుట్టాలపెట్టు. చుట్టాలుగూడ ఎందుకు? ఒక్కరోజునే హడలి పారిపోతారు.

సీతా:—నీతో అనలేదమ్మా! తల్లీ! రామమ్మగారితోఅన్నాను. పూరుకో.

గౌర:—నేనునీతో అనలేదు. నువ్వూరుకోమంటే వూరుకుంటానా? మానమంటేమానుతానా? అంత పుక్కిన్నుగామాట్లాడుతావేమి? చిన్న పెద్ద తారతమ్యములేక-

సీతా:—రామమ్మగారూ! నాకు వంటింట్లోపెట్టండి. అక్కయ్యకు అన్నంపెట్టేరా?

రామ:—లేదమ్మా! మాకు యీభాగోతంతోటే సరిపోతోంది. ఏంపెట్టను?

సీతా:—సరి. ఈపూట నాకు శెలవు. అన్నంపెట్టండి. దానికిపెట్టి తింటాను [అని నాయనమ్మతో] నాయనమ్మా! నీవు వూరుకోవుగదా! ఏమీ జవాబుచెప్పవద్దంటే ఏదోవకటి అంటావు. అది బ్రహ్మాండమైపోతుంది-

సుబ్బా:—పాడిచెయ్యండే, అమ్మా! ఇంతదాక మీనాయన అన్నాడు. ఇక మీరనండి. నేనేమి నోరెత్తడంలేదే. తల్లీ! చాదస్తంనుండవిగనుక ఏదోఆచారముతోనమంటానుగాని నాకెందుకే? వాళ్ల డబ్బు జోలికెళుతున్నానా? ఏగానిజోలికెళుతున్నానా? ఇంతకూ నాఘటము వెళ్లినదిగాదు. నాకొడుక్కు బరువై పోయాను. [అని కండ్లనీరుదెచ్చుకొనును.]

రామ:—సీతారామమ్మగారూ! ఈపూట ఆవిడ ఏమీఅనలేదండి. పాపము ఇంతకు ఆవిడరోజులు మంచివిగావు. అరవయ్యోపడి అగ్నిగుండముఅన్నట్లు ఇంతపేరిసంపత్తువుండని ఆయిల్లాలిమనస్సుకుశాంతిలేదు.

సీతా:—ఏమిచెయ్యమన్నారు? ఎవరికర్మం వారనుభవించాలి. ఇంతకు మానాయనమ్మ మానమవలంబించమంటే అవలంబించదు. అదివక్కటిచేస్తే బాగుండును. పాపము ఇదివరకులాగ అన్నిటికీవెళ్లడములేదు. అయితేమాత్రమేమి రోజావెళ్లడములేదు.

రామ:—అమ్మాయిగారూ! ఎలావున్నా యీ ఇంట్లోమాటదక్కదండి.

గౌర:—రామమ్మగారూ! ఆనక శ్రీరంగనీతులు చెప్పుదురుగాని ముందు అన్నంపెట్టండి. ప్రాణంపోతోంది.

రామ:—ఇప్పుడేకాదండి వచ్చేరు? ఇందాకటినుంచి కనిపెట్టుకొనివున్నాను. రాలేదు. తొందరపడితే ఏలా? వస్తున్నాను.

సుబ్బా:—అమ్మా! మీరందరు మీ ఇండ్లకువెళతారు. నాకేగదా ఎక్కడాదిక్కులేదు. నేనెంత నోరుమూసుకొనివున్నా మీనాయనకేమి తెలియదుగదా! నేనుగడ్డోతుముండనట. ఏమిచేయనమ్మా! కండ్లు మూసుకొని హరాహరాయని ఏగోదారిలోనైపడిగాలి.

గౌర:—(ముద్దమ్రింగుతో) మీగయ్యాళితనాలు, రాలుగాయితనాలు తెలిసినవారుగనుకను, మంచివారుగనుకను, ఆయనన్యాయముమాట్లాడబట్టిగాని లేకపోతే నన్నుమీరంతాయీపాటికి ఏంచేసేవారో? అందరిసంగతులు అందరిచిత్రాలు బాగా ఆయనకుతెలుసును గాబట్టి బ్రతికిపోతున్నా.

సీతా:—నాయనమ్మా! జవాబుచెప్పితే వట్టు.

సుబ్బా:—నోరెత్తకుండా పాడిచేస్తున్నారేమీరు. నోరుమూసుకొనివుంటే లాభమేమైనా వుందా? అన్నీ వక్కలాగేవున్నాయి.

సీతా:—నోరుమూసుకుంటేనే లాభములేకపోతె నోరుమెదిపితేలాభముందా? రెండూవేస్తేచప్పట్లు. వూరుకో.

రామ:—అమ్మా! సీతారామమ్మగారూ! అక్కయ్యకు అన్నంపెట్టేరండి. మీబావగారు ఇంట్లోనే వున్నట్లున్నారు. అయ్యో! మొగవాళ్లువున్నారన్న భయములేదండి యీఇంట్లో.

గౌర:—ఓ! వారందరికీ ఉండదా ఏమిటి? నాకు ఉండడానికి? బుద్ధవరపువారంటె శుద్ధబుద్ధితక్కువ వాళ్లని ఇదివరకే పేరుమోశారు. వీరికీ క్రిందివాళ్లప్రక్కలా పరిగెత్తుతోంది. ఆయనవుంటే ఏంభయంలేదు. పెద్ద బావగారు ఆజంగులలోజను. ఆయన పెండ్లాముకంటె, మరదలుకంటె, నాయనమ్మకంటే నేనేమిబరితెగలేదు లెండి. ఏమమ్మాయి! శీతారామమ్మా! నాకుశిమబూనిసదట. మీ నాయనమ్మగారిమాటకు సంబరపడు. ఈ లాంటి వెధవమాటలంటూంటే ఎవరుపడతారు?

రామ:—అబ్బా! గౌరమ్మగారూ! అయినదేదో అయినది వూరుకోండురు. ఫలానికలక్టరుగారిభార్య, గట్టిగామాట్లాడుతారంటే బాగావుండదు వూరుకోండి.

గౌర:—కూతుళ్లకూ తల్లికీలేనిగౌరవము, మర్యాదనాకువస్తుందా ఏమిటి? కలక్టరుగారితల్లిపిల్లలు సద్ధగయ్యాళివాళ్లని ఇదివరకేదేశమంతా చెప్పుకుంటున్నారు. ఇక ఇప్పుడువస్తుందా ఏమిటి మర్యాద? మర్యాదాలేదు మంటిగడ్డాలేదు. ఆరునెలలుసహవాసముచేస్తే వారువీరవుతారు. వారికివచ్చినమర్యాదే నాకు వస్తుంది. ఎక్కువఏలావస్తుంది?

రామ:—గడుసు గౌరమ్మ అన్నపేరుపోనిచ్చారుగారు మొత్తానికి. ఎలామాట్లాడినా వాళ్లమీదికి వచ్చేటట్టేమాట్లాడుతారు. మీరింతగడుసువారని అయ్యగారికి తెలియదు. తెలిస్తే చాలాసంతోషిస్తారు.

గౌర:—(ముద్దసమలుతా) తెలియకేమి? ఆయన ఎన్నోసార్లు నన్ను నీవు మంచిగడసుదానవేఅన్నారు. లేకపోతే ఏమనుకొన్నారు ఈగౌరమ్మఅంటే. ఈఇంట్లో ఇంతనోరు ఇంతగడుసుదనము వుందిగనుకనే గాని, లేకపోతె, యీతల్లిపిల్లలు నన్నువీధిలోకి గెంటుదురు. అసలు యీయనచాలామంచివారని యీతల్లి వాళ్లు చాలాగయ్యాళివాళ్లని చాలామందిచెప్పేరు పెండ్లికానప్పుడేనాకు. వాళ్లు ఎలాంటివాళ్లయితేనేమి, ఆయనమంచివారుగదా అనిచేసుకున్నాను.

రామ:—(నవ్వుతూ) అమ్మా! మీకుపెండ్లినాటికన్నేళ్లున్నవండి?

గౌర:—నాకా 10 లేక 11 ఏండ్లువుండునండి. మీరెందుకడుగుతున్నారో తెలిసినదిలెండి. నేను మొదటినుండి చాలా తెలివైనదానిని గనుక అప్పటికేనాకు అన్నిసంగతులు తెలుసును. నేనుస్వయముగా ఆయనఫొటోచూచి ఆయననేతప్ప ఎవరినిచేసుకోనని కోరివేడిచేసుకున్నాను. ఏ మొఆడపిల్లలుగదా ఎవ రింటికి వారువెళ్తారనుకొన్నానుగాని ఎల్లకాలము నానెత్తిమీదకూర్చుని శీలగొట్టెదరని అనుకోలేదు.

సీతా:—(లోపలనుండి) నీలాగమమ్మల్నికూడ ఏరెండో పెండ్లివరునకో ఇస్తే రాకుండావుండేవాళ్లము. అలాగాకుండ మానాయనగారు జట్టుజట్టుకొలచి చిన్నవాళ్లనివెతకిచేశారు. వుండకుండా వెళ్లకుండా ఎలా అవుతుంది? రామమ్మగారూ! మీరుకూడ అన్నముపెట్టుకోండి, ఎందుకొచ్చినపోరు? తలబద్దలవుతోంది.

గౌర:—పోరు గీరే అనకు. ఆనకబుద్ధిచెప్పేను. మీరంతాకూడా మీతాహతునుబట్టిమాట్లాడండి. నేను పెద్దాయనపెండ్లాం నన్నమాటమరచిపోకండి. జాగ్రత. ఎవరితాహతువారుండండి. నన్నేమనుకుంటున్నారో! కూరగాయదానినిగాదు చీపురుపుల్లలా తీసిపారవేయడానికి. మీరెంతకొట్టుకుచచ్చినా నేనెలాగ కలక్టరుగారి భార్యనే. నాతరువాతనే మీరంతాను. ఎవరిమట్టుకువారె నన్ననడను. మొన్నమీబావ ఆవిడకు జవాబు చెప్పకండి తలవంచుకొని ఎవరిపనివారుచేసుకోండన్నాడు. ఆయనెవడు అలా అంతమాటనన్నడానికి. వచ్చినవాడు తనపనితనుచేసుకొనివెళ్లక యీచేతకానితీర్పులెందుకు?

రామ:—అబ్బా! ఇకకట్టిపెడుదురు. మిమ్మల్ని కలక్టరుగారి భార్యగాదని ఎవరన్నారండి? తల్లీ! నింపాదిగాభోంచెయ్యండి. ఏంగానవీ?

గౌర:—కడుపునిండిపోతోంది వెధవతిండి. ప్రతిరోజూ సరీగా భోజనాలవేళే దెబ్బలాటపెడతారండి. తిన్నతిండివంటబట్టుటలేదు. నేనునాపిల్ల ఎప్పుడుపక్కన్నమావుండి సుఖపడతామంగాని మహాకష్టపడుతున్నాను. రామమ్మగారూ! [అని కన్నులనీరు చెంగుతో తుడచుకొనుచు] రమణమ్మా! రమణమ్మా! ఇలా రా ఈకంచాలుగడిగెయ్యి. నాకంచమొకటి నేనుకడుక్కుంటాను.

రమ:—అబ్బా! నేనుకడగలేను. నాచెయ్యికోసుకుపోయింది.

గౌర:—ఛీ! మొద్దుముండా! కడుగు. కడక్కపోతే తలబద్దలుకొడతాను.

రమ:—నీళ్లలో పెడితే నాచెయ్యిమండుతుంది. నేకడగను.

గౌర:—దయ్యమ్ముండా! నామాటకెదురుచెప్పుతావుం? [అనిబల్కుచు అంటచేతితో నాల్గుగుద్దులు గుద్దెను. ఆబాలిక క్రిందచతికిలబడి గిలగిలకొట్టుకొనుచు పెద్దగ ఏడ్చుచుండెను.]

రామ:—ఏమి గయ్యాళితనమమ్మా! ఎక్కడాచూడలేదు. మనీని. పిల్లనలాకొట్టిచంపుతారా? అయ్యగార్కి ఇవిఏమి తెలియవు. మిమ్మల్ని ఎవరో ఏమంటో అంటారనుకుంటారుగాని యీగందరగోళం తెలియదు. నాకు పిచ్చెత్తిపోతోంది, బాబూ! మాలేనికొంపలలోగూడ యీపోకడలుసాగవు. ఇప్పుడిలావచ్చిందిగాని నా అవస్త మావాడుమగవారు వస్తున్నారంటే గడగడ. రహస్యముమాట్లాడినట్లే మాట్లాడ్డం. నేనూమాతోటికోడలు ఎప్పుడైనాగట్టిగాకబుర్లుచెప్పుకొంటే మాఅత్తగారు "ఏమర్రో గోడవ"అని ఒక్కకేకబెట్టేవారు. అంతే. ఇలా ఎక్కడాచూడలేదమ్మా!

గౌర:—ఈదిక్కుమాలిన గయ్యాళి సవతిపిల్లలమూలాన్ని రాచిపి అత్తగారిమూలాన్ని ఇలాగట్టిగా మాట్లాడడంపిల్లల్నికొట్టడంవస్తుందిగాని లేకపోతే నాకర్మమేమికాలింది ఇలాకొట్టడానికి.ఇంతకు నాకర్మము, పిల్లకర్మం ఇలావుంది. నోరులేనిదానినిగాబట్టి వాళ్ల ఆటలుసాగుతున్నాయి. [అని తింటూవున్న అన్నములో చెయ్యిగడుక్కొని భోజనమొనర్చుచున్న శీతారామమ్మ కెదురుగవచ్చి] శీతారామమ్మా! ఈరోజున మీవాన్నవురానివ్వండి. మీఅందరిరోగం, అందులో మీనాయనమ్మరోగం చప్పగకుదిర్చి, కమ్మెచ్చునసాగదీసినట్లుసాగతీయించకపోతే నాపేరు కైలాసగౌరికాదు. [అని పలుకుచు గౌరమ్మబళ్లునతలుపువైచి మేడమేదికిబోయెను.]

## ప్రజోత్పత్తి

శ్రీమతి ఆవటపల్లి కృష్ణవేణిగారు

ఆదిలో క్రిందుమీదయి సంతమందు
మోదముంగూర్చిప్రజకు ప్రమోదచనిమె.
భరతజాతికి స్వేచ్ఛావిభవముగూర్ప
శ్రీప్రజోత్పత్తి! రమ్ము సుశ్రీలనిమ్ము.
అలఘుసత్యాగ్రహోద్యమకలవరమున
భూరివాణిజ్యదుస్థితి కారణమున
పోయినప్రమోద ప్రజడీలిపోయినారు
నీవయిన శాంతినొడగూర్చి నెగడుమమ్మ.

దివ్యశాంతస్వరూపి గాంధిమహర్షి
విమలమానసుడైన ఇర్విన్ ప్రభుండు
కలిసి భారతజనని శృంఖలమువిప్ప
పూనిరీపని నీదయపూర్తిసేయుము;
ఈమహాత్ములకృపచే ఫలియించు నేని
భారతీయులు ఈప్రజోత్పత్తిమాకు
పారతంత్ర్యతవదలి శుభమ్ముగలిగె
అంచుమున్ముందు నిన్నుతలంచుకొంద్రు.

# సుమనః శాండిలీ

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

గీ. శుభవిమానాస్థయై సదాసొంపు మెరయ త్రిభువనంబులయందును దిరుగుచున్న
శాండిలినిగాంచి యిట్టులసరవినడిగె పుణ్యచారిత్ర కేకయపుత్రిసుమన.

కం. ఏయేపుణ్యవ్రతముల యేయేయాచారములను యేయేకథలన్
న్యాయమువీడక నిరతము బాయకయొనరిచియడంచి పాపములవడిన్.

సీ. సర్వతత్త్వజ్ఞత సర్వవిజ్ఞానంబు గలిగియాస్వర్గలోకంబుపొంది
ఆజ్యాహుతింగొన్న యగ్నిహోత్రమువోడ్కి నిమ్ముగాదేహతేజమ్ము వెలుగ
నగణితదివ్యభూషాంబరములుదాల్చి యెందున్నుశ్రమసుంత నొందకుండ
సంచరించుటవివరించి జూడగ! నల్పతపమునగా దల్పదానములను
గాదుకాన నెట్లొందితో కరుణదనర సూటిగాజెప్పుమన నంతసుమనతోడ
శాండిలి మొగమ్ముచిరునవ్వు మెంచుకొనగ నిట్టులనెమాటలను తేనెలుట్టిపడగ.

గీ. జడలువల్కలములును కాషాయవస్త్రతతిమొదలగునవెవ్వియు దాల్చకుండ
అతులఘనశాశ్వదానందమైలిసర్చ చెలియ? దేవత్వమొందితిజెప్పెదవిను!

సీ. భర్తాజ్ఞబాగుగా పాటించికలనైన పరుషోక్తిలవమును పలుకకెపుడు
దేవతాద్విజపితృదివ్యపూజలుచేసి యుత్తమామలయెడ భక్తిదగిలి
పైశుస్యమునువీడి పరునెద జొరనీక! ద్వారంబుకడనిలువపడకపని
మాలినవ్వక గూఢమార్గవృత్తిజొరక పతికింపులేనట్టి పనులుమాని
మరియుకార్యార్థియైయేగి మరలిరాముదమున నెదురేగి పూజలదన్పి మధుర
భక్ష్యభోజ్యములనుబెట్టి పరమభక్తి సేవచేయుచు మెలగుదు చిత్తమలర.

గీ. అనవరతము కుటుంబార్థమైనకార్య మెద్దియున్నశ్రద్ధదనర ప్రొద్దులేచి
స్వయముగానెరవేర్చి నిశ్చలముతోడ జీవితపథంబు నడిపితిచింతలేక.

చ. పనివడిప్రాణవల్లభుడు! బాల విదేశముబోయినన్ నిరం
జనసయి భూషణాదులవిసర్జనజేసి తదాగమాభిలా
షనియత భక్తిమెంచుకొన శక్త్యనుసారముగాగడున్ మహే
శుని గృహలక్ష్మియా గిరిజసూటిభజింపుచు నుందునిచ్ఛలున్.

గీ. పతికినాయాసమున్ కుటుంబమునుగూర్చి కల్గజేయక నిద్రభంగమ్మొనర్ప
క సతముమదీయగృహమందు కడుసుగుప్తముగ జరించుచునుందునుమోదమొప్ప.

గీ. సతమరుంధతీముఖపుణ్యసాధ్వులెలమి నిట్టిధర్మంబెపాలించి యింపుగులుక
సమరపథమాక్రమించిరి అటులెనేను వారిజాడనె పోయితివారిజాక్షి!

గీ. స్త్రీలకిదెధర్మమంచును జెప్పిచెప్పి సుమనయనుమతింజేసి విస్ఫూర్తితోడ
సూర్యచంద్రాదిలోకముల్ సారిదిదాటి స్వేచ్ఛనేగ శాండిలిని పంపచ్చుబడగ.

# బెర్నార్డుషా సతి

వడ్లమూడి గోపాలకృష్ణమూర్తి గారు

ఏనాటకరచనాధురంధరుడు తనరమణీయరచనాప్రభావముచే ప్రపంచమునంతటిని విస్మయమొనర్చి దేశదేశజులచేతను అభినందనపరంపరల నందికొని వాసిగాంచెనో, ఏమహాపురుషుని నూతనరచనలకై ప్రజలువువ్విళ్లూరుచుందురో, ఏయదృష్టజాతకుని జన్మగృహమును పరమపవిత్రముగ భావించి అసమానప్రాముఖ్యతనొసగి తీర్థయాత్రగ జనులు సేవించుచున్నారో, "జి.బి.ఎస్" అను నెవ్వని సాంకేతికనామాక్షరములు ఆబాలగోపాలమునకు చిరపరిచితమై వెలయుచున్నవో, ఏయుదారమనస్కుడు భారతజాతీయాశయములపట్ల సంపూర్ణసానుభూతిని ప్రకటించుచుండునో, అట్టి మహామాననీయ "జార్జి బెర్నార్డుషా"యొక్క సతీమణినిగూర్చి "డెయిలీహెరాల్డు" పత్రికావిలేఖకుని క్రిందివాక్యములు గృహలక్ష్మిపాఠకులు చదువదగినవి.

"బెర్నార్డుషాసతి మిక్కిలి లజ్జావతి. తన నామాక్షరముల నచ్చులో చూచుట కేవగించుకొనును. ఆమె తీయించుకొనిన ఛాయాచిత్రములు చాలతక్కువ. సభలకు వెళ్ళుటరుదు. ఉపన్యసించుట బొత్తిగసున్న. ఈమె అధికగౌరవోపేతుని అర్ధాంగియయ్యును, ప్రజాదృక్పథమునుండి తప్పించుకొనగలిగినది. షాదంపతు లన్యోన్యప్రేమాస్పదులు. భర్త వెళ్ళినచోటకెల్ల భార్య వెళ్లుచుండును. వివాహసంస్థయే బెర్నార్డుషాగారి కఠినతరవిమర్శనకు గురియైనది. ఐనను 'షా'ల వివాహముమాత్రము మిక్కిలిజయప్రదమైనదని చెప్పవచ్చును.

కాగోరినచో షాసతి మిక్కిలి ప్రఖ్యాతియుతకాగలదు. కోటీశ్వరులామె యాతిథ్యమునకై యెదురుచూచుచు ఆమె యాహ్వానమునకు గుటకలు మ్రింగుచుందురు. బెర్నార్డుషావంటియాతనిభార్యతో తమకు పరిచయభాగ్యమున్నదని చెప్పికొని గర్వించెడి యవకాశమునకై వేచియుందురు. కాని ముప్పదిసంవత్సరములనుండి భర్తతో కాపురముచేయుచున్నను పరిసరగృహస్థులే షాసతిని గుర్తింపజాలరు. ఈమె "నేను శ్రమపడనక్కరలేదు. ఇద్దరకు సరిపడుకీర్తిని నాభర్తయే సంపాదింపగలడ"ని మందహాసము చేయుచుండును. "నన్ను గూర్చి వ్రాయుటనిన నాకసహ్యాకరమని"ని చెప్పినది. ఇందులకు కారణమేమియో ఆమెయే వివరింపజాలదు. "విఖ్యాతియనిన విముఖతజూపెడి నాయట్టి విపరీతచర్య అసామాన్యమే. నేనుకూడ నొక అసామాన్యనే కానోపు"ననిపల్కుచుండును. షాసతి నిజముగ నసామాన్య. బెర్నార్డుషాయొక్క యర్ధాంగి సామాన్యస్త్రీ యెట్లగును?

బెర్నార్డుషా స్విట్జర్లండులో నొకసారిదెబ్బతగిలి మంచముపట్టి బలహీనస్థితిలోనుండగా నీమె పరిచర్యయొనర్చినది. ఇదియే షాదంపతుల ప్రథమపరిచయము. అప్పుడే బెర్నార్డుషా యామెకు తనవివాహేచ్ఛనెఱిగించెను. నడువలేనిస్థితిలో లాగుడుబండిమీద 'చర్చి'కి వెళ్ళి వివాహక్రతువు జరిపించెను.

బెర్నార్డుషా ఎన్నడును బహిరంగసమావేశములలో కృతజ్ఞతాపూర్వకముగగాని, గౌరవపురస్సరముగగాని తనసతినిగూర్చిన ప్రసంశచేయడు. ఇట్టి "రివాజు" ప్రసంశలకతీతమగు యథార్థప్రేమకలదామెయందు చాయనకు.

పరిణయానంతరమే బెర్నార్డుషా తన మహోత్కృష్టజీవితము నారంభించినాడు. వివాహమైన సంవత్సరమునవె తనప్రథమరూపకమును ప్రచురించినాడనునది అప్రాముఖ్య విషయముకానేరదు. షానతి శక్తిసామర్థ్యములు తనభర్త రచనకెంత యాధారభూత ములో సులభముగచెప్పనలవికాదు.

ఆమె యాతనికి మిక్కిలి సహకారి. ఆయన తాను పగలువ్రాసినదంతయు రాత్రి భార్యకు చదివి వినిపించును. ఇద్దరును విషయమును చర్చించెదరు. ఆమె యొసగు సలహా నాతడు అత్యాదరముతో నంగీకరించుచుండును.

షానతికూడ గ్రంథకర్త్రి. భర్తృరచనములామెకు పారాయణగ్రంథములు. అందలి కొన్ని ముఖ్యఘట్టములనేరి సంపుటీకరించినది. ఇంతేకాక ఫ్రెంచిభాషనుండి పెక్కునాటక ముల నింగ్లీషులోని కనువదించినది. బెర్నార్డుషా అన్యదేశభాషల నెరుగమిచే నామెయే ఆయనవెంటనుండి భాషాంతరీకరణోద్యోగినిగా పనిచేయుచున్నది. షానతి ఆదర్శమాత. భర్తను కన్నకుమారునివలె సాకుచున్నది. ఆతని యశశ్చంద్రికలగాంచి గర్వించుచున్నది. అనన్యలభ్యమగు గౌరవములనంది "ఈయనకీయనయే సాటియని" వన్నెకెక్కిన తనభర్త జీవితమునవె తన జీవితపుఫలితమును గని ప్రఫుల్లితహృదయమై సంతృప్తినొందు చున్నది."

## శోకగానము

పెమ్మరాజు రాజగోపాలముగారు (సారస్వతసమాజము)

౧

ఆగలేదే? అశ్రుపూరము;
తీరలేదే! దుఃఖభారము;
ఇంతలోనే పుత్రశోకము
వచ్చిపడెనా? తల్లి! సీతా.

౨

భారతాంబకు గుండెప్రేలెను,
యువకలోకము క్రుంగిపోయెను,
జీవసారము చెన్నుమాసెను,
దీనరావము దిశలనిండెగా.

౩

పొంగునేమో క్షుభితసంద్రము,
విరుగునేమో విపులగగనము,
తోచునేమో ధూమకేతులు,
ప్రళయకాలమె సంభవించెగా.

౪

ఉఱిమెదేలా క్రూరమేఘమ?
బెదరజేయుచు కారుచీకటి;
శాంతపవనమొ, చండపవనమొ
వీవసాగెను తొందరేలా?

# గ్రామపునర్నిర్మాణము : స్త్రీలబాధ్యత

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మమ్మగారు

సంసారము-ఐహికజీవయాత్ర-శకటమువంటిది. పురుషులు దానికొకవైపున, స్త్రీలు రెండవవైపున, చక్రములవలెనున్నారు. రెండుచక్రములలో నొకటి నిరాటంకముగాను, చురుకుగాను, తిరుగుచు రెండవది కొన్ని ఆటంకములచేత నట్టునట్టుగా, మందముగాఁదిరిగిన నాశకటగమనము ఎట్లుండును? అది వలయాకారములో దిరుగుచుండును. బాటవెంబడి ముందునకుజరుగదు. ఆతీరుననే గ్రామపునర్నిర్మాణకార్యమునందును స్త్రీ పురుషులు సమానముగానే సంచరించవలెను. పురుషులుమాత్రము జ్ఞానవంతులై ముందంజవేసినచో కార్యక్రమము ముందునకు జరుగనేరదు. గ్రామాభివృద్ధివిషయమై, ఈక్రిందచెప్పబోవు సంస్కారమునుగూర్చి చెప్పునప్పుడు పురుషులబాధ్యతతోపాటు స్త్రీలబాధ్యతకూడ గలదని వేరచెప్పనక్కరలేదు. గ్రామపునరుద్ధారణమునుగూర్చివలసిన వాంశములను సమష్టిగావిశదపరచి పిమ్మట స్త్రీలబాధ్యతగూర్చి ముచ్చటించుచు వారి ప్రత్యేకబాధ్యతలనుగూర్చి చెప్పుదును.

మనదేశము కేవలము సేద్యవృత్తిపై నాధారపడియున్నది. ఇంగ్లాండుమున్నగునవి విశేషము పరిశ్రమలపై నాధారపడియున్నవి. అట్టిచోట్ల పట్టణములే ముఖ్యముగా నివాసస్థానములు. మనదేశమట్లుగాక గ్రామములతో నిండియున్నది. గ్రామములన్నియు నభివృద్ధిఁజెంది యైశ్వర్యవంతములైనయెడల దేశమభివృద్ధిఁజెందినట్లే. అట్లుగాక మనగ్రామములు దరిద్రవంతములై యనారోగ్యమునకాటపట్టులైయున్నయెడ దేశమును యట్టిదుస్థితియందుండునట్టులు. కావున దేశాభివృద్ధి కోరదగినదైనప్పుడు గ్రామాభివృద్ధియే ముఖ్యసాధనము. ఇంటికన్న గుడిపదిలమన్నట్లు భూములునిస్సారములై, గ్రామములు దరిద్రపీడితములై, దేశము క్షామవంతమై యుంటుండగా మదరాసు, బొంబాయి, కలకత్తామున్నగు పెద్దపట్టణములలో విశేషధనవ్యయముచే నెరవేర్పబడిన పార్కులు, కట్టడములుమున్నగునిర్మాణములనుజూచి మనదేశనాయకు లెంతకాలము మురియుచుందురో; ఎంతకాలము గ్రామాభివృద్ధికై వారుదృష్టినిలుపరో అంతకాలము మనదేశము దుస్థితియందుండవలసినదే. కావున గ్రామాభివృద్ధియే దేశోద్ధారణము.

గ్రామపునర్నిర్మాణము అనగా గ్రామమును తిరిగి నిర్మించుటనియర్థము. ఇప్పటిగ్రామముల దుస్థితిఁజూడగా గ్రామోద్ధారణము చేయవలసివచ్చినప్పుడు ప్రస్తుతపు దుస్థితులను పూర్తిగామాపి, నూతనపద్ధతులను నెలకొల్పవలసియున్నది. ఇదియే గ్రామపునర్నిర్మాణము. మనగ్రామము లిప్పు డెట్టిదుస్థితియందున్నవో విచారింతము. గ్రామములు పెంటలతో నిండియున్నవి. వీథులలో దుమ్ము రేగుచుండును. ప్రజలు రోగపీడితులగుచున్నారు. కలరామున్నగు జాడ్యములు తరచుగావచ్చుచున్నవి. భూములు నిస్సారములగుచున్నవి. సేద్యగాండ్రకువలెనే పశువులకును పరిశ్రమఎక్కువ. ఆహారముతక్కువ. పీల్చుకొనెడిగాలి దుర్గంధపూరితము. త్రాగెడినీరు అపరిశుద్ధము. తినెడుఆహారము అనారోగ్యకరమును నిస్సారమునుఅయియున్నది. ఇవిగాక ప్రజలు అజ్ఞానులును, అనారోగ్యవంతులునైయున్నారు. జూదము, పానము రెండు. అప్పులేనివాడొక్కడును లేడు. విద్యావిహీనతయు, మూఢత్వమును రెండు. ఏవిషయములోను మార్పును చేసికొనుట కిష్టములేకుండుట.

ఇట్టిదుస్థితియందుండిన గ్రామములను పునరుద్ధారణముజేయుట కన్నివిధముల ప్రయత్నములఁజేయవలసియున్నది. ఈప్రయత్నములకు ముఖ్యాభిప్రాయము మనవేదోక్తమైన ఆశీర్వచనమే. అనగా "ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు సర్వేజనాఃసుఖినోభవంతు" అనుటయే. ఈప్రయత్నములను గ్రంథవిస్తరభీతిచే నొక్కొక్కటియే పేర్కొని కొలదిమాటలతో దానిని ముగింపవలసియున్నది.

**గ్రామపారిశుద్ధ్యము** —గ్రామము లపరిశుద్ధతకు స్థానములు. ఇందువలన రోగములు ప్రబలుటయే కాక పరిశుద్ధమైనవాయువు పీల్చికొనకుండుటచే మనుష్యులు నీరసులగుట, పిల్ల లనాకారులుగను, వికారాకారములుగలవారుగను అగుట జరుగుచున్నది. పశువులుకూడ సారములేనివై, నిరుపయోగములగుచున్నవి. వీనివలన మనుష్యులకు బుద్ధిమాంద్యతయు, దరిద్రమును ఘటస్థించుచున్నవి.

గ్రామవీథులయందును, గ్రామకీవాడులయందును కుడిచిన పెంట ప్రోగులు, క్రుళ్లుచుండిన పేడ ప్రోగులు నుండరాదు. వీనిని చిన్న గ్రామములలో యూరికవెలుపలను, పెద్దగ్రామములలో నింటికి దూరమగు దొడ్లలోను మిక్కిలిలోతుగ గోతినితీసి అందులో వేయవలెను. ఆగోతులకుచుట్టును, కొంతయెత్తువరకు గోడలను పెట్టుట శ్రేష్టము. దుర్గంధము గోతులలోనుండి విశేషముగ ఎత్తునకు రాదు. వీనిని సాధ్యమైనంతవరకు నిండ్లపైగాలులు రానివైపున-అనగా-ఇండ్లకు ఉత్తరపువైపున నిట్టిగోతులను తీయుటమంచిది. పశువుల త్రొక్కిడియు, బూడిద మొదలగు వానినికూడ నిందుచేర్చుటమంచిది. ఇట్టిగోతులు గ్రామస్థులకు బంగారపుగనులని చెప్పుదురు. వీనివలన రెండుపయోగములున్నవి. అనారోగ్యప్రదములగు దుష్పదార్థములు తొలగింపబడుటయే గాక నివిఅట్టిగోతులలో క్రుళ్లి పొలములకు మిక్కిలి సారవంతములగు యెరువులగుచున్నవి.

పల్లెటూళ్లవీథులలోను, ఇంటిసమీపమున దొడ్లలోను తరుచు మలమూత్రములను విడుచుచుందురు. ఇది మిక్కిలి అనర్థదాయకమగుదురాచారము. ఈవిషయములో మృగములకంటె మనుష్యులజ్ఞానాధిక్యత వృథవోవుచున్నది. దొడ్లలోనలువైపులను గోడపెట్టిన చిన్నదొడ్ల నేర్పరిచికొని ఆచిన్నదొడ్లలో ఒకఅడుగు వ్యాసమును, 4 అడుగులలోతునుగల గోతులనుతీసి ఆకపాయఖానాకుపయోగింపవలెను. కొలదిరోజులలో నాగోతినిపూడ్చి ప్రక్క మరియొకదానిని తీయవలెను. ఇట్టి పెంటలను, మలమూత్రములను, గ్రామములలోను, చుట్టుప్రక్కలను, ఉండనిచ్చుటచే నవియెండి యాదుమ్మువాయువుతో నెగిరి మనబట్టలపై, మొగములపై పడుటయేగాక కండ్లలోను, చెవులలోనుగూడ బడును. ముక్కులగుండా లోనికిఁబోవును. మనము తినెడు ఆహారములోనికి, త్రాగెడి నీటిలోనికిని వచ్చును. ఇదంతయు దలచుకొన్నయెడల నొడలు జలదరించి వెలపరముపుట్టును. కాని జరుగుచున్న వాస్తవమిదియే. ఇందువలన రోగములు పుట్టుటయేగాక నేత్రములు చెవులు మొదలగు నింద్రియములకుఁగూడ మాంద్యతకలుగుచున్నది. ఇదిగాక ఈదుష్పదార్థములవలన ఈగలును, దోమలును తండోపతండములుగా వృద్ధిఁజెంది ఈదుష్పదార్థములనంటిన దేహములతో వచ్చి మనఆహారములపై వ్రాలును. పిల్లలముక్కుల మీదను, మూతులమీదను వ్రాలును. అవి మనలోపలకురాకముందు తమయొడలును, పాదములును శుభ్రముగా కడిగికొనివచ్చునా? వీనివలనగూడ ననారోగ్యము వృద్ధిఁజెందుచున్నది. కలరా, మొదలగు జాడ్యములుకూడ వ్యాపించుచున్నవి.

**మంచినీరు:**—గ్రామములలో సాధారణముగా చెరువులే జలాధారములు. కాని ఈజలములు లోపలనుండి వెలుపలనుండికూడ అపవిత్రములగుచున్నవి. నీటిలో నాచు, జమ్ము, తూటి, కలవ, తామర మొదలగునవిపుట్టి అవిక్రుళ్లి చెరువులలోని నీరు పాడగుచున్నది. నిలవనీటిలో జలజంతువులనేకము పుట్టి చచ్చుచున్నవి. చెరువులలోనికి గ్రామములోని వాననీరును, చెరువులచుట్టు ప్రదేశములందు కురిసినవర్షపు నీరును వచ్చుటచేగూడ నానీరుచెడిపోవుచున్నది. పశువులుమున్నగునవి చెరువులలోదిగి తరుచుగా మలమూత్రములు విడుచును. ఇన్నివిధముల చెరువులనీరు పాడగుట కవకాశమున్నది. కాని చెరువులేగతియైన గ్రామములలో నీరుపాడుగాకుండ తగినకట్టుదిట్టమును చేయవలెను. పరిశుభ్రమైననీటినే చెరువులలో పెట్టవలెను. చెరువులచుట్టును ఎత్తైనగట్లుండవలెను. ఆగట్లమీద మలమూత్రములు విడువనీయకూడదు. పశువులను లోనికి

దిగనీయరాదు. స్నానము చేయుట, అంట్లుతోముట, బట్టలుదుకుట సాగనీయరాదు. ఇట్టివి రెండు చెరువులుంచి కొని ఒకసారియొకటియు మరియొకమారు రెండవదియు పూర్తిగా నెండగట్టి కొంతలోతువరకు త్రవ్వుటవలన నీటిమొక్కలను, జలజంతువులను పుట్టకుండజేయవచ్చును. త్రాగుటకనుకూలమైన నీరూరెడి ప్రదేశములలో నూతినీరు త్రాగుటయే యుత్తమము, కాని ఆనూతులచుట్టును గచ్చుపళ్లెములుండవలెను. నూతిచుట్టును పడిన నీరు చాలాదూరము దొరలిపోవలెను. నూతులకుచుట్టును మురికిగుంటలుగాని, పెంటప్రోగుగాని యుండిన యెడల ఈదుష్పదార్థములసారము భూమిలోదూరి నూతులలోనికేవచ్చును.

**నీటిని వడియగట్టుట:**—చెరువులనీరైనను, కాలువలనీరైనను వడియగట్టవలెను. పట్టణములలో నెక్కువ ధనవ్యయముచేసి పెద్దయెత్తుమీద నీటినివడియగట్టి కుళాయిలమీద నీటినిసరఫరా చేయుదురు. నూతుల లోనికి సాధారణముగా వడియగట్టబడిన మంచినీరేవచ్చును. గ్రామాదులలో వడియగట్టుటవనగా బిందెమీద మడతపెట్టినబట్టవేసి దానిగుండానీటినిపోనిచ్చుటయే అయ్యున్నది. అందువలననీటిలోని చెత్తమాత్రముతీయ బడుచున్నదిగాని నీటిలోనిబాడియు విషవాయువులును విడదీయబడుటలేదు. నీటినికాచి చల్లార్చుట ఉత్తమమే. కాని పేదసాదలకనువైనదికాదు. ఒకదానిపైనొకటి మూడుకుండలనుపెట్టి పైకుండకు మధ్యకుండకు నడుగున చిన్నరంధ్రములనుపొడిచి ఆరంధ్రములలో చిన్నదూదిపింజలను జొనిపి పైకుండలో 3-వ వంతువరకు గండ్రఇసుకయు, మధ్యకుండలో సగమువరకు రాక్షసబొగ్గును పోసియుంచవలెను. కాలువలయు, చెరువులయు, నూతులయు నీటినికాచిగాని, కాచనిదిగాని పైకుండలోపోసినయెడల నది యిసుకగుండా అడుగునకు జారినపుడు దానిలోనిచెత్త, బాడి, నులిపురుగులును అడ్డగొట్టబడి పవిత్రమైననీరు మధ్యకుండలోనికిదిగును. మధ్యకుండలోని రాక్షసబొగ్గుగుండా జారునపుడు నీటిలోనివిషవాయువులును, ఇంకనుమిగిలియున్న విషపు పురుగులును విడదీయబడి పవిత్రమైనట్టియు ఆరోగ్యప్రదమైనట్టియు నీరు అడుగుకుండలోనికిజారును. ఇట్టి నీటిని త్రాగుటయే మిక్కిలియుత్తమము. ఈపద్ధతిని వడియగట్టుటకు కావలసినసామగ్రి 10 లేక 12 అణా లలోదొరుకును. నిరుపేదలుసైతము ఈపద్ధతి నవలంబింపవచ్చును.

**ఆహారము:**—ఆరోగ్యప్రదమగు ఆహారము ధనవంతులకేగాని దరిద్రులకు సులభసాధ్యముకాదని అనుకొనుట పొరబాటు. చక్కగాపచనముచేయబడిన పదార్థములేవియు అనారోగ్యప్రదములుకావు. దేహ కండరములకును, రక్తపుష్టికిని, ఇంద్రియపటుత్వసంపదకును, నరములపుష్టికిని అనువగు పదార్థములు సులభమైనధరలకేదొరకగలవు. అట్టిపదార్థములయొక్క విజ్ఞానములేకనే గ్రామస్థులుకష్టపడుచున్నారు. వారికట్టి జ్ఞానముకలుగజేయవలసియున్నది.

**గృహనిర్మాణము, గృహశుచి:**—చలనములేని వాయువునుపీల్చుటకంటె వీచుచుండినవాయువునుపీల్చుటయు, వట్టివాయువందునికియు వారోగ్యప్రదమును, ఉల్లాసకరమును అగును. పగటిపూట విశేషభాగము బయటగాలిలోసంచరించినను పురుషులు రాత్రి చాలభాగమింటనే యుండవలసియుండును. పిల్లలును అట్లే. కాని స్త్రీలుమాత్రము ప్రొద్దంతయునింటనే యుండవలసియున్నది. అట్టియిండ్లలో గాలి కదలుటకైనను వలయుసదుపాయములేనియెడల నందువలనకలుగుదోసగులు వర్ణనాతీతములు. ఇంటినిండనుబూజు, దుమ్ము, ఈగలుముసరుట, దోమలుచేరుట, బొజ్జింకలయు బల్లులయుప్రచారము, ఎలుకల యథేచ్ఛాప్రవర్తనము ఇవిఫలితములు. కావున మనయిండ్లకు నలువైపులను పెద్దపెద్ద కిటికీలనుంచి గాలివిచ్చలవిడిగవచ్చునట్లు చేయవలయును. ఇల్లంతయుతుడిచి గోమయముతో నలుకుచుండవలెను. సున్నపుపొడితో ముగ్గులనుపెట్టుట అందమునకేకాక, ఆరోగ్యమునకుకూడనైయున్నది. గోమయమును, సున్నమును పారిశుధ్యసాధనములు. అటకలు

తరుచు దులుపుచుండవలెను. గోడలకు సంవత్సరమునకు రెండుమారులైనను వెల్లవేయవలెను. ప్రతివస్తువునుంచుటకు నొక్కొక్క నియమిత స్థానముండవలెను. ఇండ్లను మెరకచేసికట్టవలెను. దొడ్లుకూడ వీథికంటె మెరకగా నుండవలెను. దొడ్లలోగాని, ఇంటిముందరవీథులలోగాని మురికిగుంటలు, చెమ్మనేలలు నుండరాదు. దొడ్లలో నీరువిశేషముగా వాడుభాగములందు అరటిమున్నగు జలమువిశేషముగా పీల్చికొను వృక్షములు, మొక్కలు నుండవలెను. దొడ్లలో ఫలవృక్షములను, పూలమొక్కలను, మనోహరములగు క్రోటన్సులను పెంచవలెను. వీథులలో చల్లనినీడనిచ్చు ఫలవృక్షములను నాటవలెను. దొడ్లలోగాని, వీథులలోగానివిశేషముగా ఆకురాలు వృక్షములుండరాదు. ఇంటిలోను, దొడ్లలోను, వీథులయందును, ఊడ్చినచెత్త ఎప్పటికప్పుడు పైనచెప్పబడ్డ మురికిగోతులలో క్రుళ్లనిచ్చినయెడల వీటివలనపొలమునకు కలుగు భూసారాధిక్యత త్రిగుణీకృతమగును.

గ్రామసంస్కరణము:—గ్రామస్థులే పనిచేసికొనుటకైనను వారికిజ్ఞానముండవలెను. అట్టిజ్ఞానము విద్యవలననేకలుగును. వారు విద్యావిహీనులైయున్నంతకాలము వారిబాగులకై చేసెడిప్రయత్నములును చెప్పెడి సలహాలును వృథయగుటయేకాక ఘేరనిత్రోకొట్టినట్లు వారిమూర్ఖత్వము మరికొంతముదురును. గ్రామములో చదువను, వ్రాయను నేర్చినవారు నూటికిద్దరుండుటయే యరుదు. మనదేశమంతయు నిట్టిగ్రామములతోనే నిండియున్నది. ఇట్టిగ్రామములు మనదేశములో 700000 లున్నవి. మనదేశములో నించుమించు 27 కోట్లమంది గ్రామములందేయున్నారు. ఇప్పటి మనదుస్థితికిని ముందుముందుమనము నెలకొల్పబూనుకొన్న దేశాభివృద్ధికిని యెంతదూరమున్నదో చూడుడు! మనమెంతనైపుణ్యముగా ఎన్నెన్నిమార్పులను చేయవలెనో తలచికొన్నను, ఇట్టి కార్యనిర్వహణమునకును ఇప్పటి మనయల్పజ్ఞత్వమునకును గలవ్యత్యాసము తలచికొనినప్పుడును ఎంతటి బుద్ధిమంతులకును ఒక్కొక్కప్పుడు దేశాభివృద్ధిదీక్షయందు నిరుత్సాహముగూడ జనించుచుండును. ఐనను ఉట్టికెగురలేనివారు స్వర్గమునకెగురగలరా అనునట్లు ఒకచిన్నగ్రామమునే సంస్కరింపలేనివారు దేశాభివృద్ధికై పూనుకొనుట హాస్యాస్పదముగదా! "ఇంటగెలిచి రచ్చగెలువు"మన్నట్లు ముందుగ్రామములను సంస్కరించినయెడల దేశము తనంతటతానే యున్నతస్థితికివచ్చును. దేశాభిమానము-దేశాభివృద్ధికై పూనికయు, కుతూహలమునుగల యుదారస్వభావులైన స్త్రీపురుషులెల్లరును గ్రామాభివృద్ధికై మునుమున్నుకంకణము కట్టికొని, తమకుసౌఖ్యప్రదములగానున్న పట్టణములనువీడి గ్రామములకుఁజేరి చేతనైనంతకృషి చేయుచుండవలెను. అప్పుడు వారికృషికితోడుగా సర్కారువారున్ను, ద్రవ్యవంతులును అన్నివిధములసాయమిత్తురు.

గ్రామపునర్నిర్మాణము: ఆర్థికస్థితి:—గ్రామములదుస్థితియే దేశదుస్థితియని చెప్పియున్నాము. అట్టిదుస్థితిని తొలగించుటకెన్నియుపాయములైనను ఊహింపవచ్చును, వ్యాసములువ్రాయవచ్చును. ప్రచారము చేయవచ్చును. నూతనపద్ధతులను బోధింపవచ్చును. విద్యలగరపింపవచ్చును. ఇవన్నియు గ్రామాభివృద్ధికి సాధనములే. కాని సాధనములకన్నిటికిని సాధనము-సాధనములలో ప్రథమసాధనము-"ధనమూల మిదం జగత్." మనదేశమందదియే శూన్యము. దీనికికారణము తరిగిపల్లెటూరే! గ్రామముధనవంతమైనయెడల దేశమును సంపన్నమగును. ఆరోగ్యమెంతయవసరమో! ఐశ్వర్యమునంతే యవసరము. ఈదరిద్రము తొలగుటెట్లు? దీనికికారణముల నరయవలయును. ఒక్కొక్క కారణమును తెలిపి దానికివిరుగుడులు చెప్పినయెడల నీవ్యాసముసార్థకమగును.

## దరిద్రకారణములు : విరుగుడులు

స్త్రీజనాలంకారములు:—వేలకువేలువగలకై వెచ్చించుచున్నారు. కంసాలిమాయవలనతిన్నదియు, మజూరీక్రిందతిన్నదియు పోగా 1000 రూపాయలపెట్టుబడికి షుమారు 700 రూపాయిల సరుకు వంటిమీదికి



శ్రీమతి యస్. సుభద్రమ్మగారు



లీలా కన్య సినీమా నటి

*Courtesy of 'The Movie Mirror'*

వచ్చుచున్నది. ఇది కాలక్రమమున అరిగి విలువ తగ్గుచున్నది. దీనికి దొంగలభయము మెండు. ఈ నగలపేక్ష మన దేశమునందు మాత్రమే యున్నది. అదియును ఒకరిని చూచి ఒకరు తెచ్చిపెట్టుకొన్నది. ఈ నగలపై ఉబలాటపడుటకు, అప్పులు చేసిరైనను ఆస్తులనమ్మిరైనను నగలే చేయించుకొనుటకు ముఖ్యకారణములు మూడు. అందము కొరకు, గౌరవముకొరకు, ఆడుదాని పరపతికొరకు. ఈ మూడు కారణములు సత్యములైనయెడల నగలవసరమే. ఇవి సత్యములు కానిచో నగలు అనర్థదాయకములని వేరె చెప్పవలయునా? నగలు అందముకొరకు:—ఆరోగ్యమే అందము. యౌవ్వనమే అందము. "గాడిదపిల్ల కోమలము గాదే" అనునట్లు స్త్రీలకుగాని, పురుషులకుగాని ఆరోగ్యమునంటి అలంకారము వేరొండు కలదా? ఆరోగ్యమునంటి అమూల్యాలంకారమును కాపాడుకొనుటయే మనదేశస్థులు నేర్చుకొనతగ్గది. ఆరోగ్యమును, జవ్వనమును సడలిన స్త్రీలకుగాని, పురుషులకుగాని అలంకారమువలన శోభ దేబూనుట చేదుమందునకు పంచదారపూతపెట్టునట్లు. నగలు గౌరవముకొరకు:- ఇదియును మనదేశములో గతానుగతికముగా వచ్చుచున్నది. "ఎద్దుబరువు నగలు-దిద్దుకుంటేగాని-పెద్దపేట వెయ్యరోయి పెద్దాయా!" అనునట్లు నగలను చూచి గౌరవించుట మనదేశమందాచారమైయున్నది. దీనికి కారణము మూఢత్వమే. గౌరవార్హములైనవి సదాచారసంపత్తియు, యోగ్యప్రవర్తనయు, విద్వత్తునైయున్నవి. పూర్వమొకప్పుడు సింహముతోలును గప్పికొన్న గాడిదను జూచి మృగములన్నియు భయపడుచుండెడివట. తుదకు నక్క దాని నిజస్థితి నెట్లో కనిపెట్టి వెనుకకుపోయి కూయనారంభించెనట. గాడిద తనవెనుకటికాళ్లతో నెగిరి పెల్లువ వెనుకకు తన్నివదట. ఇట్లే నగలవల్ల వచ్చు గౌరవముకూడ నోరుతెరచువంతవరకే. నగలు పరపతికొరకు:—ఇది కొంతవరకు నిజము. మనహిందూధర్మశాస్త్రప్రకారము స్త్రీలకు దాయభాగము లేదు. ప్రథమమున తండ్రిపై, పిమ్మట భర్తపై, తుదకు బిడ్డలపై ఆనుకొనియుండవలయును. అట్లానుకొనియున్న వారిని భరించువారు చులకన చేయుట సహజము. కనుక నగలు వారికి స్త్రీధనమై కొంతవరకు పరపతి పుట్టించుచున్నవి. కాని నగలు దేశమున కనర్థదాయకములైనప్పుడు స్త్రీలకు మరొకవిధమున పరపతి కలుగజేయవలెను. ఇందుకు హిందూలా మార్చవలెను. దీనికి తగుప్రయత్నము లిప్పుడు జరుగుచున్నవి.

**కార్యములప్పు డమితవ్యయము:**—ఇదియును గతానుగతికమైన దురాచారమే. ఒకరిని చూచి యొకరు—ఒకరిని మించవలెనని యొకరు—బంధువుల మెప్పుకొరకును—ఆలుబిడ్డల తృప్తికొరకును—అప్పులుజేసిరైనను—ఆస్తులనమ్మిరైనను మనవారు విశేషముగా ధనమును వెచ్చించుచున్నారు. ఈమధ్య బొంబాయిలో నొక కోటీశ్వరుడొక వివాహము వేదోక్తముగా 12 రూపాయలతో చేసెనట. ఈతడందరకును మార్గదర్శకుడగుగాక! పెండ్లిండ్లలో ననవసరపుఖర్చులు తగ్గుగాక! దీనికి ముఖ్యముగా ధనవంతులును, పలుకుబడిగలవారును మార్గదర్శకులు కావలెను.

**రోగములు తరుచగుట:**—అనారోగ్యకరములగు గ్రామములలో జాడ్యములు తరచుగా ప్రబలి ప్రజలను చంపివేయుటయో, లేక ఏపనిజేయలేనట్టి దుర్బలులుగ మార్చుటయో చేయుచున్నవి. దీనికి విరుగుడు ఈవ్యాసములోఁ జెప్పినట్లు ఆరోగ్యప్రదములైన సంస్కరణములఁ జేయుటయే. పిల్లలకును, పశువులకును టీకాలు మున్నగునవి వేయించుచుండుట మరియొకటి.

**సమష్టికుటుంబములు:**—ఈపద్ధతి మనదేశములో మాత్రమేయున్నది. ఇది కుటుంబాభివృద్ధికై పెద్దలుచేసిన నిర్ణయము. దీనిని పెద్దలు నిర్ణయించిన పద్ధతిని నడపినయెడల నిది శ్రేయోదాయకమై మన జాతికి గౌరవము తెచ్చినదగును. సమష్టికుటుంబమనగా నన్నదమ్ములు—వారిభార్యలు—వారిబిడ్డలు—వారి వృద్ధులు—ఇంకను దిక్కులేని వారిమేనత్తలు, పినతల్లులు మొదలగువారు—అందరునుకలసి ఏకభాండాశనమును

చేయుట. ఇందందరును ఒక్కనిని నమ్మి పెత్తనముంచుట. ఇందు ప్రతివారును కుటుంబమునకై పాటుపడవలెను. స్త్రీలు స్త్రీజనార్హమైన కృత్యములును, పురుషులు పురుషోచితకార్యములును యథార్థముగా చేయుచుండినయెడల నిదియెంతయు శ్రేయోదాయకము. వేయినోళ్లపొగడదగినది. ఇహపరసాధనమైనది. సమష్టివలన కాలమును, వ్యయమును కూడివచ్చును. అందువలన కుటుంబఆర్థికస్థితి అభివృద్ధిఁజెందును. ఆచరణను బట్టి సదాచారములు సైతము ఒక్కొక్కప్పుడు దురాచారములని పించుకొనును. ఇంతశ్రేష్ఠమైన సమష్టికుటుంబపద్ధతి దురాచారముగా నెంచి దరిద్రతాకారణములలో చేర్పవలసివచ్చినది. సమష్టికుటుంబీకులు సోమరులై, స్వార్థపరులై, స్వాభిమానులై, కుత్సితులై వ్యవహరించుటచే నైశ్వర్యమునశించుచున్నది. ఒక్కని పాటుపై పెక్కురాధారపడియుండినయెడల నైశ్వర్యము లడుగంటకుండునా? ఇప్పుడిప్పుడు ప్రజల బుద్ధులు మారి (ఇందుల కీలాకోర్టులేకారణములు) సమష్టికుటుంబముల గమనికలు చెడుచున్నవి.

**అతివృష్టి: అనావృష్టి:**—మనదేశము సేద్యమే ముఖ్యాధారముగాగలది. సేద్యమునకు నీటివసతి మొదటి అవసరము. జలమునకు వర్షముమూలాధారము. "నెలమూడువర్షముల్ నెమ్మిగురియు" అనునట్టి పుణ్యాత్ముల కాలముపోయి పాపాత్ములమైన మనకాలమందు ఒక్కొక్కప్పుడతివృష్టియుఁ దరుచు అనావృష్టియు గల్గుచున్నది. సమవృష్టియరుదు. సమవృష్టికి వలయుప్రయత్నములు మానవాతీతములు కావున "అయితే ఆరిగ, కాకుంటే కంది" అన్నసూత్రమును రయితు లానుకొనియుండవలసినదేకాని వేరొండు సరళమైన యుపాయము దొరకదు.

**రైతు పూర్వాచారపరాయణత్వము:**—ఎన్నకో ఇక్ష్వాకులనాడు మనదేశములో సేద్యవృత్తినడచిన తీరులు నేటికిని జరుగుచున్నది. దీర్ఘకాలము సేద్యవృత్తిలో మార్పులేమియుఁ జేసియుండలేదు. అబక్కదూడలే—అకొయ్యనాగళ్లే—ఆపైరుక్కియే—అనిస్సారపు భూములే—అనిరర్థకపు విత్తులే! కాని ఎందునుమార్పులేదు. మార్పునకు రైతు ఒప్పను ఒప్పడు. ఇట్టిస్థితిలో సేద్యవృత్తివలన ఆదాయవృద్ధియెట్లగును? సేద్యవృత్తిలో జరుగవలసినమార్పులు, చొప్పించవలసిన నూతనపద్ధతులనుగురించి విపులముగా వ్రాయుటకు ఈవ్యాసముచాలదు. కావున కొన్నిటినిమాత్రము బహుసంక్షిప్తముగా నిందుపొందుపరచుటైనది. మంచి దుక్కిటెద్దులు:—మనదుక్కిటెద్దులను బలిష్టములైనవిగాను, పనికోర్చునవిగాను కాలక్రమమున సులువుగా చేయవచ్చును. ఇందుకు మంచి ఆంబోతులను, మంచి ఆవులనుమాత్రమే యుపయోగించవలెను. మనుష్యులకువలెనే పశువులకును మంచిగాలియు, మంచినీరును, పరిశుద్ధమైన గృహములును, సారవంతమైన మేతయు, టీకాలు వేయుటయు అవసరములు. నాగళ్లు:—ఇప్పటి కొయ్యనాగళ్లవలన భూమికి సరియైనదుక్కి జరుగదు. ఇప్పుడు సప్లయికాబడు ఇనుపనాగళ్లను ప్రయోగించినగాని లోతుదుక్కి జరుగదు. భూమిలోని చీమలపుట్టలను, ప్రాతవేళ్లను నశించవు. నిరిటి మొక్కలవ్రేళ్లు భూమిలోని కొంతచెమ్మను లాగికొని ఇప్పటిసస్యములను పాడుచేయును. మన బలిష్టమైనయెద్దులు ఇనపనాగళ్ల నవలీలలాగగలవట. మంచి విత్తనములు:—ఇవి సర్కారువారిచే తయారుచేయబడి సరాఫరా అగుచున్నవి. విత్తనములు దృఢమైనవికానియెడ మొక్కలు పుట్టుకలోనే నీరసములగుచున్నవి. ఒక బక్కవనితకు పుట్టిపెరిగిన పసిబిడ్డవలెనే ఈమొక్కలును ఉండును. భూసారమెంతయున్నను ఇట్టిమొక్కల కకేత్తియేగాని పుష్టియుండదు. చెత్తగోతులు:—వ్యాసములో నొకచోట చెప్పినరీతిని చెత్త, చెదారము, పేడమున్నగునవి కుళ్లనిచ్చినయెడల బంగారమువంటి ఎరువగును. పేడపిడకలుచేసి వంటచేయుటకంటె ఎరువుగానుపయోగించినయెడల తొమ్మిదిరెట్లధికఫలము దొరకునట. స్త్రీలకు పేడచేయుటయందలి ప్రయాసమును, కాలహరణమును తొలగును. మడులుచేయుట:—దంపపొలములలో

వలెనే మెట్టపొలములలో కూడ భూమిమట్టమునుబట్టి మడులుగా విభజించి, మడులచుట్టును, ఎత్తైయిన గట్లు వేయుటవలన వర్షపునీరు బైటికి పారలిపోక భూమిలో వింకును. ఇందువలన మొక్కలకు సౌకర్యమేకాక భూసారము బయటికి తొలగిపోదు. లోతుదుక్కి నీరునింకించుట కనువైన సహాయమునిచ్చును. ఏటేటపంటదినుసులు మార్చుట:—భూమిలోని సారము వేర్వేరుగుణములుకలదియై, వేరువేరుదినుసులకు సాయమొనర్చుచుండును. ఇట్టిస్థితిలో ఒక్కచేపొలములో ఏటేట ఒక కందినిమాత్రమే వేయుచుండినయెడల కందికి పలయుగుణము క్రమముగా: నశించి పంటచెడును. కాన రెండవయేట పెసర వేసినయెడల పెసర వృద్ధియగును. ఇదిగాక కందికికావలసిన గుణముతిర్గి చేరుకొనును. అప్పు, హెచ్చువడ్డి:—రైతులు మంచిపంటలను పండించుకొలేకను పండిన కొద్దిపంటనైనను క్రమమైనపద్ధతిని వాడుకొనకుండుటచేతను, అప్పులపాలగుచున్నారు. వీరికి హెచ్చువడ్డీ కప్పులిచ్చి ధనవంతులు కొలదికాలములోనే లక్షాధికారులగుచున్నారు. ఇట్టి షాహుకార్లే దేశాభివృద్ధికి భంగకరులుగానున్నారు. రైతు తనకు దర్జాకలదనినమ్మి ఆదర్జాను కాపాడుకొనుట కప్పులపాలగుచున్నాడు. కూలివాలి చేసికొనువారు కొలదిలో బ్రతికి ఏఋణఘణములు లేక ఉల్లాసముగానున్నారు; అన్నము వంటపట్టుచున్నది; కంటికి నిద్రవచ్చుచున్నది. ఈపద్ధతినే సాగనిచ్చినయెడల కాలక్రమమున రైతువృత్తి లాభకరముకానిదిగా కావచ్చును. ప్రస్తుతము సర్కారువారు పెట్టించిన గ్రామపరపతి సంఘములనుండి కొద్దివడ్డీ కప్పులుదొరుకు సదుపాయము లిప్పటికంటెను వృద్ధిజేయవలసియున్నది. వేరొండువృత్తి లేకపోవుట:—పల్లెటూళ్లలో సేద్యముచేయుట, సేద్యవృత్తిలో కూలికిపోవుటతప్ప మరియేవృత్తియుజేయరు. ఒకయేడు సేద్యము భంగపెట్టినయెడల రైతులును, వారికుటుంబమువారును, కూలివారును, కమ్మరి, మంగలి, మాదిగ మొదలగువారును, వారికి వెచ్చమునిచ్చు కోమటియు అందరును కూలిపోవలసినదే. అందుచే సేద్యముగాకయు పయోగకరములైనట్టి వృత్తులు కొన్ని స్త్రీపురుషాదులందరును తమ రుచిరమైనవాని నవలంబించుటమంచిది. కోళ్లు గొర్రెలు మొదలగునవి పెంచుట, కుట్టుపని, నూలువడకుట, నులక, డొక్కునారతాడు పేనుట, నవారు వేయుట, తోటలువేయుట మొదలైన వెన్నియో ఉపయోగకరములైనట్టియు, సుఖజీవనమునకు సాయపడునట్టియు వృత్తులనవలంబింపవలెను. స్త్రీపురుషులెవ్వరును, తమకు దర్జాకలదని అనుకొనకూడదు. నిర్వ్యాపారత్వము దర్జాకును, దురభిమానమునకును పుట్టిల్లు.

**సుగుణహీనత:**—సుఖముగా బ్రతుకుటకును, ఏవ్యాపారములోనైనను జయము పొందుటకును వలసిన సుగుణసంపత్తి మన రైతులలో లేదు. అన్యోన్యవైరము, మత్సరము, మోసము, స్వామిద్రోహము యిప్పటివారికి మెండు. క్రమముగా విద్యాభివృద్ధివలన, ప్రబోధమువలన యీదుర్గుణములను దొలగించి వీని స్థానములో నిజాయతి, స్వామిభక్తి, యదార్థవాదిత్వము, సత్యసంధత, పరోపకారపరాయణత్వము, అన్యోన్యసహాయాభిలాష గ్రామస్థులకలవడ జేయవలసియున్నది.

**జూదము, పానము:**—ఇవి దురాచారములు. ద్రవ్యమును కాలమును కూడ హరింపజేయుచున్నవి. ఇదితప్పని రైతులకు తెలియును. తప్పని తెలిసియుంగూడ వీటిని విడువకుండుటకు తగిన ప్రబలకారణము లేవియో యుండియుండవలెను. వాటినరసి తొలగించుటయే గ్రామోద్ధారకుల కర్తవ్యము. దరిద్రము, అపరిశుద్ధత, మూఢత్వము మున్నగువానితో నిండియుండిన గ్రామములలో కాపురముచేయువారి కుల్లాసముండదు. అట్టివారుల్లాసముకొరకు జూదము, పానములను విడిచిపెట్టకున్నారు.

**హీనజాతులు:**—కల్లు త్రాగుటయును దుష్కార్యాచరణమునందు వీరుముఖ్యులు. తప్పత్రాగికై పెక్కుయింటనందరను వీరుపీడిపించుచుండురు. పొట్టకుపూర్తిగా వీరింట నాలుబిడ్డలకు కూడులేదు. ఈవ్యాస

మున చెప్పిన గ్రామపునరుద్ధరణసూత్రము లన్నియు మాలపల్లెలకు, పల్లెవాడలకు, ప్రేవపల్లెలకుఁగూడ ద్విగుణీకృతముగా వర్తించును. కూలినాలిచేసికొను ఈహీనజాతులవారు అనుదినమును తమకు దొరకినదానిలో కొంత మిగిల్చి కల్లుకు పెట్టుటకుబదులు దాచుకొన్నయెడల వీరిస్థితులు మంచికి మారగలవు. ఉదారులైనవారు పూనికొని వీరిపేరట సేవింగ్సుబ్యాంకులను లెక్కలనుస్థాపించి అనుదినము సాయంకాలము వీరికడకువెళ్లి ప్రోత్సహించి వీరిలో నొక్కొక్కనివద్దనుండి పావలా, బేడలేక అణా, చొప్పునవసూలుచేసి వీరిపేరనున్న లెక్కలలో సమాదుచేయించుచుండినయెడ వీరికిని, తదాపి దేశమునకును మహోపకారులగుదురు.

## స్త్రీల బాధ్యత

స్త్రీ శక్తి. పురుషుఁడు సాధనము. స్త్రీపురుషులుకలసినప్పుడే ఒక నిండువ్యక్తి యేర్పడును. స్త్రీలుగాని, పురుషులుగాని ప్రత్యేకముకార్యాచరణమునకు జాలరు. కాన గ్రామపునర్నిర్మాణమునకు పైనచెప్పిన హంశములన్నిటను పురుషులతోబాటు స్త్రీలకుఁగూడ బాధ్యతగలదు. కాని స్త్రీలుమాత్రమే చేయగలట్టి హంశముల నిందు పొందుపర్చడమైనది.

"ఇల్లుజూచి, ఇంటియిల్లాలిని జూడు" మన్నట్లు గృహమున కిల్లాలుపూచీదారు. ఇల్లాలే గృహలక్ష్మి. ఇల్లాలేయింటికిరాణి. ఇంటిసంస్కరణబాధ్యత నూటికి తొంబదితొమ్మిదిపాళ్లు యింటియిల్లాలిపైనే మోపబడియున్నది. ఇంటియాఁడుది విద్యావిహీనయై, మూఢయై వీటికితోడు మూర్ఖత్వముకూడ నలవడియున్నయెడల నాయింటియొక్కయు, ఇంటియజమానియొక్కయు, పిల్లలయొక్కయు ఏబ్రాసితనమునకు మేరయుండదు. ఇట్టి స్త్రీలతోనుండు కాపురమే ఐహికనరకమని చెప్పవచ్చును. స్వర్గమును నరకముగాను, నరకమును స్వర్గముగాను స్త్రీలుచేయగలరని పెద్దలుచెప్పుదురు. ఇంతబాధ్యతగల స్త్రీలకు ఎంతవిజ్ఞానము, ఎంతవిద్వత్తు, ఎంత నైపుణ్యము, ఎంత ఓపిక, ఎంతశాంతము ఉండవలెనో యోచింపుఁడు.

ఇట్టి ఈస్త్రీలకును, ఇప్పటి మనగ్రామమందలి స్త్రీలకు నెంతవ్యత్యాసమున్నదో యోచింపుఁడు. ఆంగ్లేయదొరతనము వచ్చినతర్వాత నిన్నాళ్లకు స్త్రీవిద్య అవసరమని మాత్రమే గ్రహించిరిగాని ఏయేవిద్యలు స్త్రీలకవసరమో ఆయావిద్యలను బాలికలకు గరపించుటకు వలయునదుపాయము లెవ్వియో మనవారూహించలేదు. ఊహించినను పూనుకొనుటలేదు.

స్త్రీలకుగల బాధ్యత లివియవియని చెప్ప శక్యముగాదు. ఎన్ని చెప్పినను తీరవు. మానవుని ఐహికయాత్రయొక్క బాధ్యతయావత్తును స్త్రీయందే లీనమైయున్నదని నమ్ముచున్నారు. ఐనను ఈవ్యాసము మితిమించకుండ కొన్నిటినిందు పేర్కొనుటైనది.

ప్రస్తుతము మన గ్రామములందలి స్త్రీలు మిక్కిలి దుస్థితియందున్నారు. వారిదైనికకృత్యములలో విశేషముకాయకష్టములతో కూడినట్టియు, కొంతవరకు అనవసరమైనట్టియు పనులుకలవు. బిడ్డలుతరచు మరణించుట, బ్రతికినవారైనను, తరుచురోగబాధితులగుట తటస్థమగుచున్నది. గృహయజమాని అలసి అలసి యింటికివచ్చునప్పటికి గృహిణియువిసుగుకొనుచుండును. పిల్లల్లరిచేయుచు, తగవులాడికొనుచు చెప్పినమాటవినరు.

వీటిని తొలగించుటకు స్త్రీవిద్యయే ముఖ్యసాధనము. స్త్రీవిద్యయొక్కటియే దేశోద్ధారణమునకుఁగూడ ముఖ్యసాధనమందురు. పురుషులు ప్రథమమున తల్లిశిక్షలో పెరిగినపిమ్మట భార్యలపొత్తులలో సంచరింతురు. అట్టి ముఖ్యకర్తవ్యములుగల తల్లులు భార్యలు విద్యావతులైయుండిన కాపురములును, దేశములును స్వర్గతుల్యములు. తల్లి బిడ్డలను భక్తులుకలవారిగాచేయవలెను. సద్గుణములను బోధించి అలవాటుచేయవలెను. పితృభక్తి, మాతృభక్తి, సోదరప్రేమ, ఇరుగుపొరుగు పిల్లలయెడ సౌహార్ద్రము, దేశభక్తి, దైవభక్తి, మున్నగు గుణసంపత్తి తల్లియేమొదట నేర్పవలెను. మహాపురుషులెల్లరును మొదట తల్లులశిక్షలలో పెరిగినవారే!

స్త్రీలకు చదువుట, వ్రాయుట, అంకగణితములతోబాటు గృహకృత్యనిర్వహణమును గూడ నేర్పించుచుండవలెను. ఇంటికర్చు కేయేపదార్థము లెంతెంతకావలెనో తమ స్థితిగతుల కనుకూలముగా స్త్రీలేజాబితా వ్రాయవలెను. పాకశాస్త్రము, కుట్టుపనులు, శిశుపోషణము, ప్రథమచికిత్స, శిశుశిక్షణములను గూడ నేర్పించినయెడ నివియన్నియు వారె స్వయముగా గృహములందాచరించుచుందురు. సాధారణముగా స్త్రీలు గూనుగానుందురు. దీనికి బాల్యమునుండియు నిండ్లలో వారలు చేయుచుండిన పశుతుల్యపరిశ్రమలే కారణములు. బాలికలకు తగిన దేహపరిశ్రమ కలవడ జేసినయెడ వారు గూనులేనివారై, పొడవుగ నెదిగి అవయవసౌష్ఠవమును, దేహపటుత్వమును, ఇంద్రియబలిష్టతయు గలవారగుదురు. ఇట్టివారు గృహనిర్వాహకకార్యమును సులభముగా చేయుచు భర్తలకును, పిల్లలకును, ఇరుగుపొరుగువారికిని కూడ సౌఖ్యదాయులగుచున్నారు,

శిశుపోషణము:—పురుషులు చేయలేనట్టియు, స్త్రీలుమాత్రమే చేయగలట్టియుకార్యము శిశుపోషణము. నేటిశిశువులు రేపటిపౌరులగుచున్నారు. వారినైతిక, శారీరక, ఆధ్యాత్మికములు తల్లుల తర్బీదులోనున్నవి. ఇప్పటి పల్లెటూళ్ల బాలబాలికలు కేవలము మూర్ఖులైన తల్లులచేతిలోనున్నారు. అట్టిపిల్లలదుస్థితి వర్ణించుట కిచ్చట తావుచాలదు. పెంటప్రోగులే వారివిహారస్థానములు. ముక్కునచీమిడియు, కండ్లపుసులును వారికి నిత్యాలంకారములు. వీటిపైనెల్లప్పుడు ముసురుచుండు ఈగలే వారిదాదులు. తలంటుట "దివ్వెలకు! దివ్వెలకు." ఇట్టిస్థితిలో స్త్రీవిద్యయే దేశోద్ధారణమునకు ప్రథమకర్తవ్యము.

విద్యావతులగు స్త్రీలున్నతావులలో గాలివీచు వెలుతురుగదులే పురిటిండ్లు. నేర్పరులగు ఉత్తమస్త్రీలే మంత్రసానులు. శిశువులకు క్రమపద్ధతి నాహారాదులుజరుపుదురు. అనుదినము స్నానము, శుచి, శుభ్రతయు, బిడ్డలకు నేర్పుదురు. వారికివలయుదుస్తులను వారే తయారుచేయుదురు. విద్యాలయమందు నేలంటువారే పదిలింతురు. తీరికగలప్పుడు మంచి ఆటలనాడింతురు. పాటలపాడింతురు. వేరేల? బిడ్డలు స్వర్గమందలి బిడ్డలవలె పెరిగి దేహారోగ్యములందును, విద్యాబుద్ధులయందును, క్రమమైన అభివృద్ధిగాంచి పెద్దవారైనప్పుడు ఆయురారోగ్యైశ్వర్యాభివంతులగుదురు.

గ్రామోద్ధరణోద్యోగమునందు విశేషబాధ్యతయు, దక్షతయు నేర్పరియైన పాఠశాలోపాధ్యాయునియందున్నది. ఉపాధ్యాయినిగూడ నట్టిదే. ప్రస్తుతవిద్యావిధానమువలన ఉపయోగములకంటె మనకనర్థములే మెండని చెప్పుచున్నారు. క్రమమైన శిక్షనిచ్చినయెడ మనగ్రామబాలబాలికలు సానకోలదివన్నెకెక్కుమణులు. ఉపాధ్యాయుఁడు సేద్యము మొదలు సకలపరిశ్రమలయందు క్రమశిక్షణబొంది ఆరితేరినవాఁడై యుండవలెను. శిష్యులయెడ సానుభూతియు, వారివృద్ధికి ఆసక్తియు గలవాఁడు కావలెను. అట్టివానిని శిష్యులు తల్లిదండ్రులకంటె నెక్కుడుగ ప్రేమించి గౌరవింతురు. వానిపాఠశాలశిష్యులకు ఆకర్షణీయముగానుండును. పాఠశాలలో ఆటస్థలమును, గ్రంథాలయమునుండవలెను. సంగీతాది లలితకళల గఱపుచుండవలెను. బాలురను బాలికలను తగిన ఆటలనాడించి ఆయాటలలో సత్యసంధత, యదార్థవాదిత్వము, పరశ్రేయసహనము, అన్యోన్యసహాయము మొదలగు మంచిగుణములనునేర్పి వాటికివారలవాటుపడునట్లు చేయవలెను. మహాపురుషుల మహత్కార్యనిర్వహణదక్షతకు వారిబాల్యమునాటి ఆటస్థలమే ఆకుమడియని చెప్పుదురు.

పిల్లలు పెద్దవారైనప్పుడు తమవిద్యలను మరచిపోకుండుటకును, జ్ఞానాభివృద్ధికిని పఠనమందిరములుండవలెను. అచ్చట సకలశాస్త్రములు, పురాణములు, కళలుమున్నగువానినిగూర్చి సులభశైలిని మాతృభాషలలో వ్రాసినగ్రంథములును, దైనికమాసపత్రికలును ఉండవలెను.

ఇన్నివిధముల గ్రామాభివృద్ధికై ప్రయత్నములు జరిగెనేని కొలదికాలములో నేవవి ఆరోగ్యమున కాటపట్టులై, ఐశ్వర్యమునకు నిలయములై సౌఖ్యమునకు తావలములై యుండును. అప్పుడు పల్లెటూళ్లపైని అసూయచే బస్తీలకు పోయినవారును, ఉద్యోగములు చాలించుకొన్నవారలును తిరిగి గ్రామముల కేవత్తురు. వారి అనుభవమును, జ్ఞానమును, ద్రవ్యమును, మరింత గ్రామాభివృద్ధికి సాయపడును. భగవంతుడిందుకు సాయ మొనర్చుగాక!

## సత్యాగ్రహులకు

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

క్షితిలోనవిఖ్యాతిఁజెందిన శ్రీగాంధి
నానతి నౌదలయందుఁదాల్చి
సత్యమూ సమరంబుసాగించి మీరలు
చెఱసాలకేగిన చలువదేమి
బందిఖానలజేరి బలుబాములనుబొంది
శాంతంబుచాటిన శౌర్యమేమి
అసిధారవ్రతమగు నాయహింసాతత్వ
మాచరించినయట్టి యన్నలార!
త్యాగధనులార! ఘనులార! ఆర్యులార!
అతిసురథులార! వీరులౌ ఆంధ్రులార!
శాంతధనులార! విజ్ఞానశౌర్యులార!
వందనశతంబు మీకిదే యందికొనుడు.

రథచోదితుండౌచు రాజిల్లు కేశవున్
మఱపించు శ్రీగాంధి మహిమదలచి
వ్యసనసప్తకమూఁచిపరగెడు ధర్మజు
మఱపించు నాపటేల్ మహిమదలచి
సురరాజసుతునిదౌ సుప్రభావంబును
మఱపించు జహర్వరి మహిమదలచి
వాయుపుత్రకు వీరవరు భీమసేనుని
మఱపించు నాసుభాష్ మహిమదలచి
సేను అన్సారి ప్రభృతుల చేవనెంచి
యుద్ధవిశ్రాంతిగైకొని యుండుఁడయ్య
మఱలరాఁగల సంగ్రామమహితవిజయ
లక్ష్మీకరగ్రహముకొఱకు లక్ష్యముంచి.

## చిత్రప్రశ్న

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

సీ. భరతఖండంబున ప్రవహించు పావనశైవలినీపేరుజేర్చివ్రాయ
నాల్గక్షరంబులెన్నగనాదితుది గల్పిచదువ సమాధికి సరిగనొప్పు
ద్వితియాంత్యములజేర్చ నృతికర్తమూ చిట్టచివరి రెండక్షరాల్ జేర్చివ్రాయ
ధాన్యవిశేషంబు దనరారు గృహలక్ష్మిపత్రికాపరిచయభాగ్యులార!

గీ. తెలిసికొని దీనివివరంబు ధీవిశేష
వృద్ధియగురీతి గృహలక్ష్మి వెలువరింప
సాధ్యమైనంత వేగమే సముచితముగ
నుత్తరంబంపగోరెద నువిదలార!

ఇట్టివానియందు రుచిగల గృహలక్ష్మి పాఠకురాండ్రు ఈ ప్రశ్నకు జవాబు ఆలోచించి మాకు తెలుపుదురుగాక!

—సంపాదకుడు.

# జోలపాటలు

## ౧

(సంపాదకురాలు) శ్రీమతి యన్. వి. సరళాదేవి గారు

౧

జోలజోలలపండు కూరానగలదు
జోడించి తెచ్చేరు అబ్బిమామల్లు.
చిన్నారిపకువకు చిలుకపకువకు
మానవతిపకువకు మామలొచ్చేరు.
జోలలకుఏనుగులు తొండములుచాపు
మాటలకుఅబ్బాయి మరియాలకించు.
చిన్నవాడారారా చంద్రుడారారా
బాలుడారావయ్య బంతిందుకోరా.
మంచిదిఉయ్యాల మాడల్లపరుపు
మహాలక్ష్మిపూవవే అబ్బిఉయ్యాల.

౨

నారాయణాఅనియేటి నారువేసినది
ఆళ్వారుఅనియేటి ఆకువేసినది
ఆళ్వారుఅనియేటి ఆకువేసినది
తిరుమంత్రమనియేటి తీగెపారినది
తిరుమంత్రమనియేటి తీగెపారినది
మహాసత్యమనియేటి పంటపండినది.

౩

శ్రీరంగమెళ్లేటి చిట్టిదాసుడ!
శ్రీరంగమిచ్చటికి ఎంతదూరమ్మ?
శ్రీరంగమిచ్చటికి ఎంతదూరమ్మ?
చిన్నమాఅబ్బాయి కెంతమోహమ్మ?
అదుగదుగుమండపా లాకుతోటల్లు
అల్లదుగో శ్రీరంగం తెల్లగోపురము.

౪

చిన్నమాఅబ్బాయి చెన్నగిరిమొగ్గ
వాచాలకిర్వారం వాడన్నిమల్లె
వాడన్నిమల్లెకు ఊడన్నితోడిమ
రాజంటిఅబ్బాయికి రంభంటిభార్య.

౫

ఉత్తమునిపేరేమి? ఊరుపేరేమి?
ఉత్తమునిగన్నట్టి తండ్రిపేరేమి?
ఉత్తముడురాముడు; ఊరుఅయోధ్య;
తండ్రిదశరథరాజు; తల్లికౌసల్య.

## ౨

(సంపాదకురాలు) శ్రీమతి వెంపటి అన్నపూర్ణమ్మ గారు

చందమామచందమ ఓచందమామ
చందమామకూతురే నీలగిరికన్య
నీలగిరికన్యక్రింద నిత్యమల్లిచెట్టు
నిత్యమల్లిచెట్టుక్రింద జీడిగింజమొలిచె
జీడిగింజతలుపులు నేతియ్యనేర.
నాకంటెచెల్లెలు అతిముగ్ధరాలు
అతిముద్దరాల్చేతిపాలవంకీల్లు
పాలవంకీలుమీద భమిడిపువ్వుల్లు
భమిడిపువ్వులమీద పుంజాయిదండ
పుంజాయిదండపై పువ్వుల్లరవిక
పువ్వుల్లరవికమీద పట్టంచుచీర
పట్టంచుచీరగట్టి ఏవాడబోదు?

కోటిపిల్లిసోమన్న కోడళ్ల మేము
అంతర్వేదినరసన్న అప్పకూతుళ్లం
దాక్షారంభీమన్న మరదళ్ల మేము.

## ౩

(సంపాదకురాలు) శ్రీమతి ఐ వి. శకుంతలగారు

జోఅచ్యుతానంత! జోజో ముకుంద!
రారపరమానంద! రామగోవింద! జోజో.
తొలుత బ్రహ్మాండంబు తొట్లగావించీ
నాలుగూవేదములుగొలుసులమరించీ జోజో.
తొమ్మిదీవాకిండ్ల దిడ్డిలోపలనూ
పట్టవలెఅర్జుర్ని పదిలంబుగానూ జోజో.
కట్టవలెముగ్గుర్ని కదలకుండానూ
వుంచవలెవొక్కర్ని వుచితంబుగానూ జోజో.
వుండవలె పంచువెన్నెలనిండుగానూ
వుంచవలెఒక్కర్నిహృత్కమలమందూ జోజో.

## ౪

(సంపాదకురాలు) శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

వుళీవుళీహాయీ
హాయమ్మబాయమ్మ అక్కచెల్లెండ్లు
చీలెమ్మఎలికమ్మ తోడికోడండ్లు. వు
జోలల్లుబాడితే బాలులకునిద్ర
జోలలకుజొనబువ్వ మాకుమోరిబువ్వ. వు
చిలకల్లుచెలరేగి జీడికొమ్మెక్కు
హంసల్లుచెలరేగి అరటికొమ్మెక్కు. వు
చిలకానివుబోయి చిత్రించిరావే
వానవై కురియవే వరిమళ్లలోను. వు
వరిమళ్లువుణ్ణంగ వనములుణ్ణంగా
వట్టిమిట్టనబోయి కుర్సెవర్షమ్ము. వు
పావురముచెలరేగి పందిళ్లనెక్కూ
అబ్బాయిచెలరేగి మామబుజమెక్కు.
అందరీమామలు చందమామలు
అబ్బాయిమామలు రామకృష్ణులు. వు
చిలకల్లుమాయింటి చెలికత్తెలమ్మా
కోవెలలుమాయింటి కొత్తకోడండ్లు వు
హంసల్లుమాయింటి ఆడపడుచులు
పావురములుమాయింటి పనికత్తెలమ్మా. వు
శ్రీరంగంపోదామ చెడెరోమనము
అందెవ్వరున్నారు అక్కరోమనకు. వు
రంగప్పడేతండ్రి నాంచారుతల్లీ
రంగైనకావేరి నేపుట్నిల్లు. వు
ఇక్కడికిశ్రీరంగ మెంతదూరమ్ము
అడుగడుగుమంటపాలు ఆకుతోటల్లు
అల్లదుగోశ్రీరంగం తెల్లగోపురము. వు
తెల్లగోపురంమీద శేషుడున్నాడు
ఆవెనకపరవాసు దేవుడున్నాడు. వు

## ౫

(సంపాదకురాలు) నాగలింగమ్ సుందరసరోజినీదేవిగారు

పీబూదియీశ్వరుడు జడలశంకరుడు
నందినెక్కినశివుడు మాయింట్లోవిందు
మాయింట్లోభోంచేసి మమ్మదీవించి
వెళ్లాడె యాశివుడు గౌరిమేడలకు.
మామిడీమామిడీ పండుకావలెనా
మదనగోపాలుడు మామకావలెనా

మామగారిండ్లకు పోకుఅబ్బాయి
మామిడీపండ్లన్నీ దాచుకున్నేరు
తాతగారిండ్లకు పోకుఅబ్బాయి
ధనముపెట్టెలన్నీ దాచుకున్నేరు.
చిలుకల్లుచెలరేగి జీడికొమ్మెక్కు
అబ్బాయిచెలరేగి మామబుజమెక్కు
మామబుజమెక్కి ఏమికోరు
పాలుత్రాగేనాకు పాడావులనడుగు
తూర్పునఒకమామ చూడావులతోలె
ఉత్తరానయొకమామ ఉరదాళ్లనంపె
దక్షిణానయొకమామ జన్నిఆవులనంపె
ఈఆవులఆఆవుల మందతోలుకొని
పిండాడె మీనాన్న బిందెల్లనిండ
కాచింది మీఅమ్మ కంకణాలతోటి
త్రాగేకుఅబ్బాయి బొజ్జనిండగను.
అక్కలకుచీరిచ్చి లెక్కలూపెట్టూ
తల్లికిచీరిచ్చి దణ్ణమ్ముపెట్టూ.

తండ్రిమంచివాడు శ్రీవెంకటేశ్వర్లు
తల్లిమంచిదమ్మ అలిమేలుమంగమ్మ
అలిమేలుమంగమ్మ ఆడెన్నపసుపు
అప్పన్నకోనేట తెప్పలయిపారు
అళ్వారులనియేటి అరుగులై నిలుచు
రామలక్ష్మణులవంటి మామలుండగను
రావేకురావేకు చెల్లెమ్మకిపుకు
నిండుపూర్ణిమనాకు చలచందమామ
నిన్నుచూడొచ్చేరు నీమేనమామల్లు.
ఊరికి వుంద్రాళ్లతద్దెవచ్చినది
కొనిపెట్టుఓయమ్మ గోరింటఆకు.
పదివేలుచేసిన్న పమిడిఉయ్యాల
వెయివేలుచేసిన్న వెండిఉయ్యాల
పంధిట్లోపాపయిని ఊగిస్తూనమ్మ
ఊరికిముందర అమ్మవచ్చినది
కొనిపెట్టుఓయమ్మ కాళ్లగజ్జల్లు.

## ౬

(సంపాదకురాలు) శ్రీమతి అక్కరాజు సుబ్బమ్మగారు

౧

శ్రీరామజయరామ శృంగారరామ
చారువిక్రమరామ చంద్రరఘురామ
రాముడామనియేవు రాముడలచేవు
రామేమికావలయు రాఘవులసీత
రాముదై వముసుమ్ము లక్ష్మన్నమరది
భరతశత్రఘ్నులు చిన్నిమరదుల్లు
కౌసల్యపెద్దత్తకైక చిన్నత్త
దశరథుడుతనమామ జనకుడుతండ్రి.

౨

తిరుపతిపోయేటి దివ్యదాసారి
శ్రీవెంకటప్పడికి ఎందరుస్త్రీలు
పెద్దదితులశమ్మ పేరుగలతల్లి
అందరికిపెద్దది అలమేలుమంగ.

౩

కంచికిపోయేటి గాజులశెట్టి
కంచికామాక్షమ్మ ఎవరాడపడ్చు
శివకంచిపలేటి యాశివుడిభార్య
విష్ణుకంచీపలు వరదచెల్లెల్లు.

౪

కాకరకాయలు కరిసెనగపప్పు
గౌరికెంతోప్రేమ కన్నవారిల్లు
చిక్కుడికాయలు సిరిసెనగపప్పు
శివుడికెంతోప్రేమ అత్తవారిల్లు.

౪

చిలకలాడెనమ్మ హంసలాడెను
పావురాళ్లాడేను పందిళ్లలోన
చిలకల్లు చెలరేగి జీడికొమ్మెక్క
అబ్బాయి చెలరేగి మామభుజమెక్క
హంసల్లు చెలరేగి అరటికొమ్మెక్క
అబ్బాయి చెలరేగి అమ్మభుజమెక్క.

౫

చిన్న దివుయ్యాల చిలకల్లపరుపు
శ్రీలక్ష్మివూచవే అబ్బివుయ్యాల
మంచిదివుయ్యాల మల్లెల్లపరుపు
మహాలక్ష్మివూచవే అబ్బివుయ్యాల.

౬

చిట్టకుగుపొట్టడుగు కావలెనని
శివుడుమాకిచ్చెను చిన్నిబాలలను
బాలలకుపాలునెయ్యి కావలెనని
పార్వతితోలంపె పాడిఆవులమంద.

౭

చిన్న మాఅబ్బాయి ఎందాడబోయె?
మామకూతురితోటి బంతాడబోయె.
చిన్ని మాఅబ్బాయి ఎందాడబోయె?
వెండికొండలమీద చెండ్లాడబోయె.
చిన్ని మాఅబ్బాయి ఎందాడబోయె?
పసిడికొండలమీద బంతాడబోయె.

౮

(సంపాదకురాలు) శ్రీమతి పి. రత్నమాలగారు

ఊరికిఉయ్యాల లమ్మవచ్చినవి
కోమరకోమలసీతకు కొనరేఉయ్యాల
యిటువుండిఅటువూచితె ఇంద్రూలాచాయా
అటువుండీఇటువూచితె చంద్రూలచాయా
ఉగ్గుబట్టనొకదాది ఊచానొకదాది
పాలివ్వనొకదాది పాడానొకదాది
మీతండ్రిశ్రీరాము డయోధ్యలోఉండే
మీపిన్నతండ్రి లక్ష్మణుడిక్కడలేడు
ఏడువకూఏడువకూ వైరినాతండ్రీ
యేడు స్తేనిన్నెవ్వరు ఎత్తుకొనువారు?
చిన్న మాఅబ్బాయి చిరునగవుచూచి
సిగ్గుపడిచంద్రుడు సిరవొంచుకొనెను
మరునాడుఅబ్బాయి మాటల్లుచూచి
మరివచ్చెచంద్రూడు మాణిక్యమువలెనూ.

## లతాంగి

ఆకపిల్లి నరసింహాచార్యులుగారు బి.ఎ., (సారస్వతసమాజము)

తీక్ష్ణమౌ గ్రీష్మభానుని తేజగరిమ
వాడిపరుగై తి పక్కటా! పన్నెదరిగి;
అడలఁబోకుమ మేఘోదయంపు దివ్య
శకునములుదోచె భయదగర్జారవంబు
తోడ మృదుదేహవౌ నిన్ను వాడఁజేయు
చర్యలెల్లనునిందించు చందమునను
నీలజలధార్భటులు నింగినిండ భీతి
యావరించుటనో, కోమలాంగివైన
నిన్ను వేచినలజ్జనో, విన్నఁబోయి
చాటుమొగముగఁదిరిగెడుఁ జండకరుఁడు
దేవదేవు కృపావృష్టిఁదేరుకొనుచుఁ
గిసలయవిభూషితాంగివై దెసలఁబ్రాకి
మేలుగనుమమ్మ యికమీఁదనోలతాంగి.

# గద్వాలరాణి ఆదిలక్ష్మమ్మాదేవిగారు

శేషాద్రిరమణకవులు

ఆంధ్రదేశమున గద్వాల సంస్థానమునకున్న పేరుప్రతిష్ఠ లేసంస్థానమునకును లేవు. ఒకయాంధ్రదేశమునందే కాదు. హిందూదేశమునందలి విద్వాంసులందఱకును గద్వాల సంస్థానము బరీక్షాస్థలమనుట యతిశయోక్తి కాఁజాలదు. ఈసంస్థానము నిజామురాజ్యముకంటె మునుమున్నె నెలకొల్పఁబడెను. కాకతీయసామ్రాజ్యము మహోచ్ఛ్రదశయందున్నపుడె ఈసంస్థానము సుస్థిరముగనున్నటుల నూహింపనవకాశములుగలవు. సోమభూపాలుఁడు ఈవంశజులలో విద్వత్కవి. కాణాదము పెద్దనసోమయాజి, రామకృష్ణకవులు, ప్రెగడరాజు నరసయ్య, హరిభట్టు మున్నగు విద్వత్కవు లీసంస్థానము నాశ్రయించి వాఙ్మయసేవ గావించి ధన్యులైరి. ఈరాజవంశజులలోఁ గడపటిపాలకుఁడగు శ్రీమంతుమహారాజా సీతారామభూపాలశేఖరుఁడు పసికందువుల నిరువురు పుత్రికలను అర్ధాంగలక్ష్మినిఁబీడి అకాలమృత్యువువాతఁబడిరి. సంస్థానము నిజాముదొరతనమువారు ఆక్రమించుకొనుటకుఁ గట్టుదిట్టములు చేసికొనిరి. ప్రజల సత్కర్మాందోళనఫలితముగ సంస్థానరాజము కొన్ని కట్టుదిట్టములతో శ్రీరాణీ ఆదిలక్ష్మమ్మ బహదూరు జమీందారిణిగారికి స్వాధీనము గావింపఁబడినది. రాజుగతించిన చింతమఱచి దేశీయులు తదర్ధాంగలక్ష్మియగు శ్రీశ్రీశ్రీ రాణిగారి యభ్యుదయమున నిరీక్షింపసాగిరి.

ఆదిలక్ష్మమ్మరాణిగారు పరిపాలనమునకు వచ్చినవెంటనే తమ పుత్రికారత్నమును దోమకొండ సంస్థానమునకు యువరాజగు శ్రీ శ్రీ శ్రీ సోమేశ్వరరావుబహద్దూరుగారి కొసంగి పరిణయముగావించిరి. ఈయువనృపుఁడు ఆంగ్లయవనసారస్వతములకు బట్టభద్రుఁడు. ఆంధ్రవాఙ్మయమున నిపుడిపుడ పరిచయము గడించుచున్నారు. శ్రీరాణిగారు పుత్రికావివాహమున జూపిన యౌదార్యము వర్ణనాతీతము. అశేషజనమునకుఁ గొన్ని దినములహోరాత్రము లెడతెఱిపిలేక అన్నప్రదానము జరిగినది. గద్వాల సంస్థానమాతరుణమున వివిధప్రదేశములందున్న అశేషవిద్వజ్జనముల కాకరముగనుండెను. రాణిగారి యుదారసాహసములకు మేరలేదు. ఆశుభదినములలో పొగబండ్లు సంస్థానాగతులఁ గొనివచ్చుట కుపయోగపడినవనుట అతిశయోక్తికాఁజాలదు.

శ్రీరాణీగారు కవులనాదరించి వాఙ్మయసేవఁ గావింపఁ బ్రోత్సహించుచున్నారు. సంస్థానమున స్థాపింపఁబడిన గ్రంథాలయమునకు విశేషించి విరాళములఁ బ్రసాదించిరి. హైదరాబాదులోని రెడ్డివిద్యార్థుల వసతిగృహమునకు వేలకొలఁదిధనము దానముచేసిరి. అన్నియును ప్రదానములే. సంస్థానపరిపాలనము నాటిరుద్రమదేవి పరిపాలనమును జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నది. ఈయఖండశేముషీమహిమ, ఈవిద్వజ్జనపక్షపాతము, ఈయౌదార్యము, ఈశాంతిభావము సామాన్యరాజ్ఞీలోకమునందుఁ గనుపింపదని ప్రజలు ప్రశంసించుట మేము పలుమాఱువినియున్నారము.

ఈసంస్థానము నాశ్రయించిన పూర్వకవులు రచించిన గ్రంథరాజములు పెక్కు లముద్రితములుగనున్నవి. సోమనాద్రిప్రముఖులగు నీసంస్థానప్రభువులును బూర్వకవులలోఁ జేరినవారు. తరతరములనుండి సంస్థానమున వేలకొలఁది తాటాకుపుస్తకములు నిలువచేయఁబడియున్నవి. ఈజీర్ణాతిజీర్ణములగు తాళపత్రగ్రంథములనుద్ధరింప శ్రీరాణీగారు బద్ధకంకణులైరని వినుచున్నారము. ఇందు ఒకటిరెండు చిలుపాత్తములు ఈమధ్యముద్రణమైనవి. పూర్వమెన్నఁడో సంస్థానపక్షమున ముద్రింపఁబడియుపుడు ప్రతులు సైతము దొరకుట దుర్లభముగనున్న కామందకము, ముకుందవిలాసము, అధ్యాత్మరామాయణము, యథాశ్లోకాంధ్రీకృతభారతము, రామాయణము, రతిరహస్యము మున్నగు గ్రంథరాజములకుఁ బునర్ముద్రణము లిఖితగ్రంథసముదాయమునందలి బలరామచరిత్రము, ఆదిపురాణము, నృసింహపురాణము మున్నగు ఉత్తమగ్రంథములకుఁ బ్రచురణము జరిగినచో

ఆంధ్రవాఙ్మయమున కెంతయేని మేలుజరుగఁగలదు. శ్రీ శ్రీరాణీగారిదృష్టిలో వాఙ్మయసేవయు నొకటియని వినఁగల్గుట పరమానందకరమగునంశము.

గద్వాలసంస్థానచరిత్రమును శ్రీరాజ్ఞిగారు వ్రాయించుచున్నారు. ఇదిసామాన్యకార్యముకాదు. సంస్థానమునకు సంబంధించిన చరిత్రమింతవఱకెచటను సమగ్రముగలేదు. సంస్థానమునను బరిసరమునను గల వేలకొలఁదిశాసనములు ఇంకను బరిశోధితములు కావలసియున్నది. సంస్థానాధీశ్వరులొందినకృతులు వారలగూర్చిన గేయములు గ్రంథస్థములుకాలేదు. గోలకొండ నవాబులకును గద్వాలప్రభువులకును జరిగిన సంగరములు కర్నూలు నవాబులతో జరిపినయుద్ధములు స్థానికచరిత్రములనుండి సేకరింపవలసియున్నది. శ్రీరాజ్ఞిగారి ప్రయత్నము సఫలమగుటకుఁ బరిశోధకుల సాహాయ్యమెంతయు నవసరము.

గద్వాలసంస్థానము దర్శనీయప్రదేశము. పరిఖ, బురుజులు, కోటగోడలు ప్రాచీననగరనిర్మాణమునకు మార్గదర్శకములుగనున్నవి. సంస్థానమునకు సంబంధించిన అన్నిగ్రామములందును మాన్యక్షేత్రములు విశేషించి కలవు. ఇవిసంస్థానాధీశ్వరుల త్యాగగుణమునకుఁ దార్కాణముగ నేటికిని వ్యవహారమునందున్నవి. ఈ రాజ్యమునందుఁ బెక్కుపుణ్యక్షేత్రములుగలవు. చరిత్రమునకు సంబంధించిన అపూర్వములు, అప్రచురణములు నగుశాసనరాజములు అనేకగ్రామములందుఁగలవు. తగిన సంరక్షణములేకుంటచే దుర్వినియోగమగుచున్నవి. సారస్వతప్రియురాలగు శ్రీరాజ్ఞిగారు శాసనములభద్రపఱచుచు సంస్థానమునను స్థానికులకడను, సంస్థానగ్రామములలోని పౌరులకడనుగల గ్రంథసంచయములతో రాజభవనమున నొకలిఖితగ్రంథాలయము స్థాపించుచోఁ దామారంభించిన గ్రంథప్రచురణశాఖకు ఆంధ్రసారస్వతమునకు గద్వాల సంస్థానచరిత్రమునకు నెంతేని సహాకారికాఁగలదు. ఈవిషయమున శ్రీరాజ్ఞిగారు సంకల్పించినచో అచిరకాలమున మంచిభాండాగార మేర్పడుటయేగాక అనేకాపూర్వగ్రంథములు సమకూర్చునవకాశముకలుగును. ప్రతిసంవత్సరము సారస్వతమునకును లలితకళలకును వేలకొలఁదిధనము వ్యయముచేయు నీసంస్థానపక్షమున జీర్ణగ్రంథరక్షణశాఖనొకదానిని సంస్థానపక్షమునఁగాని విద్వజ్జనుల సత్కరించుట కేర్పఱుపఁబడిన ధనమునుండిగాని నిర్వహించుట శ్రీరాణిగారికి శాశ్వతకీర్తిదాయకము గాఁగలదని మావిశ్వాసము.

రాజ్యవ్యవహారములకువచ్చి స్వల్పకాలమైనను శ్రీ ఆదిలక్ష్మమ్మమహారాణీవారి కీర్తి రాష్ట్రమునను రాష్ట్రేతరప్రాంతములందును సుస్థిరమైనది. సంస్థానము ఆందోళనరహితముగ సౌమ్యముగనున్నది. రాజజామాతయగు శ్రీసోమేశ్వరరావుబహద్దరుగారు రాణిగారికిఁ బరిపాలనమునఁ జేయూఁత నొసంగుచున్నారు. సంస్థానమున భవిష్యద్రాజుగ శ్రీరాణీగారిజ్యేష్ఠపుత్రిక కొకబాలకుఁడుదయించినాఁడు. బాలకుని యభ్యుదయార్థముగ జరుపఁబడు మహోత్సవములకు మేరలేదు. వీనితోఁబాటుగ శ్రీరాజ్ఞిగారు అనలంబనరహితముగానున్న ఆంధ్రసారస్వతమునకుఁగూడఁ గొంతసేవగావింపఁదలంచుట భాషోపాసకుల సుకృతవిశేషమనవచ్చును. శిథిలావస్థలోనున్న గ్రంథసముదాయము నుద్ధరించుటకు శ్రీరాజ్ఞిగారెంత త్వరలోఁ బూనికొనినయంతయు క్షేమము.

ప్రతిసంవత్సరమునను విద్యావినోదములలోఁ బాల్గొను మహాకవుల పద్యరత్నము లీసంస్థానముల లక్షలకొలఁదిగఁగలవు. పూర్వకవులు సంస్థానాధీశులపయి వ్రాసినచాటువులుగూడ నీసంస్థానాధీశ్వరు లెన్నింటినో సేకరించి నిలువజేసిరి. అన్నింటిని సమన్వయించి యాయాకవుల సంగ్రహచరిత్రములతోఁ జాటుపద్యరత్నాకరమువంటి యుత్తమగ్రంథమొకటి ఈసంస్థానపక్షమునఁ బ్రచురించుట వాఙ్మయమున కెంతయేని యుపకారముకాఁగలదు. ఇవియన్నియు సత్పరిపాలనమున ఆంధ్రమహిళాలోకమున సుప్రసిద్ధురాలైన శ్రీశ్రీ గద్వాలసంస్థానమహారాజ్ఞి ఆదిలక్ష్మమ్మదేవిబహదూరువారియవలంబనమున సమకూరుగాకయని యాశించుచున్నారము.

# పల్లెపాటలు

(సంగ్రథితుడు) కొనరాజు రాఘవయ్యచౌదరి గారు

౧

వెండిపళ్లెములోన ఏలకులుబోసి
మెలమదారలంపారునీకుచిన్నన్నా!
వేసంగికాలాన బూాసె బూరగలు
ఆసెపడి చిలకల్లు ఆరునెలలుండు
తినబోతెదూదాయె తీపిలేదాయె
మానవతిచిలకలార! మరలరెభూములకు.

౨

సూర్యుడు యిచ్చినా చుక్కమెట్టెల్లు
సుదతి! నాకాలుచుక్కలై మెరసు
నారాయణిచ్చిన నల్లపూసల్లు
నాతిరో! నామెడ నానై మెరసు
పరమేశుడిచ్చిన పసుపుకుంకంబు
పడతిరో! నానొష్ట పద్మమై మెరసు.

౩

రామన్నపట్టాన రాతి స్తంభాన
రామచిల్కలకెల్ల తూగుటుయ్యాల.

౪

శ్రీలక్ష్మిమహాలక్ష్మి ఒకచోటగూడి
ఎవరునుబొందుదుమని మమ్మెచ్చిఅనుగు
చిన్నంటిపడుకొండ పెద్దన్నునుబొందు
హంసల్లపానుపులు నీకందమైతే
బొటనవ్రేలుంగరము బొడ్డునమాణిక్యం
బొంచేసికూర్చుండ నాతండ్రినిబొందు
ఆసరసగూర్చుండి ఆకుమడిచిచ్చి
అలంకారశ్రీగౌరి నాతల్లినిబొందు.

౫

కాకరకాయకి కాడసన్నమ్మ
కాసిలోభద్రన్నకు కురులుసన్నంబు.

౬

నట్టింటసిరిచాప నామాలపెట్టె
నరసింహాదాసుండు నాకన్నవాడు.

౭

తూరుపిల్లువంక దూలాలువంక
దున్నొచ్చెమాఎడ్లు కొమ్ముల్లువంక
దక్షణపిండ్లువంక దర్వాజవంక
ధర్మరాజన్నయ్య తలపాగవంక.

౮

కొబ్బెరచెట్టుకు వెయ్యరుయ్యాలా
గోపెమ్మమనమల్ని ఊపరుయ్యాలా
మామిడిచెట్టుకు వేయరుయ్యాలా
మాయమ్మమనమల్ని ఊపరుయ్యాలా.

౯

వెంకటేశ్వరుడి పెండ్లిండ్లనాడు
వేల్పులుబట్టింత్రు వెండిసురటీలు
అక్కనాతమ్మయ్య పెండ్లిండ్లనాడు
పరువుకుబట్టించు పమిడిసురటీలు.

౧౦

కోటయ్య! నీవంటి కొమాళ్లనిస్తే
కోటిప్రభలతోటి కొండనెక్కేము.
అప్పన్నపెళ్లాము అలివేలుమంగా
ఆవుపేడబెట్టి అరుగులలికింది
గోవుపేడబెట్టి గోడలలికింది.

౧౧

చిక్కుడుగాయల్లు సిరిభూషణంబు
చిలుకలొడ్డాణమ్ము చిన్నప్పనడుము
కాకరగాయల కరిభూషణంబు
గంటలొడ్డాణమ్ము పెద్దప్పనడుము.

౧౨
కలగంటిమాంచాల కలగంటిబాల
కలలోనకలగనికలమేలుకొంటి.

౧౩
నాతండ్రిసిరిజూచి రాజకళజూచి
రాజులంపినారు నిలువుటద్దాలు.

౧౪
చచ్చిపోయిమాతాత స్వర్గానవుంటె
గోవుదానముజేసు కొడుకునాతండ్రి.

౧౫
పున్నె మొకొందరిది పూజకొందరిది
పుని స్త్రీజన్మాన చావుకొందరిది
భాగ్యమ్మొకొందరిది బలముకొందరిది
బాలప్రాయమునాకు పెండ్లికొందరిది.

౧౬
కాటికచుక్కబొట్టు కడిగితేబోను
నొష్టరాసినవ్రాలు తుడిచినాబోదు.

౧౭
అరునెల్లాబాల అడ్డవడిగట్టి
ఆయెనెసీతమ్మ అడవులకుపయనమ్మ
ఎట్లుంటావుసీతమ్మ నట్టడవిలోన?
నామరదిలక్ష్మయ్య లంకలేలంగ
నాకేమిభయమమ్మ నట్టడవిలోన.

౧౮
ఏటొడ్డుపుచ్చల్లు యెర్రతుమ్మల్లు
యెలమంచితమ్మపూడి గంగపుట్లల్లు
పాటొడ్డుపుచ్చల్లు పంకుడోసల్లు
పంపాద్రిదనుకొండ పాపపుట్లల్లు.

౧౯
అల్లనేరెడుపండ్లు పళ్ళెనబోసి
అంపిస్తి ముత్తిపిల్లయ్యగురువులకు.
యింతచక్కనిపళ్లు యెవరంపినారు?
నీశిష్యకూతురు వైదేహిసీత.

౨౦
మూణ్ణాల్లబులుపులకు మురిసేవు భ్రమసేవు
ముందుగతిగానవె చిలుకా!
అరుపటములలోన హంసమేడల్లోన
ఆటలాడే రామచిలుకా!
ఆటలేలామనకు పాటలేలామనకు
మాటచెల్పు రామచిలుకా!
తొమ్మిదీవాకిళ్లు యీతోలుకోటలకు
దిమ్మదిరుగు రామచిలుకా!
తలుపుదీసెపిల్లి పొంచువేస్తున్నది
తప్పించుకో రామచిలకా!

౨౧
వడ్లల్లొవరిపొట్టు కలపకే తల్లి!
వంశాననీకడుపు వర్ధిల్లవలెను
పాలల్లొపంచదార గలపకే తల్లి!
భాగ్యాననీకడుపు ఫలమందవలెను.

౨౨
నాతోడబుట్టిన నలుగురన్నలకు
చదువులెవరే తల్లి! చెప్పినావారు?
నీళ్లల్లొబుట్టిన నీరుకాకులకు
నీతులెవరేతల్లి! తెలిపినావారు?
అడవిలోబుట్టిన్న లేడిపిల్లలకు
నడుములెవరే తల్లి! దిద్దినవారు?

౨౩
బుక్కాయపెట్టెలకు ఉక్కుతాళాలు
భూములేలేవారు నాకన్నవారు.

౨౪
చిన్ననాడన్నయ్య చిరుమొగముజూచి
సిగ్గుపడిచంద్రుడు పొడువజాలండు.

౨౫
వయ్యారమెందుకే ఓసత్యభామా!
వద్దకృష్ణుడులేని వయ్యారమేలా?
చక్కదనమెందుకే ఓసత్యభామా!
చంకబాలుడులేని చక్కదనమేలా?

౨౬
గోపాలకృష్ణమ్మ యెవ్వరల్లుండు?
గోవులుగాచేటి గొల్లలల్లుండు.
అక్కనాతమ్మయ్య యెవ్వరల్లుండు?
మండలముయేలేటి మామలల్లుండు.

౨౭
మానికెల్లనిండా మాడలు బోసికొని
మానవతిపుట్టిల్లు నేజెయ్యబోదు.

౨౮
ముంగటకలరోలు ముత్యాలవాయి
ముత్యాలవాయిబోసి ముమ్మయనిబాడు
వాకిటగలరోలు వజ్రాలవాయి
వజ్రాలవాయిబోసి వల్లభులబాడు
పందిట్లోగలరోలు పగడాలవాయి
పగడాలవాయిబోసి భర్తతోబాడు.

౨౯
సీతమ్మచేరబోయె ఓలక్ష్మయ్య!
చిత్రకూటాలన్ని చిన్నబోయినవి
రత్నకూటాలన్ని రవధూళిగమ్మె.

౩౦
అమ్మతమ్ముల్లార! అతిభోగులార!
అమ్ముండువాడలకు తమ్ములై రండి
మేముండవాడలకు మామలై రండి.

౩౧
నాచేతిరోకళ్లు నల్లరోకళ్లు
చేయించుపెద్దన్న చేవరోకళ్లు.

౩౨
అంపించుఅన్నయ్య అప్పవాడలకు
చిలకలాడేఅమ్మ హంసలాడెను
పావరాలప్పయ్య అనుపందిళ్ల
అప్పన్నపెళ్లాముండవలయును.

౩౩
మాయమ్మమాతల్లి నీవుబుట్టబట్టి
మదనగోపాలుండు మాకల్లుడయ్యె.

౩౪
అల్లమ్మ అరవై కూరలనుమోలు
అల్లుడు నెల్లూరుచౌదరినిమోలు.

౩౫
పనిజేసిజయలక్ష్మి పవ్వళింపంగ
పరమేశుడన్నయ్య పలుకుతూలేపు
పువ్వల్లుబుక్కాయ చల్లుతూలేపు
దసరపట్టుశాల్వ విసరుతూలేపు.

౩౬
ఇల్లలికిముగ్గట్టి యింతపనిజేసి
ఈయింటియిల్లాలు యెందుబోయినది?
పదినెలతోవడ్లయిన దంచబోయిందా?
అన్నలతోపాలై నా పంచబోయిందా?

౩౭
యత్తమ్మలొడ్డు మాకుపాలొచ్చినివ్వ (?)
విక్రమార్కుండన్న విందొచ్చినాడు
కోమటింటిచ్చంబు గొల్లింటిపెరుగు
మాయింటిభోజనము విందుఅన్నయ్యకు
కోమటివీథొకటి గొల్లవీథొకటి
రానుపోనన్నలకు రాజవీథొకటి.

౩౮
అలికిపూసినయిల్లు ముగ్గుల్లుగోరు
అక్కమనపనమటిల్లరివేణిగోరు

చీకటియిల్లయిన దీపములగోరు
శ్రీపట్టిమంచాలు అల్లుండ్లగోరు.

౩౯

అందలమ్మెవ్వారు మందిలోజూతు
ఆవపువ్వులమరది అర్ధచేతజూతు
గుఱ్ఱంబుయేవ్వారు గుంపులోజూతు
గుత్తిపువ్వులమరది గుప్పిటజూతు
గంధంబుఅక్షతలు గన్నేరుపూలు
ఘనుడమ్మమామరది కృష్ణరావెపుడు.

౪౦

ఆకుతోటల్లోయి ఉకుదూలాలు
దండిగలకన్నారి ద్వారబంధాలు
ద్వారబంధాలేవి? దోలీలుయేవి?
ద్వారబంధముకాడ దాగిందివదిన
ద్వారబంధముకాడ వంగున్నవదిన
ధర్మరాజన్నయ్యవై దొలగవమ్మ.

౪౧

చెల్లెలా! చెల్లెలా! నీకొక్కబుద్ధి
మల్లెల్లోమరదిని మెదురాడకమ్మ.
రాతిరికట్టింది రవపట్టుచీరె
చెంగేలమాసింది చెల్లెలా! నీకు?

౪౨

శ్రీరాములల్లుండ! సీతలల్లూడా!
మండలాలేలేటి మామలల్లుండా!
చిటికనే విల్ విరచి సీతనుపెండ్లాడి
ఒక్కమాఅబ్బాయి యెంతదొడ్డాడు
రావిమాన్ విల్లిరిచి రంభనుపెండ్లాడి.
ఏమామయిచ్చెనో కన్యదానంబు?
ఈమామయిచ్చెను కన్యదానంబు.
ఎఱ్ఱన్నిచిన్నాడు మెదురేనిగెక్కు.
ఏయుత్తగడుగున్ను ముద్దుపాదమ్ము
మెంతిజీలకఱ్ఱ మేలిమిముద్ద
పచ్చజీలకఱ్ఱ అచ్చుబెల్లమ్ము
కలవారిఅల్లుడుకు కంతదినుసులు.

౪౩

చీకటికి చింతలు లేతమామిళ్లు
కలకోటివృక్షాలు గన్నేకలలు
చుట్టూరనిమ్మల్లు దూదిపనసల్లు
చూచితివే సీతమ్మ! రావణునిలంక
పాపకారిలంక పాదంబెట్టరుగ
దోసకారిలంక దోవనేనెరుగ
అన్యకారిలంక అడుగుబెట్టరుగ.

౪౪

చింతచెట్టు చిగురుజూడు
వాలుగొమ్మల వగరుజూడు
అన్నపంచెల తొగరుజూడు
వదినెకెక్కిన పొగరుజూడు.

౪౫

చింతపువ్వు చింతపువ్వురాలంగ
జల్లేడుతుప్పలు గొట్టంగ
దండుబో దండుబో నామరది
దండలుదెచ్చే నామరది.

౪౬

రామన్నఉయ్యాల రాతిఉయ్యాలో
రామచిల్కలకెల్ల తూగుటుయ్యాలో
రామన్నపేటలో రద్దేమిరద్ది?
మానవతిసీతమ్మ మాటలేరద్ది.

౪౭

పూరివారేసిన బొడ్డుచావిట్లో
అలిగిపండుకొనేవు యేమిపెదవదినె!
వెయ్యివేలుజేసు వెండినాకడెము
వేశ్యలకుయిచ్చెనే వెఱ్ఱి నీయన్న











## పూజ

**శ్రీమతి శ్రీపాద శారదా దేవిగారు**

యామినీ! పూర్ణకర్పూరహారలతలు
శారదాదేవికిదిగో హస్తములుసాచి
సత్యవాక్పరిపాలనసమయమందు
లలితముగనిచ్చుచున్నారు లలనలిచట.













'రత్నాలు చెక్కిన రవ్వల్ల పండు'

*Photo by Messrs M. Doss & Bros.*



చిన్ననాటి ప్రేమ

*Photo by Mr. D. Annaji Rao, Madras.*

చాలకుంటే బన్నసరములిచ్చేను
చదివినయన్నల్ని చాపించబోకు
గుళ్లపేరిచ్చేను గుట్టుజెప్పాకు
పట్టెడాయిచ్చేను బయలుబోంగాకే.

౪౮

అప్ప! నీకాపురము చెప్పతీరదె
యేవైపుజూచిన యెలుకరాసుల్లె
అప్పయ్యదుప్పట్లు అడివికంబళ్లు
చెంచీతకోకల్లు పారుటాకుల్లు
కట్టమీదా రెంపుకరివేపచెట్లు
కానవచ్చేకన్నారి కంచుదివిటీలు
వల్లకాడుదవ్వించి వాడగట్టించి
వచ్చిరమ్మకన్నారి వంశపాలకులు.

౪౯

చందోలుశెట్టింట పెండ్లిగామాలు
చెంపకొప్పాలువారు శెట్టికోడండ్లు.
వల్లుట్లవారియింట పెండ్లిగామాలు
అడ్డకొప్పాలవారు అయ్యకోడండ్లు.

౫౦

పంటచేనుబాలిట్టె అన్నయ్యవస్తే
పంటభాగ్యపునీళ్లు ప్రజలుమెచ్చుకొని.

౫౧

కస్తూరిగంధంబు అక్కనీమరది
మంచిగంధముతోటి మాసిందిచెరుగు
లక్షణంబులకల్ల రారయ్యమరది
నిక్షేపచెల్లెంద్ర నీకిచ్చినామయ్య.

౫౨

ఆకలై నాకడుపు అల్లాడుతుంటె
తల్లెనకపినతల్లి రాదుమావాడ;
తలమాసినాకురులు తల్లడిల్లంగ
తండ్రెనకమేనత్త రాదుమావాడ.

౫౩

ఊరికిఉత్తరాన చేనుపడమర
చేవదేలున్నదీ చెంచల్లిమాను
కొట్టేవారులేక కొండలకుబెరిగె
పల్లుట్లఅన్నయ్య గొడ్డలెత్తితె
భూతల్లించిమాను భూమికొరిగింది.
తల్లడిల్లిమాను ధరణికొరిగింది
బ్రాహ్మలుజెక్కించు పెండ్లిపీటలకు
రాజులుజెక్కించు రచ్చబండలకు
కోమట్లుజెక్కించు క్రొత్తపోలలకు
అన్నయ్యజెక్కించు బరిణెసాలలకు
ఆబరిణెఎత్తుకెళ్లి కంసలింటిస్తే
గుంటూరుబంపించి గుబ్బవేయించి
బందరుబంపించి బాగుజేయించి
చిలుకూరుబంపించి చీలవేయించి
అడ్డెగెత్తుబంగార మానవాలేసి
అంగళ్లకుంకమ్మ అమ్మవచ్చింది
కొంగుమాడలనిచ్చి కొనరెకుంకంబు.
ప్రొద్దున్నెఅప్పికట్ల పొయ్యేటివారు
యీబరిణెలక్ష్మికి యివ్వంశీమీరు
యి స్తేనుయిచ్చేము యిల్లెరుగమమ్మా
తిరిగిపోతేవారిల్లు తిరుమల్లెసారె
మరలిపోతేవారిల్లు మరిమంచిసాల
వాకిట్లోగలరోలు వజ్రాలవాయి
పట్టుచీరెలవారు బావకూతుళ్లు
అంచుచీరెలవారు ఆడబిడ్డల్లు
తోపుచీరెలవారు తోడికోడండ్రు
అందుట్లొమాలక్ష్మి చెరగుచీరలది.
దబ్బునమాలక్ష్మి బరిణందుకొమ్మ;
యింతచక్కనిబరిణె యెవరంపినారు?
నీకనివల్లుట్ల అన్నంపినాడు.

# స్వయంప్రభ

శ్రీమతి సీరము సుభద్రయాంబగారు

చ. చవి కనిరక్కుఫల్ బహువి
  శాలతరంబగు శైలకందరం,
బనుమ మాధురీయుత జ
  లాంచిత భవ్యఘనీపమేతముల్,
ఘనతరుజాలబంధురము,
  కౌతుకదాయకవస్తుయుక్తముల్,
వనమృగపక్షిసంకులము
  భాసురదివ్యవిభాభిరామముల్.

వ. అందు,

ఉ. ఆతతశీతవాతజని
  తాధికబాధసహించుచున్ మహా
ప్రీతిని జాతివైరములు
  వీడి మృగావళి చెంతఁ గ్రుమ్మరం,
జేతము నిర్వికల్పగతిఁ
  జేసి సమాధివిలీనచిత్తయై,
పోఁతపసిండివిగ్రహము
  పోలికనున్న తపస్వినీమణిన్.

క. కనుఁగొని పావనిమనమున
ఘనమగు నద్భుతము గదురఁగా వచటికి జ
ల్లన నరిగి, యత్తపస్విని
కనులు తెఱవ వినయమొప్పఁగా నిట్లనియెన్.

ఉ. "ఈగహనస్థలంబున మ
  హీధరదివ్యగుహాంతరంబునన్
భోగములం ద్యజించి కడుఁ
  బూనిక నెయ్యది కోరినిష్ఠతో
యోగిని, యోగవిరాగిణీ, మ
  హోగ్రతపంబొనరించుచుంటివో?
నీగతిఁ గాంచనద్భుతము;
  నీ వెటులొంటిఁ జరింతువమ్మరో?

చ. పరమపవిత్ర మీగుహయె,
  పావనమై తనరారుచున్న నీ
చరణరజంబు సోఁకుటను;
  సంతత మారలు గ్రుంకుచుంట, నీ
ఝరియె మహాపవిత్రమయి
  సర్వనదంబుల వన్నెకెక్కు; నీ
తరువులె తీయపండ్లొసఁగి,
  తాపక సేవలఁ బావనంబులౌ.

చ. ఫలములు కందమూలములు
  భక్ష్యములై తగఁ, దృష్ణఁ బాపఁగా
జలములు, పాన్పుగాఁగ ధర,
  చారుశరీరముఁ గప్ప నారలున్,
నిలయముగాఁగ గందరము,
  నిత్యతపంబు మహాధనంబుగాఁ,
గలిగి సుఖించుచుంటివి జ
  గంబుల నేలెడి రాజ్ఞికైవడిన్.

ఉ. వాడదు మేను సుంతయును;
  వన్నె తొలంగదు మోము, తేజమున్
జూడఁదరంబుకాదు; కడుఁ
  జోద్యము! సౌఖ్యము గ్రుక్కలేక యీ
జాడఁ దపోవ్రతక్రియలు
  సల్పినవారలు గావరారు పూఁ
బోఁడులలోన, నీగతి య
  పూర్వమహత్త్వ మెటుల్ లభించెనో?

చ. కనవినరాని యట్టియది
  కంబగు ఘోరతపంబుఁ జేయుచున్,
ఘనతరనిష్ఠ చేఁదనువు
  గాసిలఁజేయుట యేమికోరి? సి
ద్ధినిగని యష్టసిద్ధులను
  దీక్ష మెయింగనఁగోరియో? మహా
మునిహితరాజయోగమున
  ముక్తికినిధానముఁ గాంచఁగోరియో?

మ. అని దేవత్వము, ఖేచరీత్వమును నీ
  యతుల్ కడుం దెల్పెడిన్;
తనువుంజూడఁగ మానుషీత్వము నె య
  త్యంతంబునుం జాటెడున్;
కనదత్యంతమనోజ్ఞ తాపకతనూ

కాంతుల్ దిశల్ గ్రమ్మ; నే
మనవచ్చునే నినుఁగూర్చి? యెవ్వతెవు? లో
కాతీతదివ్యప్రభా!

ఆ. నిరుపమానపుణ్య, నీచరిత్రప్రభా
ప్రకటనమున మాదు పాపతమముఁ
బాయఁజేసి కార్యఫలము చేకూర్చి,
పంపవమ్మ, బిలము పైకి మమ్ము.”

క. అని వచియింపఁగ, నమ్మా
నిని యిట్లనిపలికె వాంజనేయునితో; “నో
యనిలసుత, మేరుసావ
ర్ణినందన, స్వయంప్రభయన నెగడినదానన్.

క. అనిమిషపతి దైత్యులతో
నని మున్నొనరించువేళ, నతిరయమెసఁగం
దనవజ్ర మెత్తివేయుడు
ఘనఘట్టన నిమ్నగమునఁ గందరమయ్యెన్.

ఆ. భూతవాతముగాఁగ భూరిమనోజ్ఞత
వివిధశిల్పవేది, విశ్వకర్మ
దీనిఁదానొనర్ప దేవదానవులకుం
జోర నశక్యమగుచు బరగెనిద్ది.

క. అనుపమమాయామయుఁడగు
ఘనుఁడు, మయుఁడు, దైత్యవిశ్వకర్మ, కళాక
ల్పనమున సృజించెనిందున్
ఘనరత్నస్థగితదివ్యకాంచనగృహముల్.

క. పెక్కేండ్లు దీనిఁగోరుచు
నక్కజమగు తపమొనర్చెనమ్మయుఁ; డట్లే
యిక్కందరమును గొమ్మని
యక్కమలాసనుఁడొసంగె నాతనికిదయన్.

క. హేమాభిధానయగు సుర
కామినితో నిందుమ్మతిని గడిమిఁగెలిచి, తా
నామయుఁడే బహుకాలము
కామసుఖాత్ముఁడయియుండఁగా నటుమీఁదన్.

క. అదిత్యేశుఁడదిగని,
యాది దివిజశిల్పిఁజంప, నటుపిమ్మట నా
కాధిపతసతి హేమయు
సాదరమున దీనినొసంగె, సఖినాకగుటన్.

చ. తపమొనరించుచుందునిటఁ
దాల్మినినొందక చింతదక్కి; యి
ట్లపరిమితాబ్దముల్ చనియె;
నన్యులకుంజొరరాదు దీని; నె
ట్టిపగిదిఁగంటిరో తెలుపుఁ
డీ తొలుతన్; మఱిమీర లెవ్వరో
కపివరులార, యేమిపని
గా నిటువచ్చితిరో వచింపుడీ.”

చ. అనుటయు, “రామదూతల; మ
హంకృతితోడను దర్పితీమణిన్
దనుజవిభుండు రావణుఁడు
తాపసవేషముఁబూని మాయచే
జనపతికన్యఁ బ్రాభి పెలు
చం గొనిపోయెను మేము సీతకై
వనములఁ బర్వతంబులను
వారకరోయుచుఁ గంటిమీగుహన్.

ఉ. శ్రీమహనీయమూర్తి, సుర
సేవ్యుఁడు, లోకవిభుండు, నారఘు
స్వామి సుహామహత్వమునఁ
బావనమూర్తి, త్వదీయదర్శన
శ్రీ మముఁబొందెఁ; దీఱునిఁకఁ
జింతలు; తప్ప కభీష్టసిద్ధియౌ;
మేము బిలంబు దాటుటెటు?
మిక్కిలిమక్కువఁ దెల్పవే” యనన్.

ఉ. “వానరులార, యీబిలము
ద్వారముఁజొచ్చినవారు క్రమ్మఱన్
బ్రాణముతోఁ బైఁబడరు,
ప్రాప్తమదీయతపోమహత్వతన్
భూనుతరామకార్యధర
పూజ్యులమిమ్ము సుహోవిముక్తులన్
గానొనరింతు నొక్కపరి
కన్నులువిప్పకయుండుఁడీ” యనన్.

ఆ. కపులుకనులు మూయ ఘనయోగశక్తి మ
హత్వమునను జేసి యత్తపస్వి
నిరొ వెడల్చెఁ; గపులు బయటికి వెడలిరి
తల్లికడుపునుండి పిల్లలట్లు.

ఆ. రామరామ యంచు రామనామస్మర
ణంబు సేమరక యొనర్చుచుఁ బదఁ
పడి స్వయంప్రభాప్రభావంబుఁ బొగడుచు
హనుమదాదికపులు చనిరి తరలి,

# అపుత్రస్యగతిర్నాస్తి

—తాత కృష్ణమూర్తిగారు బి.యె., యల్.టి.

వెంకోబరావుపంతులు చాలా సరదామనిషి. అతనికల్లా ఒక్కటే దుర్వ్యసనం ఉండేది. విధివిరామం లేకుండా చుట్టలుకాల్చేవాడు. కాని కొన్నాళ్లకు పెళ్లాంపోరు పడలేక ఆమెకు వాగ్దానంచేసినాడు 'పొగ చుట్టలుమరికాల్చను!' అని.

చుట్ట, పొడుం, నల్లమందు—ఇట్లాంటివ్యసనాలు అభ్యాసంకాకనే పోవాలి. ఒకమాటు వాటికి అలవాటుపడితే ఇకపూర్తిగా వదలించుకోవడమనేది సాధారణంగా......అసాధ్యం.

వెంకోబరావుపంతులును వెయ్యికళ్లతో కనిపెడుతూ ఉండేది ఆయనభార్య. "ప్రమాణంచేసిన పెద్దమనిషికదా, మాటతిరుగుతారా?" అని భర్తనునమ్మి ఊరుకునే యిల్లాలుకాదు ఆమె. ఇంట్లో మారుమూలలన్నీ వెదికి యెక్కడెక్కడవున్న పొగాకుముక్కలు సంగ్రహించి పెనిమిటి కవిచిక్కకుండాచేసేది.

భార్యకులొంగినట్టే ఉండేవాడుకాని పంతులు నేర్పుతో ఆమెను మోసంచేయడం ప్రారంభించినాడు. సర్కారుద్యోగి అనిచెప్పి మాటికీచీటికీ కమాను బయలుదేరేవాడు—పెళ్లాం కంటమాత్రం పడకుండా వుంటే యెన్నిచుట్టలుకాల్చినా అడిగేవారులేరుకదా అని ధైర్యం. సద్యోగ్యంలో ఉన్నప్పుడు కొబరిలంక పొగాకు వీశెలకువీశెలు సంపాదించి చుట్టలుచుట్టించి భద్రంగా దాచుకునేవాడు ఆఫీసుపెట్టెలో. ఒకసారి గ్రహచారవశాత్తూ పెట్లోచుట్టలకట్టలు ఉన్నసంగతి భార్యకుతెలిసింది. "ఎక్కడివీ చుట్టలు?" అని ఆమె నిలవదీసేసరికి పంతులుముఖం వెలవెలబోయింది. క్షణం ఆలోచించి చిన్నచిరునవ్వుతో "చుట్టలుకాల్చడం మానుకున్నా నాప్రారబ్ధంచేత వాటినిసంగ్రహించి మోసుకొనిరావడం తప్పలేదు. ఈఅధికార్ల వ్యసనాలు కనిపెట్టి యెవడికియేది మక్కువయితే అదిజాగ్రత్తపరచి వాడికి సమర్పించాలి. క్రిందటియేడు బ్రాందీబుడ్లు సప్లయి చేసేసరికి యిల్లుగుల్లయింది. ఇప్పుడువచ్చిన ఆఫీసరు కొంతనయమేఅనుకో. కొబరిచుట్టలతో తృప్తి పొందుతాడు. ఎంతో శ్రమపడి యీచుట్టలన్నీచుట్టించినాను. రేపుప్రొద్దున్నే బంట్రోతుచేత పట్టించుకొని బంగాళాకు పోవాలి." అని సమాధానంచెప్పినాడు.

పాపం ఆమె నమ్మకున్నది. పంతులు తనలోనవ్వుకున్నాడు. వెనుకటివలెకాక చుట్టలిప్పుడు రహస్యంగాకాల్చవలసి వచ్చినందున యీపాడువ్యసనం కొంతతగ్గివుంటుందని అనుకోకూడదు. పూర్వంకన్న అధికంగాకాల్చేవాడు. దొంగతనంగాచేసే వ్యసనాలకు తృప్తిఅనేది కొంఅరి!

పంతులుపూర్వం యిల్లుదాటి యెక్కడికీ వెళ్లేవాడుకాడు. ఇప్పుడు యింట్లోస్థిరంగా ఒకగంట నిలవడంఅరుదు. స్నేహితులయిండ్లలోను క్లబ్బులోను షికారుస్థలాల్లోను—యెక్కడో చుట్టకు అటంకంలేనిచోట కాలం వెళ్లబుచ్చేవాడు. కొత్తగా తమలపాకులు కూడా తరుచుగా నమలడం అలవాటు చేసుకున్నాడు చుట్టకంపుకప్పి పుచ్చడానికి. చుట్టలకు బదులు పాపం కిల్లీలతో తృప్తిపొందుతున్నాడు కదా అని భార్య సంతోషించింది. క్రమంగా ఖారాకిల్లీలు ప్రారంభించినాడు. పెళ్లాం అభ్యంతరపెట్టలేదు. బజారు మసాలా యింపుగాలేదనిచెప్పి, బరంపురంనుంచి సుబుద్ధిమసాలా తెప్పించేవాడు. కిల్లీ సామగ్రియావత్తూ యింట్లోనే జతపరచి ఖారాకిల్లీలు చుట్టడం.భార్యకు నేర్పినాడు. పెళ్లాం చూస్తూవున్నప్పుడు కిల్లీ, ఆమె చూడనప్పుడు చుట్ట యీవిధంగా కిల్లీమీదచుట్ట, చుట్టమీదకిల్లీ, ఒక్కొక్కప్పుడు కిల్లీనములుతూనే చుట్ట—ఈవిధంగా కొన్నాళ్లు గడిపినాడు.

ఒకనాడు చాకలిదానికి బట్టలువేస్తూవున్నప్పుడు పంతులుజేబులో పొందికగా మడతపెట్టివున్న పొగాకుకట్ట దొరికింది అతనిభార్యకు. భర్తవీధిలోనుంచి యింటికిరాగానే అడిగింది: "ఏమండీ మళ్లీ చుట్టలు ప్రారంభించినారూ? మీకోటుజేబులో పొగాకుకట్ట దొరికిందినాకు. దొంగతనంగా చుట్టలుచుట్టుకొని కాలుస్తున్నారా యేమిటి?"

నవ్వుతూ పంతులు "అబ్బే లేదు. డబ్బాలో మసాలాఅయిపోయింది. రావలసినబంగీ యింకా బరంపురంనుంచి రాలేదు. ఊళ్లోవున్న రెండుమూడురోజులకు సరిపోయే మసాలా, బజారులో కొనుక్కున్నకంటె మనమే తయారు చేసుకోకూడదా అనుకున్నాను. కొట్లమీద దొరికే ఖారామసాలా కలగాపులగంగా వుంటుంది. రేపుప్రొద్దున్న ఆపొగాకు యెండలోపెట్టినలిపి గుండచెయ్యాలి. చుట్టలకైతే యీపొగాకు పనికి వస్తుందా? అదిగాక యీకాస్తపొగాకు చుట్టలకేం సరిపోతుంది? దీనిని నోటిపొగాకంటారు. కేవలం మసాలా చేసుకుందుకు తప్ప మరిదేనికీ పనికిరాదు. నీధర్మమా అని నాకిప్పుడు చుట్టమీదికి మనసుపోవడం లేదు. కొత్తరికం కొంచెం కష్టంగా ఉండేది. కాని యిప్పుడుచుట్టమీద యేమీకోరిక లేదు. చుట్టలు కాల్చమని నువ్విప్పుడు బ్రతిమాలినా కాల్చను." అన్నాడు.

మాటనిలబెట్టుకుందుకు పంతులు మర్నాడు ధనియాలు, సోపు, గసగసాలు అన్నీ తెప్పించి అవిభార్యను మూకుట్లోవేచమని ఆమెకళ్లయెదుట పొగాకంతానలిపి గుండచేసి ఖారామసాలా తయారుచేసినాడు.

మరికొన్నాళ్లకు యింట్లో మళ్లీ పోరుప్రారంభించింది. పొగాకు యేరూపంలోను కూడా వాడరాదని పంతులుభార్య నిర్బంధించింది. తాంబూలానికిమాత్రం ఆమె అభ్యంతరం చెప్పలేదు. కాని ఖారాకిళ్లీ, చుట్ట—ఈరెండింటికీకూడా ఆమె వొప్పుకోలేదు. విధిలేక సరేనన్నాడు పంతులు.

అదిమొదలు బహుజాగ్రత్తగా అతిరహస్యంగా కాల్చుకునేవాడు చుట్టలు. ఇంట్లోయెక్కడాపొగాకు ముక్కగాని చుట్టకాని భార్యకంటపడకుండా జాగ్రత్తపడేవాడు పంతులు.

కాని 'ప్రమాదో ధీమతామపి' అన్నారుపెద్దలు. ఎంతకట్టుదిట్టంమీద కథనడిపిస్తూవున్నా ఒక్కొక్కప్పుడు చిక్కులలో పడుతూవుండేవాడాయన. ఒకనాడు దుస్తులు విప్పుకుంటూవున్నప్పుడు ఆయన చొక్కాజేబులోవున్న పొగాకుకట్ట జారిక్రిందపడింది. పాపం పంతులది కనిపెట్టలేదు.

మరికొంతసేపటికి పంతులుకొడుకు—పదిపన్నెండేళ్ల కుర్రవాడు—గదిలోకి యెందుకోవచ్చినాడు. నేలమీదపడివున్న పొగాకుకట్ట కనిపించింది. తీసి చేతపట్టుకున్నాడు. ఇంతట్లో పంతులుభార్య అక్కడికి రావడం తటస్థించింది. కొడుకుచేతిలో పొగాకుచూసింది. ఆమెకు కోపముంచుకొచ్చింది పంతులు మీద. కొడుకుచెయ్యిపట్టుకొని గదిలోనుంచి కేకవేసి పెనిమిటిని పిలిచింది.

పంతులు గదిగుమ్మంలో అడుగుపెట్టేసరికి "ఏమండీ! నేనెంత నెత్తీనోరూ కొట్టుకుంటున్నా మీరు మీగుణం మానరుకదా? ఈపొగాకుకట్ట వీడికెట్లా దొరికింది? మీజేబులోనుండో మొలనుండో క్రిందజారి పడివుంటుంది. అంతేనా?"అని తీక్ష్ణంగా అడిగింది.

భార్య కూకలకు గురికాకుండా తప్పించుకునే ఉపాయం పంతులుకు యేమీతోచలేదు. కొంతసేపు తటపటాయించి మరో ఆలోచన యేదీతోచనందున లేనికోపం తెచ్చుకొని కళ్లెఱ్ఱజేసి కొడుకువేపు తిరిగినాడు. "ఓరి కుంకవెధవా! దౌర్భాగ్యుడా! గాడిద!...నీకీపాడుబుద్ధి యెట్లా పుట్టిందిరా? జానెడువెధవవు! అప్పుడే నువ్వు చుట్టలుకాల్చడానికి సిద్ధపడుతున్నావా? ఎవడు నేర్పినాడురా నీకీ దౌర్భాగ్యపుపని?......

నువ్వా, నీచెడుబుద్ధులూను!... బొత్తిగా భయంలేక......సిగిరెట్లు, చుట్టలు యిదా నీచదువు? పుస్తకంమీద వుండవలసిన ధ్యానం పొగాకుమీదికి పోతూవుందేం?" అంటూ గొంతుక పగిలేటట్లు గట్టిగా అరుస్తూ వీరావేశంతో ఉగ్రనరసింహమూర్తివలె కొడుకుమీద తిరగబడి జుత్తుపట్టుకొని, పళ్లుకొరుకుతూ, గభీగభీమని రెండుగుద్దులు గుద్ది "ఈమాటు నాకంటపడనీ చెప్తాను!" అని భార్యచేతిలోవున్న పొగాకుకట్ట లాగుకొని రోడ్డుమీదికి విసిరేశాడు.

పంతులుభార్య తెల్లబోయి చూస్తూనిల్చుంది. కొడుకు వెక్కివెక్కి యేడుస్తూవుంటే ఆమెకుకూడా దుఃఖం ముంచుకొచ్చింది. కుర్రవాడిని చేరదీసి శిరమునిమిరి ఓదార్చింది. పంతులుచేసిన గడబిడకు నిజంగా కొడుకుదే నేరం కాబోలని ఆమె నమ్ముకున్నది.

ఈ ముచ్చట జరిగిన పిమ్మట, మళ్లీ యింట్లో యెక్కడైనా చుట్టపీలికగాని, పొగాకు ముక్కగాని, ఖర్మంచాలక ఆమెకంట పడినప్పటికీ కొడుకే వీటికి కారణమనుకొని భర్తను గద్దించడం మానివేసింది. చడీచప్పుడులేకుండా ఆవస్తుసంగ్రహించి పెనిమిటికి తెలియకుండా అవతల పారవేసేది. కొన్నాళ్లవరకూ యీవిధంగా తండ్రిపాపాలు కొడుకును చుట్టుకొని వెంకోబరావు పంతులును కాపాడగలిగినవి.

పంతులొకనాడు తన మిత్రులతో యీముచ్చటంతా చెప్పడం ప్రారంభించినాడు.

"బాగానేవుంది కాని పాపం నిష్కారణంగా కుర్రవాడినికొట్టి బాధించినారే?" అన్నారుకొందరు.

నవ్వుతూ పంతులందుకు సమాధానంచెప్పినాడు: "అందుకనే పశ్చాత్తాపం కలిగి అమర్నాడే వాడికొక చిన్నబైసికిలు కొనియిచ్చి తప్పుదిద్దుకున్నాను.........కాని, వాడుకూడా తక్కిన ముగ్గురివలె ఆడపిల్లగా పుట్టివుంటే యెంతచిక్కులో పడిపోయివుండునో ఆలోచించకుండా ఉన్నారు మీరు. ఒక్కడైనా కొడుకంటూవున్నాడు గనుక సరిపోయింది. అందుకనే మనవాళ్లు మొగపిల్లలకోసం దేవుల్లాడతారు. 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్నవాక్యం మనపూర్వులు కేవలం స్వానుభవం మీదవ్రాసివుంటారు. చేతికందిన కొడుకు ఉన్నాడంటే గృహస్థన్నవాడికి చుట్ట కాల్చుకుందుకు యెంత సదుపాయంగా వుంటుందో ఆలోచించండి."

# సరస్వతీస్తోత్రము

శ్రీమతులు గిడుగు లక్ష్మీకాంతము జొన్నలగడ్డ శారదాంబగార్లు

చ. కరుణనుజూడుమమ్మ మము, గాఢపుకూర్మిని గావుమమ్మ, మా
వరుసగుణాకరీయనుచు వారకసేవలుచేతుమమ్మ, నీ
వరసురలేకమమ్మెపుడునాదరమొప్పగ జూడుమమ్మ, ఓ
పరమదయాకరీ! సుజనపావని! మానిని! భారతీమణీ!

ఉ. చక్కనిచుక్కవౌగదవె, చల్లనితల్లి! కృపామతల్లి! నన్
మక్కువజూడగాగదవె, మంజులవాగ్విభవంబునీగదే,
చక్కనిభావయుక్తపదసౌరభశోభితశోభనీగదే,
వాక్కులశ్రేణి! వీణకరపల్లవపాణి! సుమంజుభాషిణీ!

# నాగమ్మ

ఆంధ్ర శేషగిరి రావుగారు బి. ఎ. (సారస్వతసమాజము)

'బిరుదులందిన రాచబిడ్డల బొమ్మల
చాయ నాడించిన నాయకమ్మ'

—రాయప్రోలు సుబ్బారావు.

హిందూదేశచరిత్రపాఠకులకుఁ బరిచితురాలైన నూర్జహాను తొలుతఁ గూటికిగుడ్డకు మొగమువాఁచిన ఒకపారశీకదేశస్థునికూఁతురు. తల్లిదండ్రులు చేతఁబైసాలేనికటికదరిద్రులగుటచే నూర్జహానును బెంచలేక ఆమె నెలగ్రుడ్డయియుండఁగా నొకరోడ్డుప్రక్కను విడిచిపెట్టిరి. వర్తకుఁ డొకఁ డామెను జేరఁదీసి పెంచి పెద్దదానినిజేసెను. అతిరూపవతియై ఆమె కాలక్రమమున అదృష్టరేఖబయలుపడుటచే మొగలాయిచక్రవర్తి జహాంగీరున కర్ధాంగియయ్యెను. ధనమూలమైన ఈజగచ్ఛాత్రమునందు పేదవారికినయిత మదృష్టదేవతాప్రసాదముగల్గినచో నున్నతస్థానము సమకూడునని నూర్జహానుచరిత్రచాటుచున్నది. ఆంధ్రరమణి నాగమ్మచరిత్రగూడ నీవిషయమునే వెల్లడించుచున్నది.

పల్నాటిసీమయందు నాగులేటియొడ్డున జిట్టగామాలపాడను నొకగ్రామమున చౌదరి రామిరెడ్డియను బీదరైతు ఒకనాఁడు తనపొలములోఁ బనిజేసికొనుచుండెను. అప్పుడు దగ్గఱ నున్నకంచెలోనుండి యాతనికి శిశురోదనమువినిపించెను. పోయి పరిశీలింపఁగా రామిరెడ్డి కాకంచెలో నొకస్త్రీశిశు వగుపడెను. అతఁడాశిశువు నింటికిఁదీసికొనివెళ్లి నాగమ్మయనిపేరుపెట్టి పెంచుచుండెను.

నాగమ్మ రామిరెడ్డిఇంటికిఁ గొనిరాఁబడిననాఁటినుండియు నాబీదరైతునిల్లు పాడిపంటలకునెలవై సిరిసంపదలతోఁదులఁదూఁగనారంభించెను. కన్నబిడ్డవలె గారాబముతోఁ బెంచి పెద్దదానినిచేసి రామిరెడ్డి నాగమ్మను ధనవంతుఁడగునొకవరునకిచ్చి వివాహము చేసెను. ఆమెభర్తనుగుఱించికాని అత్తవారినిగుఱించికాని మన కేమియుఁదెలియవచ్చుటలేదు. కాని ఆమెయింటిపేరరవల్లివారనివాడుకగలదు. ఇది తల్లిగారియింటిపేరో యత్తవారియింటిపేరో తెలియదు.

నాగమ్మ చిరకాలము సంసారసుఖమనుభవింపలేదు. తనయాస్తియంతయు నామెకు దిగవిడిచి నాగమ్మపెనిమిటి వివాహమైనకొలఁదికాలమునకే కాలధర్మమునొందెను. కొంతకాలమునకు రామిరెడ్డికూడ మరణించెను. అప్పుడాతనిఐశ్వర్యమంతయు నాగమ్మకే దఖలుపడియెను. తలవనితలంపుగా నామె యిట్లదృష్టవశమున నధికైశ్వర్యమునుబొంది పల్నాటిసీమయందొకప్రముఖురాలయ్యెను.

నాగమ్మ శక్తిమతి. అందులో నిప్పు డామె నిజశక్తికి నైశ్వర్యబలము తోడైనది. ఇఁక నామెకోరికలు క్రేళ్లుదాఁటినవి. అట్టికోరికలలోఁ బల్నాటిరాజ్యమున మంత్రాంగము నడపవలెననునది ముఖ్యమైనది.

అది కాకులుదూరనికారడవి. ఒకనాఁడు పల్నాటిప్రభువువైన నలగామరా జాయరణ్యమున వేఁటాడ సపరివారముగఁబోయెను. నిప్పులుచెరుగుమిడియెండలో నందం దడవిజంతువులవేఁటాడి యలసిసొలసి వేఁటఁజాలించి విశ్రమింపఁదగినతావును, దప్పిమాన్పుకొనఁదగినసీరమును వెదకికొనుచు నలగామభూపతి వచ్చుచుండెను. ఆయరణ్యమార్గమునఁ జలువలుచిమ్ముచెట్టునీడలఁ గ్రొత్తగాఁ బందిళ్లుపాకలువేయఁబడియుండెను. అందు స్నానము చేయుటకు వేడినీళ్లును, త్రాగుటకుమంచినీళ్లును సమకూర్పఁబడియుండెను. ఉప్పుతో తొమ్మిది భోజనపదార్థము లందు కొల్లలుగనుండెను. ఆపర్ణకుటీరములకు ముందరిభాగమునం దొకయువతి నిలుచుండి యెవరికోసమో యెదురుతెన్నులుజూచుచుండెను. ఇంతలో నలగామభూపతి సపరివారముగ నచ్చటికివచ్చెను. అప్పు డాయువతి నలగామరాజు నాహ్వానించి తనఆతిథ్య మంగీకరింపవేఁడుకొనెను. బడలికలుగొనియున్నవాఁడుగావున నలగామరాజు సంతోషపూర్వకముగ నామెయాతిథ్యమును గైకొనెను. అప్పు డాయువతి వారికిఁ బిండివంటలతో నన్నముపెట్టెను. అథ్వాన్నపుటరణ్యమునను మఁదమకట్టినమయునందట్లు షడ్రసోపేతముగ భోజనముపెట్టి బడలికలువాపిన ఆస్త్రీనుద్దేశించి నలగామఁ డేదియేని వరము కోరుకొనవలసినదని చెప్పెను. ఆమె యందు కానందించి యాతనికిమాఱుగాఁ బల్నాటిసీమకుఁ దాను గొన్నిగడియలు ప్రభ్వియైయుండ ననుజ్ఞ నీయవలసినదనికోరెను. ఆమెయిచ్చినఆతిథ్యమునకు సంతోషము, చేసినసపర్యలకు సంతృప్తి నొందిన నలగాము డాకోరికయెట్టిదైనను దాని కొప్పుకోలేయకుండనుండలేకపోయెను. ఘోరారణ్యమధ్యమునం దనుకున్నంతలోఁ బందిళ్లువేయించి భోజనపదార్థములుసేకరించి విశేషజనములకు మృష్టాన్నమిడి నలగామభూపతిచేవరమునుగొన్న ఈశక్తిమతియెవ్వరు? ఆమె దృఢసంకల్పయగునాగమ్మయేయని సులభముగనేగ్రహింపవచ్చును. పల్నాటిప్రభువైననలగామునివశం వదునిగఁజేసికొని ఆతనియొద్ద మంత్రిత్వముసంపాదింప నాగమ్మ పన్నిన యెత్తుగడయిది.

నలగామఁ డట్లావనమున బడలికలువాసి కదలి నిజరాజధానియగుగురిజాలకువచ్చి చేరెను. కొన్నిదినములుచనినపిమ్మట నాగమ్మ నలగామునిదర్శించి వాగ్దానముప్రకారము ప్రభుత్వమును వశపఱుపవలసినదనికోరెను. నల్లెయని నలగామరాజు పలునాటిప్రభుత్వము నామెకప్పగించెను. ఆకొలఁదిగడియలలో నామె తనపరివారమున కుత్తరువిచ్చి గ్రామములనుదోఁపించి విశేషధనమునుదెప్పించి నత్పరిపాలనమునెఱపవలెనన్న నిట్లు ధనాగారమును నింపవలెనని హెచ్చరించెను. అంతియేగాక ఆమె యాసమయముననే నలగామరాజుతో నాతనిమంత్రియగుబ్రహ్మనాయఁడు ద్రోహచింతగలవాఁడనియు, విశ్వాసవిహీనుఁడనియు,

మోసగాఁడనియుఁ గొండెములుచెప్పెను. రాజుమాటలువిశ్వసించి బ్రహ్మనాయనియెడ విరసత్వమువహించెను; నాగమ్మను మంత్రిణిగఁ జేకొనియెను. ఆమె యసదృశముగ మంత్రాంగమునెరపఁదొడఁగెను. నాగమ్మబుద్ధిని ప్రజ్ఞను జూచి జను లామెను నాయకురాలని పిలువఁ జొచ్చిరి. అప్పటినుండియు నామె నాగమ్మయనికాక విశేషముగ నాయకురాలనియే వ్యవహరింపఁబడుచుండెను.

నాగమ్మమంత్రాంగ మంతటితోఁ దుదముట్టలేదు. నలగామరాజు సవతితమ్ములగు పెదమలిదేవరాజు, పినమలిదేవరాజు, బాలమలిదేవరాజులపై నాతనికిఁ బ్రేమనుదొలగించి, యసూయనుబుట్టించి వారినిజంపింపఁబ్రయత్నించెను. బ్రహ్మనాయనితల్లియైనశీలమ్మ మలిదేవాదులనుమృత్యుముఖమునుండితప్పించి కొమారునివశముచేసెను. బ్రహ్మనాయఁడు బాలురనుదగ్గఱకుఁదీసెను. నాయకురాలిచేతులలోఁ గీలుబొమ్మవలెనుండినసలగామునివద్ద మంత్రిత్వమువహించి పొందిపొసఁగియుండుట కిఁకవీలులేదని నాయఁడుగ్రహించెను. గురిజాలయందుండుట మలిదేవాదులకుసయితము క్షేమముకాదని అతఁడు నిశ్చయించెను. కావున బ్రహ్మనాయఁడు మలిదేవాదులకుఁ బలునాటిరాజ్యములోఁగొంతభాగమునిప్పించి గురిజాల విడిచిపెట్టి మాచర్లయనుపట్టణమునుగట్టించి వారలనచ్చటికిఁగొనిపోయి వారు యుక్తవయస్కులుకానందున వారికిబదులు తానే పరిపాలనముసేయుచుండెను. మాచర్లరాజధానిగా బ్రహ్మనాయఁడు పలునాటిరాజ్యభాగమును సమర్థతతోఁ బాలించి జనానురాగమునుఁ జూఱలాడుచుండెను. ఆతని కీర్తి, వైభవమునకుఁ గొలఁదిలేకుండెను.

బ్రహ్మనాయఁడు నలగామరాజువద్దమంత్రిపదవివదలుకొన్నందుకు నాగమ్మ మిక్కిలి సంతోషించెను. కాని మాచర్లయందలిబ్రహ్మనాయనికీర్తివైభవము లామెచెవులకుఁజేరుటతోడనే ఆసంతోషమువిచారముగామాఱిపోయెను. ఆమెకడుపులో నూదపెరిగికట్టుతప్పిపోయెను. బ్రహ్మనాయనిప్రాభవముఁగూలఁద్రోసినగాని మాత్సర్యగ్రస్తమగు ఆమెహృదయమునకుశాంతిగల్గకుండెను. బారిదోఁపిడిగాండ్ర కామె ధనమిచ్చి మాచెర్లపట్టణమునుదోఁచికొనిరండనిపంపెను. ఆనగరమున బ్రహ్మనాయనిప్రియసేవకుఁడగుమాలకనమదాసను మహావీరుఁడు ప్రతాపించి వచ్చినదొంగలగుంపు నెదిరించి యోడించి వారినిబశువులవలె గురిజాలపురమునకుఁదఱుముకొనివచ్చెను. అట్లరుదెంచినకనమనాయని నాయకురాలుచూచియోర్వలేక నోటికివచ్చినవిధమునఁదిట్టిపోసెను. అప్పుడు కనమనాయనికిఁ బట్టరానికోపమువచ్చెను. అగుటచే నాతఁడు సైరణవీడి కత్తిదూసి ఆమెపై కుఱికెను. పిన్నటనాఁటనుండియు నాగమ్మ నరసిరక్షించుచుండినఅదృష్టదేవతయే ఇప్పట్టునగూడ నామెను కనమనాయని కత్తివేటునుండి కాపాడినది. తప్పించుకొనిపోయి యంతఃపురముచేరి నాగమ్మ ప్రాణములునిలుపుకొన్నది.

తనకత్యంతప్రియభృత్యుఁడగుకనమనాయఁడు మాచర్లనగరమున కానరాకుండుటకు నివ్వెఱపడి, యొకవేళ గురిజాలకేగనేమోయనితలఁచి, యచ్చటికేయరిగియుండినచో నాయ

కురాలివలన నాతని కేదైనకష్టపాటుకలుగకమానదని అనుమానించి బ్రహ్మనాయఁడు ప్రభువగునలగామునిదర్శింపవలయుననుమిషతో గురిజాలకుబయలుదేఱెను.

తనకుఁబ్రత్యర్థియగు బ్రహ్మనాయఁడు గురిజాలకువచ్చుచుండెనని నాగమ్మ చారులవలనఁ దెలిసికొనెను. బ్రహ్మనాయని తుదముట్టించుట కిదేమంచిసమయమని ఆమెనిశ్చయించెను. నాయఁడువచ్చుమార్గమున లోఁతుగోతులుత్రవ్వించి యవి కనిపింపకుండఁబై పైవగడ్డిగాదములతోఁగప్పించెను. ఎట్టులో వానిఁదప్పించుకొని బ్రహ్మనాయఁడు గురిజాలకు వచ్చెను. అచ్చట నాగమ్మ యతనికి విషభోజనముపెట్టించెను. అయినను నాయఁడీయపకృతులకుబలికాలేదు.

గురిజాలపురమున నలగామరాజు బ్రహ్మనాయని మిగులగౌరవించెను. ఇందుకు నాగమ్మ మిగులకంటగించుకొనెను. తానొనరించిన దుస్తంత్రములనెల్ల నతిక్రమించి బ్రహ్మనాయఁడు నలగామరాజుతో విందులారగించుచుండుట నాగమ్మ చూడలేకపోయెను. ఎటులయిన బ్రహ్మనాయని కష్టములఁబాలుచేయ నాగమ్మ కంటికిఁగూర్కునెఱుంగక ప్రయత్నములొనర్చుచుండెను. ఉద్యోగించునది మాత్సర్యపిశాచముచే నావేశింపఁబడియున్న హృదయము. అట్టిచో యుక్తాయుక్తవివేచనముండుటపొసఁగదుగదా!

విందులుచేసి నలగామభూపతియు బ్రహ్మనాయఁడు నొకనాఁడు రాజభవనమునుండి వెలుపలికివచ్చిరి. నాగమ్మ వారికివేడుకగల్గించు నెపమున నప్పుడు కోడిపందెములాడించెను. ఆపందెము లందోడినకోడి బ్రహ్మనాయనికోడియనియు గెలిచినది నాయకురాలికోడియనియు నామె తనఅనుచరులచే ననిపించి బ్రహ్మనాయనిఅవమానించెను. కాని యోడినకోడినొక దానిని బ్రహ్మనాయనికోడియనియనుటతోడనే అది యుక్కుమిగిలి నాయకురాలనుపేరు గలపుంజునేగాక యెదిరించినపుంజులనెల్ల జయించివిక్రమించెను.

ఇదిచూచి నాగమ్మ పట్టలేకపోయెను. కోపముచే నామె పరవశురాలయ్యెను. ఆమె కోరిమిలగ్గిపోయెను. తనతోఁ గోడిపందెముకట్టుమని ఆమె బ్రహ్మనాయనిరేఁపెను. నాయకురాలిదుస్తంత్రముల కింతదనుకనోర్చివడఁబోయుచుండినబ్రహ్మనాయఁడీకఁబగసాధించుటకు సమయమువచ్చినదని కోడిపోరాటమునకొడఁబడెను. ఎవరికోడియోడునో వారు పురమును రాజ్యమునువిడిచిపెట్టి కృష్ణానదినిదాఁటి మండాదియడవులకువలసపోయి యేడుసంవత్సరములు ప్రవాసమునసుండవలయునని పందెపుటొడంబడిక. ఈకోడిపందెమున బ్రహ్మనాయనికిని, నాయకురాలికిని బాలగోపన్ననాయఁడను యాదవవంశీయుఁడు మధ్యవర్తిగానుండ నేర్పఱుపఁబడెను. బాలగోపన్న బ్రహ్మనాయనికిఁ బ్రాణమిత్రము.

పందెము ప్రారంభింపఁబడెను. గురిజాలపురమునఁగల అశేషజనము నచ్చటనేయుండెను. నలగామభూపతి, బ్రహ్మనాయఁడు మిగిలినరాజబంధువులునువచ్చిరి. అత్యుత్సాహముతోఁ బందెముసాగిపోవుచుండెను. బ్రహ్మనాయనికోడి నాయకురాలిపేరుగల పుంజులనెల్ల

ఛించిచెండాడుచుండెను. నాగమ్మ పరాభవాగ్నిలో క్రుగ్గుచుండెను. మాయచేసి యామె బ్రహ్మనాయనిపుంజునుజంపించెను. మఱియొకపుంజునుగైకొని పందెము సాగింతమన్న నాయనికి నాగమ్మమాయోపాయమువలన నీకఁగోళ్లులభింపకపోయెను. జరుగుచున్న అన్యాయమునంతనుజూచి తగవరియైనబాలగోపన్న కంటగిల్లి నాయకురాలినినిందించి పట్టరానికోపమున నామెయనుచరులపైబడి యుద్ధముచేసి నాగమ్మపక్షమువాఁడైన మువ్వలభీమన్న చేతులలో మరణించెను. గోపన్న మరణము కనమనాయఁడు బ్రహ్మనాయనికిఁదెలిపెను.

నాయకురాలుచేసినకుట్ర నలుగురికిఁదెలిసినది. ఇది తగవుమాలినగెలుపని, అంద అనిరి. అయినను బ్రహ్మనాయఁడు ధర్మమునకుఁగట్టువడి యొడఁబాటుతప్పక మలిదేవాదుల వెంటనిడుకొని మాచర్లపట్టణమునువిడిచి యేలేశ్వరమువద్దకృష్ణానదినిదాఁటి యడవులనడుమనున్న మండాదికి వలసపోయెను. అచటవారికి లంకన్న యనుయోధుఁడు సేనాధిపతిగఁగుదిరెను. మేడలు, మిద్దెలు, కోటలు, పేటలు, వీథులు, గోపురములుతీరి యాకాశానలనడుమ మండాది యొకపెద్దపట్టణమాయెను. బ్రహ్మనాయఁడు రాజ్యతంత్రమునడపుచుండ మాచర్లలోవలె మండాదియందుకూడ మలిదేవాదులు మహావైభవముతోవఱలుచుండిరి; పాఁడిపంటలు గలిగి పెంపొందుచుండిరి.

ఇది నాయకురాలికిఁ దెలియవచ్చినది. మండాది ప్రాభవవైభవముల కామె కళ్లలో నిప్పులుపోసికొన్నది. మలిదేవాదులు ప్రాభవవైభవములుకలిగివఱలుచుండుట తనకుఁ దనప్రభువగునలగామరాజునకు నెప్పటికైనఁజేటయని ఆమె చింతించినది. మలిదేవాదులఁ బ్రాభవవైభవములనుడిందుపాటొందింపవలెనని ఆమె దీక్షపట్టినది. అందుకుఁ బ్రథమప్రయత్నముగా వారిపశుబలమునునాశనముచేయుటమంచిదని ఆమె నిశ్చయించినది. నాగమ్మ కోయవాళ్ళనుబిలిచి ధనమిచ్చి మండాదికిఁబోయి మలిదేవులఁ బశువులమందనుబాడిచిరమ్మని పంపెను. కోయవాళ్లు పోయి మందనుబాడిచి, చెదరఁగొట్టి, అల్లడితల్లడిచేసిరి. అదిచూచి మలిదేవులసేనాని లంకన్న కోయవాళ్లనెదిరించెను; యుద్ధముచేసెను; తుదకునేలకొరిగెను. బ్రహ్మనాయనిపాదసేవకుఁడగుకనమనాయఁడప్పుడు కోయవాళ్లనుమార్కొనెను; భయంకరముగఁబోరాడెను. కోయవాళ్లబలముక్రమముగాఁదగ్గిపోయినది. వారిలోచావగామిగిలినవారు పిక్కబలముచూపిరి.

మలిదేవాదులు మండాదినివాసమేర్పఱచుకొనిమూఁడుసంవత్సరములైనది. ఈమూఁడేండ్లును నాగమ్మ వారినిసుఖముగానుండనీయలేదు. ఆమెపంపినకోయవాళ్లువచ్చి ఆవులమందనుబాడిచిరి. పెక్కావులు నష్టపడినవి. కొన్ని చెదరిపోయినవి. మంచిబంటులంకన్న మరణించినాఁడు. ఇఁక మండాదియందునిలుచుటకు వారికి మనస్కరించినదికాదు. ఉందమన్నను వారిని నాయకురాలు కుదుటఁబడియుండనీయదని బ్రహ్మనాయఁడుతలంచెను. పరభూములకుఁబోవుటయేమంచిదని అతఁడు నిశ్చయించెను. మలిదేవాదులతో బయలుదేఱి

శృంగారమద్ది రేవునఁ గృష్ణదాఁటి దక్షిణదిక్కుగాఁ బ్రయాణముచేసి బ్రహ్మనాయఁడు శ్రీశైలముచేరెను. వారచట వెలసియున్న మల్లికార్జునస్వామిని, భ్రమరాంబాదేవిని సేవించిరి. శ్రీశైలమునకు మాకరాజు ప్రభువు. బ్రహ్మనాయఁడు పోయి యతనినిజూచెను. తనపచ్చల పిడిబాకుకుదువఁబెట్టి మాకరాజువద్ద బ్రహ్మనాయఁడు మార్కాపురము, గణపవరము, త్రిపురాంతకము, అంబసముద్రము మున్నగుగ్రామములుగలభూపాటిసీమను గుత్తకుఁబుచ్చుకొనెను. ఆసీమకు వీరమేడపియనుపట్టణము రాజధానియాయెను. అందు వారు నాలుగు సంవత్సరములాఱుమాసములుండిరి.

ప్రవాసకాలపరిమితి ముగిసినది. అప్పుడు బ్రహ్మనాయఁడు మలిదేవరాజాదులతో నాలోచించి కోడిపోరులోనోడిననాఁటి యొడంబడికప్రకారము యేడుసంవత్సరములుగడిచి పోయినవి; కావున మాచెర్లనగరమును, బలునాటిరాజ్యభాగమునుదమకీయవలసినదని నలగామభూపతికడకు అలరాజనువానినిబంపెను. అలరాజు నలగామునిఅల్లుఁడు. అల్లునిమొగమైనను జూచి నలగామరాజు తమమనవిమన్నించునని బ్రహ్మనాయఁడు భావించెను.

అలరాజు మామగారికొలువుకూటమునకువచ్చెను. మలిదేవులకు వారిరాజ్యభాగము నీయవలసినదని అలరాజు నలగామునిఁబ్రార్థించెను. మంత్రిణియైననాగమ్మప్రోద్బలమున నలగాముఁడల్లునిరాయబారమునకుసమ్మతింపలేదు. పైపెచ్చు పరుషోక్తులాడెను. అందు మీఁద నలరాజున కింతింతనరానికోపమువచ్చెను. వెంటనేబయలుదేఱి యాతఁడు సమీపముననున్నచెర్లగుడిపాడువచ్చిచేరెను. అచట ఆతఁడు కనమనాయనికలిసికొనెను. రాయబారమునెఱవేర్చుకొనిగాని అచటనుండికదలనని అలరాజు ప్రతినబట్టెను. ఇంతలో నాయకురాలు అలరాజునకు (తనప్రభువునకల్లుఁడనియైనచూడక) విషప్రయోగముచేయించెను. అలరాజు చనిపోయెను. ఆతనిభార్యపేరమ్మ తండ్రియైననలగామరాజును దూషించెను; ఆతనివద్దమంత్రాంగమునెఱపుచున్ననాయకురాలిని శపించెను; భర్తతోసాగుమానముచేసెను.

రాయబారమునకువచ్చినఅలరాజును విషప్రయోగముచేఁ దుదముట్టించిననాయకురాలిపైని, నలగామరాజుపైని వీరమేడపిలోనందరుమండిపడిరి. నాయకురాలు మంత్రిణియై ఉన్నంతకాలము నలగామభూపతితోసంధిపొసఁగుటదుర్ఘటమని వారు తుదినిశ్చయముచేసికొనిరి. ఇఁక యుద్ధమేశరణ్యమని వారు నిర్ధారణచేసిరి. గురిజాలలో నలగామరాజును వీరమేడపిలో బ్రహ్మనాయఁడును సమరసన్నాహములుసాగించిరి. సేనలఁగూర్చుకొని యిరుపక్షములవారును కార్యమపూఁడిదగ్గఱదండువిడిసిరి.

యుక్తసమయమున యుద్ధముమొదలుపెట్టిరి. ఉభయపక్షములవారికిని సంకులసమరమయ్యెను. ఉభయత్ర విశేషసైన్యమునష్టపడెను. నలగామరాజుపక్షమూనియుద్ధముచేసిన మహావీరుఁడు నరసింహరాజు వీరమరణమునొందెను. బ్రహ్మనాయనిపక్షముననాతనికుమారుఁడు బాలచంద్రుఁడు అసహాయశూరుఁడై పోరివీరస్వర్గమలంకరించెను. మలిదేవాదులు

కూడ మడిసిరి. ఇరువాగులయందును వీరనాయకులెందఱో మరణించిరి. అప్పుడు నలగామ రాజు సేనలకంతకును నాయకురాలే యాధిపత్యము వహించెను. నాగమ్మ మగబిరుదుగట్టెను; గుఱ్ఱము నెక్కెను; యుద్ధరంగమునఁ జొఱఁబడెను; సేననంతను నాలుగుభాగములుచేసెను; ఒక్కొక్కభాగమున కొక్కొక్క సేనానాయకుని నియమించెను. ఆనాలుగుభాగములును నాలుగుదిక్కులనుండి శత్రువులను మార్కొనెను. నాయకురాలు చాలసేపు సమరము చేసెను; బ్రహ్మనాయని ప్రియశిష్యుఁడగు మాలకన్నమనాయనితో నెక్కటికయ్యము చేసెను. అదృష్టదేవత వీడుటచే నాగమ్మ అపజయమునొందెను; కన్నమనాయనికిఁ జిక్కెను. అంతట నాతఁడు నాయకురాలి కాలుసేతులు విఱిచికట్టి బ్రహ్మనాయని యొద్దకుఁ గొనిపోయెను.

తనకు సమస్తవిషయములందును ఆలోచనపాలోచనఁ జెప్పి రాజ్యమున మంత్రాంగము నెఱపుచుండిన నాయకురాలిట్లు బ్రహ్మనాయనిచేఁ జిక్కినతరువాతఁ జేయునదిలేక నలగామ రాజు బ్రహ్మనాయని శరణుఁ జొచ్చెను. వీరనాయకులమరణమునకు విచారమున మ్రగ్గుచుండిన బ్రహ్మనాయఁడు వైరాగ్యమూని నలగామరాజునకు మఱలఁ బలునాటిరాజ్యము నిచ్చివేసెను; తనకింతచేసిన నాయకురాలిని గూడ నెపమెన్నక విడిచిబుచ్చెను.

ఎక్కడనో చిట్టగామాలపాడను చిన్నిగ్రామమునఁ బుట్టి యొక పేదరైతునింటఁ బెరిగి నిజశక్తిచే నలగామరాజును వశంవదునిగఁ జేసికొని పలునాటిరాజ్యమునకు మంత్రిణియై మహిమ నొంది నాయకురాలను బిరుదు వహించిన నాగమ్మజీవిత మిట్లు కడకాలమునం దవమానము పాలాయెను.

నాగమ్మ మంత్రాంగమునఁ జదురాలు. ఆమె కార్యకాంక్ష న్యాయాన్యాయములెఱుఁగనిమాట నిజమే. మలిదేవాదులు తనప్రభువగు నలగామరాజునకు శత్రువులని ఆమెభావన. శత్రువులను నిశ్శేషముగ నాశనముచేయుట రాజులకు విధ్యుక్తధర్మము. నలగామరాజునకు నమ్మినమంత్రిణియైయుండిన తా నాతనిశత్రువులను నాశనముచేయుటలోఁ దోడ్పడితీరవలయును. అంతియేకాదు. ఆమె బ్రహ్మనాయనిపైఁ బగఁగొన్నది. అతనిని గూలఁద్రోయవలయును. ఇందు కామె మంత్రాంగమందలి తననేర్పరితనమునంతను వినియోగించెను. ఆమె యవలంబించిన రాజనీతి కల్తిలేనిది. అట్టిరాజనీతికి మూలస్థానము స్వార్థపరత్వము. అది మిత్రులఁ బరిగణింపదు; బంధువులఁ బాటింపదు. నాగమ్మ యనుసరించిన రాజనీతి ధర్మచింతచే సంకుచితముగాలేదు; న్యాయభీతిచే జుష్టముగాలేదు. పాశ్చాత్యదేశములందు దినదినము రాజనీతిపేరిట జరుగుచున్న దారుణములను వినుచున్న మనకు నాయకురాలి కృత్యములు—విపరీతములేయగుఁగాక—వింతఁగొల్పవు. ఇంతకును నాయకురాలి మంత్రాంగమందలి మంచిచెడ్డలతో మనకు నిమిత్తము లేదు.

పల్లెటిగ్రామమునఁబుట్టి పేదరైతునింటఁ బెరిగి యాత్మశక్తివలనఁబలునాటిరాజ్యము నకుమంత్రిణియైన నాగమ్మప్రతిభ; పలునాటిప్రభువగునలగామభూపతిని దనచేతిలోఁగీలుబొమ్మవలెనాడించిన ఆమెప్రజ్ఞ; పల్నాటికృష్ణుఁడనిప్రసిద్ధికెక్కినబ్రహ్మనాయుఁడంతవానితో నిరుపోటిగరాజ్యతంత్రమునడిపిన ఆమెమహాసామర్థ్యము; యోధానయోధులైన పురుషులు సయితము స్వీకరించుటకుజంకు సేనాపతిత్వముచేకొనిన ఆమెసాహసము; మగబిరుదుగట్టి అశ్వారూఢయై ఆహవరంగమునకుజేకియుద్ధముచేసిన ఆమెపరాక్రమమును బరికించి ఆంధ్ర రమణుల యందింతటిప్రతిభ, ఇంతటిప్రజ్ఞ, ఇంతటిసామర్థ్యము, ఇంతటిసాహసము, ఇంతటి పరాక్రమము నిక్షిప్తమైయున్నవని నిరవధికానందమును బొందుటమాత్రమేమనపని. కాని నాగమ్మనెఱపినమంత్రాంగమందలిమంచిచెడ్డల నేఁగాదనియెన్నుట మనపనికాదు. అది నిత్యము నీతియనువస్తువుతోడనే వర్తకముచేయుచు నీతితోఁబిచ్చిగొన్నవారిపని; ఎల్లవేళల ఊర్ధ్వలోకములయందే దృష్టినిగిడ్చియుండు ధర్మోన్మాదులపని.

నిజమైనఆంధ్రాభిమానముగలవారు మూఁడులక్షలశత్రుసైన్యముతో స్వయముగ సమరమునలిపి సమ్యగ్జయమునుగొని పాదాక్రాంతుఁడైన పరిపంథినృపాలునివలనఁ గోటి ద్రవ్యములపరాధముగఁగైకొనిన రుద్రమదేవి శుభపర్యవసాయియైనరాజత్వమును ఎంతగాఁ బ్రశంసింతురో ముక్కాఁకలుదీరిన బేతాళమూర్తులనదగు వీరపురుషులకు నెదురొడ్డి మగ బిరుదుగట్టి అశ్వారూఢయై పాలివోనిపౌరుషముతోయుద్ధముచేసి కాలముతప్పివచ్చుటచే వైరికిఁబట్టువడిన నాగమ్మ దుఃఖపర్యవసాయియైనమంత్రిత్వమునుగూడ నంతగనే ప్రశం సింతురు. పర్యవసానమెట్టిదైనను ఉభయత్ర శౌర్యసాహసములు, ప్రజ్ఞాప్రాభవములు సమ ముగనే ప్రదర్శింపఁబడినవిగదా!

"రవి తిరుగలేవంతరాజ్యాన సత్కీర్తిఁ
  గేలఁగీలించినగేస్తురాలు
పలనాటిపసిఁడికోటల గావులెత్తించి
  పారె భూపులకంపుధీరురాలు
నాయనిప్రక్కలో నాగుబామై నాఁడు
  మంత్రిగా నెగడినమాన్యురాలు
కమలకేవురునిప్పుకలురాల్చి కనుమల
  వలసబంపినబలవంతురాలు
కాలమా! మాదునాయకురాలివంటి
బిడ్డ నేదేశమందైన బెంచినావె?"

—మ ద మం చి అ నం త మ్మ.

—'ఆంధ్రరమణీమణులు' నుండి.

# పాకకళ

## మసాలావంకాయ

ఫిబ్రవరిమాసపు గృహలక్ష్మి సంచికయందు ప్రచురింపబడిన వంకాయయొక్క సామాన్యగుణములు వర్ణించు వ్యాసమును ముగించుచు వంకాయపాకవిశేషములను క్రమముగ తెలుపుటకు వాగ్దానముచేసియున్నాము. దానిననుసరించి ఇప్పుడు మసాలావంకాయను గూర్చి వ్రాయుచున్నాము. మాగృహలక్ష్మి పాఠకులుగూడ వంకాయపాకవిశేషములను తెలుపుచో అందుకొని ఇందుప్రచురింతుము.

'మసాలావంకాయ' రుచ్యమగుకూరలలో నొకటి. ధనియాలు, మినపపప్పు, శనగపప్పు, రెండు మిరపకాయలు, ఇంగువ మొదలగు వస్తువులను నువ్వులనూనెతో గాని నేతితో గాని సన్నటినిప్పుసెగను ఎఱుపుడాలువచ్చువఱకు వేయించిదింపి వీనికి సరిపడువంత ఉప్పుఅందుంచి కలిపికొట్టిన పొడిని మసాలా అందురు. ఈమసాలాలో కొందరు పైనచెప్పినవస్తువులతో లవంగములు, లవంగపట్ట, లవంగపత్రి, మరాటి మొగ్గలు ఈవస్తువులను కూడ కలిపివేయించి పొడికొట్టెదరు. ఈమసాలాపొడిని ఒకేతూరి తయారుచేసి నిలువయుంచుకొనుటకంటె కావలసినప్పుడే ప్రత్యేకము తయారుచేసికొనుట శ్రేష్ఠము. కొందరు ఈమసాలా పొడిలో కొబ్బరితురుమునుగూడ కలిపెదరు. ఇట్లు తయారుచేసిన మసాలాను వంకాయతో కలుపుటయెట్లో ఇక వివరింతుము. కొంచము ఇంచుమించు ఒకేపరిమాణముగల లేతవంకాయలను కావలసినమట్టుకు గ్రహింపవలెను. వంకాయనంటియుండు తొడిమ మొదలునట్లేయుంచి ముచికకాడనుకోసివేయవలెను. పిమ్మటవంకాయను తొడిమ మొదలునుంచిగాక చివరభాగమునుంచి నాలుగుపక్షములుగ బద్దలువేరుకాకుండునట్లు తరుగవలెను. అనగా తొడిమమొదలున కాయకు పట్టుండవలయును. మిగిలినకాయ నాలుగుబద్దలుగ నుండవలయును. ఇది కాయఆవకాయకు మామిడికాయ తరుగువిధము. ఇట్లు తరుగబడిన వంకాయలలో చేసిసిద్ధముగ నుంచుకొనిన మసాలాపొడిని నిండుగ కూరవలయును. ఇట్లు మసాలాకూరిన వంకాయలనన్నిటిని ఒకచోట పెట్టుకొనవలెను. వెడల్పుమూతిగల చట్టిలోగాని పాత్రలోగాని నూనెగాని నెయ్యిగాని కాయలకు తగినంత పోసి పొయ్యిమీదపెట్టి మిరపకాయలు, మినపపప్పు, ఆవాలు, కరివేపాకు తిరుగబోతపెట్టి పక్వముగ వేగిన వెంటనే మసాలాకూరిన వంకాయలను ఒక్కొక్కటిగా అందుంచిపైన ఒకపాత్రను మూసి ఉంచవలయును. మూతపెట్టిన ఈపాత్రలోకొద్దిగ నీళ్లనుపోసి ఉంచుటమంచిది. సన్నపుసెగను ఉడికించుట శ్రేష్ఠము. అప్పుడప్పుడు పొయిమీది పాత్రను కదిలించుచుండవలయును. కాయలు ఉడికి మెత్తపడినపిమ్మట పాత్రక్రిందికి దించివేయవలెను. వేడి ఆరిపోకముందు భుజించుట ఆరోగ్యకరము; అప్పుడేరుచిగూడ హెచ్చుగనుండును. ఈరీతివంకాయను కొందరు మసాలావంకాయయనియు, మఱికొందరు నూనెవంకాయయనియు నందురు.

పైమాసపు గృహలక్ష్మిలో వంకాయపాకవిశేషములను మఱికొన్నిటిని వెలువరింతుము. అవిగాక శ్రీమతి వి. సత్యబాలసుశీలాదేవిగారు తెలిపిన 'గులాబ్‌జామ్'చేయు విధానమునుగూడ ప్రకటింతుము! —సంపాదకుడు.




## శ్రీమతి లక్ష్మమ్మ

కొత్తపల్లి లక్ష్మయ్యగారు

ఈమె ఆంధ్రనాటకరంగస్థలమున పదునైదువత్సరముల అనుభవముగలిగి, పెక్కుమందికళాభిజ్ఞులచే మెప్పుబడసిన స్త్రీరత్నము. ఈయమ మనకిదివరకు పరిచితురాంద్రయిన పూర్ణిమకన్య, శ్రీమతి సుభద్రమ్మగార్ల జనని. ఆంధ్రనాటకకళోద్ధారక శ్రీయుత వి. గోవిందరావుగారి ధర్మపత్ని. నటబాలికాపంచరత్నములుగన్న నారీరత్నము. కడపజిల్లాగాలివీడు కాపురస్తులు మహారాజశ్రీ ఆవేటి గంగిరెడ్డిగారు, శ్రీమతి నారమ్మగారును ఈమెను గన్న పుణ్యదంపతులు.

ఈయమ 1895-వసంవత్సరము కడపజిల్లా సింహాద్రిపల్లె గ్రామములో జనించెను. శ్రీమతి లక్ష్మమ్మగారు తనబాల్యము 9 వత్సరములవరకు తమ స్వగ్రామము గాలివీడునందు తలిదండ్రులచెంత గడిపిరి. విద్యాభ్యాసమునకు తగినవసతు లాపల్లెయందు లేకుండుటచే ఈమెతండ్రి మహారాజశ్రీ వి. వెంకోజీరావుగారిచే నిర్వహింపబడుచున్న శ్రీశారదామనోవినోదినీనాటకసమాజమునందు 1905 సంవత్సరములో విద్యకొరకు విడిచిరి. అదివరకే గంగిరెడ్డిగారు వీరికి వియ్యంకులగుటచే ఈబాలికకు రెండువత్సరములు ప్రత్యేకగురువునేర్పరచి ఆంధ్రమున వ్రాయుటయు చదువుటయు అర్థజ్ఞానము భాషాజ్ఞాన మలవడునట్లు విద్యనేర్పించిరి. 1907 సంవత్సరములో మైసూరుయిలాఖా చింతామణితాలూకా చింతమాకులపల్లి గ్రామములో మహారాజశ్రీ కాంభోది రామస్వామిగారివద్ద సంగీతవిద్యకు విడిచిరి. ఒకవత్సరమట ప్రవీణతగలిగిన తదుపరి 1908-వసంవత్సరము జూలై నెలలో ఏలూరుపురమునందు మహారాజశ్రీ వి. గోవిందరావుగారిని వివాహమాడెను. తరువాతఒకసంవత్సరము ఒంగోలు తాలుకా పెదకొత్తపల్లికాపురస్తులు, మహారాజశ్రీ రామాయణం సీతాపతిరావుగారిచే సంగీతవిద్య నేర్పించిరి.

అప్పటికి వి. గోవిందరావుగారు ప్రధానపాత్రల ధరించుచు ఆంధ్రదేశమున కీర్తిని బడయుచుండుటయు, ఈయమ రూపసౌందర్యమునందును, గాత్రమాధుర్యమునందును, విద్యాబుద్ధులయందును సుగుణవతియగుటచే వీరిరువురి దాంపత్యమునుజూచి మహారాజశ్రీ

# శ్రీమతి లక్ష్మమ్మగారి పాత్రధారణము



మోహిని

(దశావతారనాటకము)



కాంతామతి

(కాంతామతీనాటకము)



శాస్త్రకళాశాల, బొంబాయి



బొంబాయిలోని ఒక బ్రహ్మాండభవనము

*Photo by Mr. D. Annaji Rao, Madras.*

వెంకోజీరావుగారును శ్రీమతి సుంకమ్మగారును తమకోడలిని, కుమారునిజూచి మురియు చుండెడివారు. 1909-వ సంవత్సరమునుంచి ఏలూరుపురును నాటకములో వేషములువేయుట ప్రారంభించి డ్యాన్సునేర్చుకొని, సఖులు, దాసీలు, నటీవర్గ రా చిల్లరవేషములు వేయుచు ఆఱువత్సరములవరకు పెద్దలచాటున నాట్యకళావిద్య నభ్యసించుచుగడపిరి. ఈయమ 1915-వ సంవత్సరమ్మునుండి, శకుంతల, లీలావతి, చంద్రమతి, దమయంతి, కాంతామతి, జగన్మోహిని, సీత మొదలగు ప్రధానపాత్రల నభినయించుచు కాలముగడుపుచున్నది. ఈనాట్యకళావిదుషీమణికి ఓర్పుమెండు. అందువల్ల తనకుగల్గిన కుటుంబకష్టములనెల్ల భరించుచు, తనపెద్దసంసారయాత్ర గడుపుచు, తనయింటి విద్యయగు నాట్యకళను పోషించుకొనుచునే కాలముగడుపుచున్నది. ఇప్పటికి ఈమెకు 15 వత్సరముల నాటకానుభవము కలదు. ఈమెకు దైవబ్రాహ్మణభక్తి మెండు. ఇప్పుడు ఈమె అభినయించు వేషములలో యశోద, కమల, మోహిని, ద్రౌపది, పార్వతి, శూర్పణఖ, లీలావతి, కాంతామతి మొదలగు పాత్రల అభినయము అనేకపత్రికల మన్ననబడయుచున్నది. ఒకానొకకవి పుంగవుడు 19-1-30 తేది ఆంధ్రపత్రికలో ఈమె పార్వతిపాత్రపోషణమునుగురించి ఈక్రింది విధమున దెల్పినాడు: "కుమారవిజయనాటకమునందు పార్వతిపాత్రను ధరించిన శ్రీమతి వి. లక్ష్మమ్మగారు అకృత్రిమమగు సౌందర్యవిలాససంపదచే పవిత్రతనుపోషించుటలో మంచి కౌశలముజూపిరి. చిత్రకారులనేకులు పార్వతీప్రతిమను చిత్రించుటలో పవిత్రతనుపోషింప జాలకపోయిరని విన్నవించిన పాఠకులు నన్నుక్షమింతురుగాక. కార్యమంతదుర్ఘటమైనది. దానినామె అంతసులభముగా నెట్లుప్రదర్శింపగల్గినదో నాకాశ్చర్యముగానున్నది. పార్వతి తన ప్రతిబింబమును ఈమెహృదయమున ముద్రించినదికాబోలును." 1929 సంవత్సరములో తెనాలిలోజరిగిన ఆంధ్రనాటకకళాపరిషత్తునందు ఈయమ రామాయణములో శూర్పణఖ, కాంతామతిలో కాంతామతి ఈరెండుపాత్రల నభినయించి కళాభిమానులందరిచే శ్లాఘింపబడెను. ఈమెశృంగారమును బాగుగా అభినయించగలదు. ఈమెవయస్సు ఇప్పుడు 36. ఈమెధరించిన పాత్రలచిత్రములు రెండు ఈసంచికలో ప్రచురింపబడినవి.

## స్వాగతము

శ్రీమతి ఎమ్. వేదవల్లి తాయారమ్మగారు

ప్రజలొందుచున్నట్టి పలువిధంబగుబాధ
  నీశుభోదయముచే నీటఁగలిసె
ప్రకృతిసంతానముల్ భద్రప్రదములౌచు
  నీసమాగమముచే నేర్పుఁగాంచె
శ్రీరామకల్యాణసేవకజనులకు
  నీరాక సంతోషనిలయమయ్యె

ప్రజలనుత్సాదించు భాగ్యంబుగల్గిన
  నీనామమహిమ వర్ణింపఁదరమె
పరమశుభమగు నూతనవత్సరంబ
ధరణిజనులకు భక్తియు ధర్మరతియు
శాంతిసత్యాగ్రహములిచ్చి సరవిగొనుమ
స్వాగతము ప్రజోత్పత్తి! సుస్వాగతంబు.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి ఎన్. రామరాజ్యముగారు

పండ్లఅమ్మదామా!—
ఏమిపండ్లు?
మామిడిపండ్లు—
ఏమిమామిడి?
తీయమామిడి—
ఏమితీయ?
చెరకుతీయ—
ఏమిచెరకు?
వంటచెరకు—
ఏమివంట?
పిండివంట—
ఏమిపిండి?
జొన్నపిండి—
ఏమిజొన్న?
మొక్కజొన్న—
ఏమిమొక్క?
అరటిమొక్క—
ఏమిఅరటి?
బొంతఅరటి—
ఏమిబొంత?
గుడ్డబొంత—
ఏమిగుడ్డ?
పట్టుగుడ్డ—
ఏమిపట్టు?
కుస్తీపట్టు—

౨. పాటలు

## చిలుక ఎరుక

శ్రీమతి చావలి బంగారమ్మగారు

చిలకరో! నాకొక్క యెరుక చెబుతావా?
నీకెరుక చెబితేను నాకేమిగలదూ?
నీయెఱ్ఱముక్కుకీ ముంగర బెడుదూ,
నీపచ్చరెక్కలకీ భమిడిపోదిగిస్తూ,
నువ్వోళ్లెతోవలో శలగవేయిస్తూ,
శెలగతినిచెయిగడగా చెరువుదవ్విస్తూ,
అకుగడుగుతోటల్లు అరటితోటల్లూ
చిలుకరో! మీఅన్న లొచ్చేరుఅరుగో.
మాఅన్నలుకారువీరు రాజులల్లుళ్లూ.
నామాటబొంకాతే నుదురె త్తిచూడూ
బంగారుచెంబుతో పన్నీరుదెచ్చి
పట్టుమనిఅన్నలకూ పాదములుగడిగే
పరుగుపరుగునపోయి పట్టిమంచంవాల్చి
పట్టెమంచంమీద పడుకోఅన్నయ్యా!
కాళ్లుగుద్దుమంటె కన్నీరుగార్చే.
నీయత్తనడగవే నిన్ తీసికెడతా.
వంటిల్లుదిద్దేటి ఓఅత్తగారా!
మాఅన్నలొచ్చేరు మమ్మంపుతారా?
మీఅన్నలొచ్చిన కారణమేమీ?
వావిగలపుట్టింటి వదెనకిపురుడూ,
ధరణిగలపుట్టింటి తమ్ముడికివడుగూ,
మరదిపెళ్లికినేను మళ్లావస్తానూ.
నాకేమి తెలుసునె మీమామనడుగూ.
వాకట్లోకూర్చున్న ఓమామగారా!

మాఅన్నలొచ్చేరు మమ్మంపుతారా?
మీఅన్నలొచ్చిన కారణమేమి?
వావిగలపుట్టింటి వదెనకిపురుడూ,
ధరణిగలపుట్టింటి తమ్ముడికివడుగూ,
మరదిపెళ్లికినేను మళ్లావస్తానూ.
నాకేమితెలుసునె మీబావనడుగూ.
భారతంచదివేటి ఓబావగారా!
మాఅన్నలొచ్చేరు మమ్మంపుతారా?
మీఅన్నలొచ్చిన కారణమేమి?
వావిగలపుట్టింటి వదెనకిపురుడూ,
ధరణిగలపుట్టింటి తమ్ముడికివడుగూ,
మరదిపెళ్లికినేను మళ్లావస్తానూ.
నాకేమిదెలుసునే నీమొగుణ్ణడుగూ.
రచ్చలోకళ్లేటి రాజశేఖరుడా!
మాఅన్నలొచ్చేరు మమ్మంపుతారా?
మీఅన్నలొచ్చిన కారణమేమి?
వావిగలపుట్టింటి వదెనకిపురుడూ,
ధరణిగలపుట్టింటి తమ్ముడికివడుగూ,
మరదిపెళ్లికినేను మళ్లావస్తానూ.
నాకేమిదెలుసునే ఇరుగుపొరుగునడుగూ.
ఇరుగుపొరుగులనుండే ఓయింతులారా!
మాఅన్నలొచ్చేరు మమ్మంపుతారా?
మీఅన్నలొచ్చిన కారణమేమి?
వావిగలపుట్టింటి వదెనకిపురుడూ,
ధరణిగలపుట్టింటి తమ్ముడికివడుగూ,
మరదిపెళ్లికినేను మళ్లావస్తానూ;
పుణ్యంగలపుట్టింటికి పోయివస్తానూ.
పోయిరామాయమ్మ! పోయిరావమ్మా!
మువ్వల్లముద్దుణ్ణి చంకబెట్టుగునీ
ఘంటల్లకాముణ్ణి చెటబట్టుగునీ
వెళ్లెనావనజాక్షి అన్నలింటికిని.

## ప్రాత పాట

శ్రీమతి నీలం రాజు సుబ్బాయమ్మగారు

సీతమ్మ! సీతమ్మ! చిన్నిసీతమ్మ!
రామయ్య రత్నాలపేరంపినాడు
పేరుతో పెట్టెడుసొమ్మంపినాడు
సొమ్ముతో సోలెడుపసుపంపినాడు
పసుపుతో పాగాడునీళ్లంపినాడు
నీళ్లకు నిమ్మలబావంపినాడు
బావికిబంగారు చేదంపినాడు
చేదుకోసీతమ్మ! యీబావినీళ్లు
వెండికడవలతోటి వేన్నీళ్లతోడి
సమిడికడవలతోటి చలినీళ్లుతోడి
ఆనీళ్లుయీనీళ్లు యేకంబుజేసి
జాలాదిబండదగ్గర జలకమాడంగ
పుచ్చుకోసీతమ్మ! యీసొమ్ములన్ని.

## చిన్నపిల్లల పాట

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

ఇంతెత్తుపిల్లి
మెలికనిబట్టపిల్లి.
యెందుకొచ్చావుచెల్లి!
కానీయిస్తాబుల్లి
దమ్మిడిస్తామల్లి
యేమిజేస్తావుచెల్లి?
ఆడుకుంటానప్పా!
అటుకులుదింటానప్పా!
నాకుదేవప్పా
లేకపోతేనొప్పా?
తేనెటీగగూడుబెడితె
తేనెనేనేతాగుతాను,

ఆవుపాలునీవుతీస్తే
అటికమెక్కితాగుతాను,
పక్కనీవుచక్కబెడితే
మెక్కినేనేగుఱ్ఱుబెడతా.
కచ్చుమ్మకచ్చి
కచ్చికిందలచ్చి
నాతోటిమాటాడె
నక్కనితొక్కనలచ్చి.

3. వినోదకథలు

## కుంచంభొట్లు కథ

శ్రీమతి కొప్పర్తి సీతాబాయిగారు

అనగనగా ఓకూళ్లో ఓబ్రాహ్మణుడున్నాడు. ఆయన చాలా లావుగాఉండడంవల్ల కూర్చుంటేకుంచం అంత నేలపట్టేది. అంచేత కొంటెపిల్లలంతా ఆయన్ని కుంచంభొట్లు అని ఉడికించేవారు. ఉడుక్కునేవాడా బ్రాహ్మడు. కొన్నాళ్ళ కోజొన్న చేనువేసుకున్నాడాయన. ఏలాగో ఆవికంకులువేసాయి. కాని పక్షులు ఆకంకుల్ని తినేయడంమొదలుపెట్టేయి. పాపం; అస్తమానంలేచికొట్టలేడు. అంచేత దేవుణ్ణిప్రార్థించేడు. దేవుడు ప్రత్యక్షమై కాస్తవిభూతినిచ్చి పక్షులువచ్చినపుడు వానిమీదచల్లు మళ్లారావుఅన్నాడు. కుంచంభొట్లు ఆలాచల్లితే పక్షులురావడంమానేయి. కంకులుముదిరినతర్వాత కుంచంభొట్లు వాట్నికోసి భార్యకిచ్చి కూరవండమనిచెప్పి స్నానానికివెళ్ళేడు. ఈలోపున భార్య కూరవండి ఉప్పుచాలిందో లేదో అనికాస్త, కారం చాలిందోలేదో అని కాస్తా, ఏదోవిధంగాకూరంతా చెల్లించేసింది. కుంచంభొట్లు స్నానంచేసి కూరకోసం కొండంతఆశతో భోజనానికికూర్చున్నాడు. ఆవిడ అన్నీవడ్డించింది కాని కూరవడ్డించలేదు. కూరవెయ్యలేదేమని కుంచంభొట్లు అడిగితే కూరమాడిపోయిందనిచెప్పింది భార్య. ఆవేశంగా అపరిమితమైనకోపంవచ్చి భార్యనుచంపి ఉప్పుపాతరవేసేడు. రెండురోజులకు చచ్చిపోయిన భార్యమీద ఓజొన్న మొక్క మొలిచింది. ఆమొక్కను తీసికెళ్లి ఆవుకిచ్చేడు. ఆవు అంబా, అంబా కుంచంభొట్లు అని అరిచింది. ఈఆవునన్నుడికిస్తోంది మంచిదికాదని దాన్ని మాలాళ్లకిచ్చేసేడు. అందరు చచ్చినగొడ్డనిస్తేంటే ఈబాపనయ్యగారు బతికిందిచ్చేరని వాళ్లుసంతోషించి ఒక చెప్పులజోడుఇచ్చేరు. బ్రాహ్మడాజోడు తొడుక్కునివస్తుంటే కిర్రు, కిర్రు కుంచంభొట్లు అందిజోడు. ఓస్, జోడుకూడా ఉడికిస్తోందని దాన్నికుక్కకేసేడు. కుక్క భౌయ్, భౌయ్ కుంచంభొట్లు అనిమొరిగింది. కుక్కమీద కసివచ్చి దాన్నిచంపి మైలపోవడానికి నదికిస్నానం నిమిత్తం వెళ్లి స్నానంచేస్తుంటే నీళ్ళు బుడుగు, బుడుగు కుంచంభొట్లు అని శబ్దించేయి. ఆవేశంగా పట్టరాని కోపంవచ్చి నదిలోపడిచచ్చేడు బ్రాహ్మడు. కథకంచికెళ్లింది. మనం ఇంటికొచ్చేం.

## చెవిటివాండ్లకథ

శ్రీమతి దరిసి సుబ్బలక్ష్మమ్మగారు

ఒక చెవిటిగొల్లవాడు గ్రామమునకు కొంచెందూరములో గొర్రెలను మేపుకొనుచుండెను. ప్రతిదినము తనకై చల్దియన్నము పంపుచుండినతనభార్య ఆనాడు ఎందుచేతనో పంపజాలకపోయెను. ఆకలికితాళజాలని యాగొల్లడు గొర్రెలనువిడిచివెళ్లుటకు సమ్మతింపక సమీపములో జపము చేసుకొనుచుండిన ఒక బ్రాహ్మణుని చూచి అయ్యా! నేను చల్దితినివచ్చువరకు గొర్రెల కనిపెట్టియుండుమని చెప్పెను. గొల్లవానికంటే రెండింతలు చెముడుగల యాబ్రాహ్మణునకు గొల్లవాడుచెప్పుచుండినమాటలు వినబడలేదు. ఆయన తనజపసందర్భమున చేయితలచుట్టుత్రిప్పుకొనుటచూచిన ఆగొల్లడు బ్రాహ్మడుసమ్మతించెనని తలచి యింటికివెళ్లి చల్దితిని తిరిగి వచ్చుసరికి తనగొర్రెలు యథాస్థానములో సరిగానుండెను. గొల్లడుసంతోషపడి కుంటిగొర్రెనొకదానిని

బ్రాహ్మణునకు ఇవ్వబోయెను. అందుమీద ఆబ్రాహ్మణుడు 'బళే, బళే, నాదారిన నేను జపము చేసుకొనుచుంటిగాని, నీగొఱ్ఱెపిల్లకాలు నేనెప్పుడు విరుగగొట్టితిని?' అనెను. దానికిగొల్లవాడు యీ కొంచెంసేపు కాచినందుకు యింతకంటే మంచిదానినియిచ్చెదనా? అనెను. ఇట్లు ఇద్దరువాదించుకొనుచుండిరి. వాదన హెచ్చెను. ఇంతలో గుఱ్ఱముఎక్కి వెళ్లుచుండిన యొకసాయిబు దారినబోవుచుండగా వీరుయిద్దరువెళ్లి వీరి తగాదా చెప్పుకొనిరి. వీరిద్దరియంత చెవుడుగల యీసాయిబు గుఱ్ఱమునాకు ఎట్లావచ్చినదో ఆసంగతి నీకెందుకు? యీగుఱ్ఱమయితే మీరుతీసుకపోండి అని గద్దించెను. అంతట ముగ్గురునూకలిసి రాజుదగ్గరకువెళ్లి యొవరిమాటలు వారుచెప్పుకొనిరి. వీరందరియంత చెవుడుగల యీరాజువిని మీరెన్ని అయినా చెప్పండి, నాపెద్దభార్యనాకు అక్కరలేదు, ఆమాటతప్ప వేరేమాట అయితే వింటాను అనుచుండెను. ఈసందర్భములన్నియు వినుచుండినమంత్రి ఒక్కొకరిని వేరువేరుగాపిలిచి గొఱ్ఱెపిల్లను, గుఱ్ఱమునుతీసుకొని సమాధానము చెప్పి యొవరిదారిని వారిని పంపెను.

## పిన్నీ! లడ్డూ ఎలావుంది?

శ్రీమతి పాలెపు సీతాదేవిగారు

అనగాఅనగా ఒకఅరణ్యంలో ఒకగుంటనక్క వుండేది. దాని పొరుగునే ఒకకుందేలు వుండేది. కుందేలు అమాయకమైనది. కాని గుంటనక్క చాలా తెలివైనది. గుంటనక్కకీ కుందేలుకీ చాలాస్నేహము. ఒకరోజున అవిరెండూకలసి పరవాన్నము వండుకొన్నవి. పరవాన్నము సిద్ధమైనతరువాత కుందేలుతోగుంటనక్క యీలాచెప్పింది: "నువ్వుచాలా చిన్నదానివి. కాబట్టినేను నీకురేగాకులో పరవాన్నము వడ్డిస్తాను. నేను నీకంటెపెద్దదాన్ని. నాకో సరం తామరాకుమీద వడ్డించుకుంటాను." "పిన్నీ! నువ్వుచెప్పడం నిజమేను. నేను నీకంటే తప్పకుండా చిన్నదాన్నే. కాని రేగాకుచాలాచిన్నది. దానిమీద పరవాన్నము నేనెలాతింటానూ?" అని కుందేలంది. గుంటనక్క ఒప్పుకోలేదు. గుంటనక్క రేగాకుమీద కుందేలునకు పరవాన్నమువడ్డించింది. కుందేలుదాన్ని ఒక్కమారేతినేసింది. గుంటనక్క తామరాకుమీద అంతపరమాన్నము వడ్డించేసుకుంది. కుందేలుఎన్నోసార్లు పరవాన్నముఅడిగింది. కాని ఆనక్క యిచ్చింది కాదు. గుంటనక్క బాగాపరవాన్నంతింది. గుంటనక్కకడుపు బాగానిండగానే ఒకచెట్టుక్రిందనిద్రపోయింది. కుందేలుకడుపునిండలేదు. దానికి ఆకలేస్తోంది. ఎక్కడికైనావెళ్లి కొంచముతిండానికి తెచ్చుకుందామని కుందేలు ఒకగ్రామములోకి వెళ్లింది. అక్క డొకముసలిదాని యింటికెళ్లింది. తియ్యతియ్యనిమాటలాడి ఆముసలిదాన్నడిగి కొంచంబియ్యం తెచ్చింది. తరువాత కోమటాడింటికెళ్లి నెయ్యి బెల్లంతెచ్చింది. బియ్యంఅన్నీదంపి బెల్లంనెయ్యికలిపి లడ్డూచేసింది. నక్కపడుకున్న చెట్టుమీదికెళ్లి కూర్చుంది. లడ్డూతినడంప్రారంభించింది. లడ్డూ చిన్నముక్కవిరిచి ఆగుంటనక్కదగ్గిరిగా పడవేసింది. నక్కతుల్లిపడిలేచింది. తనముందున్న లడ్డూముక్కను తినేసి తలపైకెత్తి చూచింది. చెట్టుకొమ్మమీద కుందేలుకూర్చొని లడ్డూ తింటోంది. ఇదిచూచి నక్కకుకూడా నోరూరుంది. "నానోరుకూడా లడ్డూతినాలని కోరు

తోంది. నాకుకూడా లడ్డూముక్క యియ్యి"అనిఅంది. కుందేలు చిరునవ్వుతో "నువ్వునాకు హారవాన్నం యివ్వనప్పుడు నీకులడ్డూ ఎందుకిస్తాను?"అంది. "అయితేనాకివ్వద్దులే. లడ్డూచేసే మాదిరిఅయినా నాకుచెప్పు"అని నక్క అంది. "పిన్నీ!చూడు ఇక్కడికి కొంచందూరంగా ఒక గ్రామం అవుపిస్తోంది. నువ్వక్కడికెళ్లు. అక్కడికెదురుగా ఒకింట్లో ఒకముసలిది బియ్యందంపుకుంటోంది. దాన్నితిట్టి కొంచంబియ్యం తీసుకురా. తరువాత దానికిపొరుగునే కోమటిదుకాణం వుంది. కోమటినితిట్టి 'కొంచం బెల్లంతీసుకురా. తరువాత తెలికలవాడింటికెళ్లి వాడినితిట్టి నూనె తీసుకురా. మూడూకలిపి ముద్దచేస్తే లడ్డూఅవుతుంది" అని కుందేలు చెప్పింది. నక్క ఆమాటలువిని లడ్డూతిందామనే సంతోషముతో ఎగురుతూ దుముకుతూ ముసలిదానింటికెళ్లింది. ముసలిదిరోట్లో ధాన్యందంపుతోంది. "ఓముసిలీ!ఓదెయ్యమా! నీనడుంవిరిగిపోనూ, నువ్వుచచ్చిపోనూ, నాకుకొంచంబియ్యం యియ్యవులే"అంది. తిట్లువిని ముసలిదానికి చాలా కోపంవచ్చింది. అది నిశ్శబ్దంగా ఇంటిలోపలికెళ్లి పొయ్యిలోవున్న వేడిబూడిద తెచ్చి గుంట నక్కమీద పోసి"తీసుకో. బియ్యంతీసుకో"అంది. నక్కఒళ్లంతాకాలిపోయింది. అదిఏడుస్తూ మొత్తుకుంటూ కోమటిదుకాణానికెళ్లింది. "ఓకోమటీ!నీకుదివాలాకావాలి.నీదుకాణంమీదికి ఎవరూకొనేందుకురాకుండాపోవాలి. నీపెళ్లాంచచ్చిపోవాలి. నాకు కొంచం బెల్లమియ్యరా" అని కోమటితోఅంది. నక్కతిట్లువిని కోమటికోపంతో మండిపోయేడు. నిశ్శబ్దంగా యింటి లోపలికెళ్లేడు. ఒకతబుకుతోరాళ్లు తెచ్చేడు. బెల్లంతెచ్చేడనుకుంది నక్క. రాళ్లుతెచ్చి నక్క వీపుమీద పోసేసేడు. రాళ్లదెబ్బలవలన నక్కఎముకలన్నీ విరిగిపోయేయి. అప్పుడు నక్క అక్కడినుండి తెలికలవాడింటి కెళ్లింది. 'ఓ తెలికలవాడా! నీఎద్దులకాళ్లు విరిగిపోనూ, నీ గానుగ విరిగిపోనూ, నీకొడుకుచచ్చిపోనూ, నూనివ్వరా"అంది. నక్కతిట్లువిని తెలికలవాడు కోపముపట్టలేకపోయాడు. వాడు యింటిలోపలికెళ్లేడు. గిన్నెనిండా మరుగుతూవున్న నూనె తెచ్చేడు. నూనెతెస్తున్నాడనేఅనుకుంది గుంటనక్క. తెలకలవాడు నక్కమీద మరుగుతూ వున్ననూనెబంపేశాడు. నక్కఒళ్లంతా కాలిపోయింది. పెద్దపెద్దపొక్కులు పొక్కేయి. నక్క ఏడుస్తూ అరణ్యంలోకి వెళ్లింది. దీనిసంగతంతాచూచి కుందేలునవ్వుతూ "ఏం? పిన్నీ! లడ్డూ ఎలాగుంది? నువ్వుకడుపునిండా లడ్డూతిన్నట్లేఉంది. అందువల్లనే నీకడుపు పొంగివుంది" అంది. నక్కఏడుస్తూ తనదశంతాకుందేలుతో చెప్పుకుంది. దానిస్థితిచూచి కుందేలుకిదయకలిగింది. అది అరణ్యంలోనుంచి కొన్నివేరులుతెచ్చి నక్కశరీరముమీద రాసింది. నక్కకు వేగిరంగానే ఆరోగ్యంకలిగింది. "పిన్నీ! జాగ్రత్త. నేటినుండి ఏరినైనా మోసముచేస్తే యిదేఫలము అవుతుంది" అనికుందేలు చెప్పింది. అప్పటినుంచి నక్క బుద్ధిగలిగి తనజిత్తులను మాని ఎవరిని మోసముచేయక నీతిపాఠమునునేర్చుకొని సుఖముగా జీవితశేషమును గడిపింది. ఒకరిని మోసముచేయదలచినవారు ఈకథలోని నక్కవలెనే నష్టము పొందుదురు.




### టైపు చేయుటలో అగ్రేసరురాలు:—

లండను నివాసినియగు ఎలియనార్ మిచెల్ కన్య టైపుచేయుటలో అగ్రేసరురాలు. యూరోపియను టైపింగు ఛాంపియనుషిప్పునందు అయిదుసంవత్సరములుగ ఆమెయే బహుమానమును బడయుచున్నది. కంఠస్థమైన మేటరును ఆమె నిముషమునకు వేయిఅక్కరములచొప్పునకొట్టును. క్రొత్తమేటరుఅయినచో ఈవేగము కొంచము తగ్గును. వార్తాపత్రికనుండి ఒకవ్యాసభాగమును టైపుచేయుచు ఆమె తనస్నేహితులతో మూడు భాషలయందు సంభాషణల నిర్వహించినది. ఇట్లు మూడుభాషలలో మాట్లాడుచు టైపుచేసినను వేగమునందు ఏమాత్రమును తగ్గుదల కానరాలేదు. నాలుగువందలమంది ఆడటైపిస్టుల ఎదుట ఈ ప్రదర్శనము చేయబడినది.

### పాతికయేండ్లనాటి గ్రుడ్డితనము స్వప్నముతో సమాప్తమైనది:—

ఎడ్వర్డు కారన్. అతనివయస్సు 79 వత్సరములు; డర్హామ్‌నివాసి. 25 సంవత్సరములకు పూర్వము నుంచి అతనికి నేత్రావరోధము కలుగప్రారంభించెను. ఒకనాడు అతనికికలవచ్చెను. "మతప్రచారకు డొకడు వారియింటికివచ్చెను. వారాతనికిటీపార్టీనిచ్చిరి. అనంతరము నేనునాభార్యనుపిలచి బైబిలుపుస్తకము తెమ్మంటి. ఆమెతెచ్చినది. నేనాపుస్తకమును తెఱచి అందలి పదునాలగవప్రకరణము సెయింటుజాన్ వృత్తాంతము చదువదొడగితిని.'' ఇట్లుకలగాంచి ఆతడు మేలుకనెను. గ్రుడ్డితనముతొలగిపోయెను. అతడిప్పుడు చక్కని దృష్టిగలిగియున్నాడు.

### ప్రపంచమునందలి నత్తగుల్లలలో త్వరగ నడచునది:—

లండను జంతుప్రదర్శనశాలలో ప్రపంచమునందలి నత్తగుల్లలన్నిటిలోను త్వరగనడచు నత్తగుల్ల ఉన్నది. అదినిముషమునకు ఆరుగజములు నడవగలదు. అనగాగంటకు రెండుఫర్లాంగులు నడవగలుగుచున్నది.

### ఉష్ట్రికడుపులో పదహారుపౌనుల వార్తాపత్రికల కాగితము:—

లండను జంతుప్రదర్శనశాలలో ఈనడుమ ఒకఉష్ట్రి చనిపోయినది. దానికడుపుకోసిచూడగా అందు న్యూసుపేపరుముక్కలు జీర్ణముకాక ఉండెను. ఆముక్కలనన్నిటిని పోగుచేసితూచగా అవి 16 పౌనుల తూకముండెను.




## శిరోజములు

సీ. కేళికాసరసిలోఁ దేలియాడుటఁజేసి
శైవాలలతకొంత సాటివచ్చుఁ
బుప్పమాలికలతోఁ బొందుసల్పుటఁజేసి
రొలదేఁటిగమి కొంతయీడువచ్చుఁ
గంటికెంపగు రేఖ కల్గియుండుటఁజేసి
మినుకుఁగాటుక కొంతదినుసువచ్చుఁ
బిరుదునొయ్యారమ్ము మెఱయుచుండుటఁజే
చమరివాలమెుకింత సమమువచ్చుఁ
గీ. గాక నీలత్వమున సరిగావు తెలియ
నెఱిగలిగి యొక్క మెత్తనై నిడుదలై ద
ళమ్ములై మెుగ్గలై కారుక్రమ్ముచున్న
వికచకమలాక్షి నునుసోగవెంట్రుకలకు.

—విజయవిలాసము.

గీ. చామరంబులు వెనుకకుఁ జనుట నీల
రత్నములుపూరిఁ గఱచుట భ్రమరకమని
తేఁటిబిడ్డ సేరిడుట యీ తెఱపకురుల
కధిక నీలిమ నోడిసూ హారితనూజ !

—ప్రభావతీప్రద్యుమ్నము.

స్త్రీల సహజసౌందర్యమును సూచించులక్షణములలో శిరోజములు ముఖ్యమైనవి. నీలిమ, నిడివి, నునుపు, సాంద్రత ఈలక్షణములుగల శిరోజములతో నొప్పుస్త్రీ సౌందర్యము అసమానమగుటయేగాక ఆమె మంచిఆరోగ్యముతో నొప్పుచుండుటనుగూడ సూచించును. స్త్రీలు ప్రియముపడు పుష్పాలంకారముగావించుకొనుటకు శిరోజములే ఆధారము. శిరోజములతో ఒయ్యారికత్తెలు హొలుజడను, సుందరులు సిగను, పడతులు బర్మాముడిని, పసుచులు ముచ్చటముడిని, ముత్తయిదువలు కొప్పును సవదరించి తమ సహజసౌందర్యసంపదకు వన్నెయు వాసియు గూర్చుకొనుచున్నారు. తమశిరోజములను భారతస్త్రీలు గొప్పవిలువతోడను గౌరవముతోడను చూచుచున్నారు. కొప్పుపట్టిఈడ్చుట వారికిచేయగల పరాభవములలో గొప్పది. ద్రౌపది కొప్పుపట్టి ఈడ్వబడుటచేతనేగదా భారతయుద్ధము పొసగినది? తమశిరోజముల నింతవిలువగ చూతురుగావుననే వారు తమ ఆప్తబంధువులరోగముమళ్లుట మొదలగు వాంఛాపరిపూర్తికి భగవంతునికీయగల కానుకలలో వేణినిచ్చుట హెచ్చుగ జూతురు. అంత గౌరవముగజూడబడు శిరోజములను భారతస్త్రీలు - పడమటిగాలితగిలినవారు-నేడు తిరస్కరించుటకు తెగువవహించుచున్నారు. తిరస్కరింపనివారైనను వానిప్రవ



"పడమలను దాకఁబోయెడి మగువకురులు"

*Photo by Messrs M. Doss & Bros.*



ఖద్దరువస్త్రధారిణులగు బాలికలు

*Photo by Messrs M. Doss & Bros.*

ర్థనమునుగూర్చి శ్రద్ధవహింపకున్నారు. అకలుషనీలిమగల శిరోజములకు నేటిపడుచులు నోచుకొనలేదు. అకాలమున అవి నెరసిపోవుచున్నవి. లేదా రాగిరంగు నొందుచున్నవి. ఉన్నవెంట్రుకలైనను నిడుదలుకావు. ఆకుంచితకురులైనను దట్టముగనుండవు. ఆగుప్పెడు కురులైనను పట్టువంటినునుపుకునోచక పీచుకంటె బిరుసుగలవియైయుండును. కారణమేమి? బజారులందు విరివిగనమ్మబడుచున్న తలనూనెలను, సబ్బులను వాడుటయే. బజారులందు విక్రయింపబడు తలనూనెలను ఒకరికంటెనొకరు చవుకగనమ్మవలయునను ఉద్దేశముతో తక్కువరకపు మట్టినూనెలతో చేయుచున్నారు. ఈనూనె కురులకుదుర్లకు హానిచేయుచున్నది. వాడబడుచున్న సబ్బు శిరోజములను బిరుసుబాఱించుచున్నది. సబ్బులు వాడనివారు సీకాయగాని, కుంకుడుకాయగాని వాడుదురు. ఇవి శిరోజములకంటియుండు చమురును మొదలంట వదలించివేయుగుణముకలవి. శిరోజములను నునుపుదేర్చుటకు చమురే మూలాధారము. కావున సీకాయ, కుంకుడుకాయ వీనికంటె సీకశేని, బెండ, గోగు, తుత్తురుబెండ, ముత్తవపులగం మొదలగు జిగురుపదార్థముండు ఓషధులను తలరుద్దుకొనుట కుపయోగించుటమంచిది. లేదా మినపపిండి, పెసరపిండి, మెంతులపిండి వాడవచ్చును. జిగురుగల ఇట్టిపదార్థములను వాడుటవలన తలచమురు మొదలంటపోదు; కొంత శిరోజములకంటియుండును. అందువలన వెంట్రుకలు పట్టుకుచ్చువలె మృదువుగనుండును. వాసననూనెలకంటె కొబ్బరినూనెనుపయోగించుట చాలమంచిది. శిరోజములను నల్లబాఱించుటలో పేరుమ్రోసిన భృంగామలక, భృంగరాజాదితైలములనువాడవలయును. దాసానిపువ్వులను నూనెలోవైచి కాచి ఆనూనెను అభ్యంగనాదులకుపయోగించుచుండిన శిరోజములు నునుపుదేఱును. ఇట్టి సూక్ష్మక్రియలమూలమున శిరోజముల నభివృద్ధిపఱచుకొనజాలియుండగా ఫేషనుపేరున వాసననూనెలను, సబ్బులనువాడి వాని అందమును చందమును చెడగొట్టుకొనుటకంటె తెలివితక్కువ మఱియొకటియుండదు. శిరోజముల నభివృద్ధి చేసికొను సూక్ష్మక్రియలు పెక్కులు గృహలక్ష్మిపాఠకురాండ్రకు ఎడనెడ నివేదింపబడుచునేయున్నవి. కావున వారు ఒక్కింతశ్రద్ధవహించి ఆప్రక్రియలనుచేకొని తమ శిరోజములు నీలిమయందు హరినీలమణులను, కొదమతుమ్మెదరెక్కలను, మబ్బును, చీకటిని జయించి; మృదుత్వమున పట్టునుగెలిచి; సాంద్రత, నిడివిగలిగి పైకవులవర్ణనము భారతస్త్రీశిరోజములయెడ స్వభావోక్తియే యనుపేరుగొనుటకు ప్రయత్నింతురుగాక! వేడుకలకు వినోదములకు వెచ్చించుకాలమును, ధనమును నేటినాగరికస్త్రీలు శిరోజములకభివృద్ధిగూర్చుటమొదలగు సౌందర్యపోషక కార్యములందు వినియోగించుట లెస్స. దేహసంబంధములును గృహసంబంధములునునగు విషయములయెడ అశ్రద్ధ, అనవసరవిషయములనుగూర్చి అమిత శ్రద్ధ నేటి నాగరికకాంతల లక్షణములుగనున్నవి. ఈస్థితి ఎంతత్వరగమారిన అంత అనుకూలము.



### సగ్గుబియ్యము:—

ఏప్రియలుమాసపు 'హిందూసుందరి' పత్రిక ఇట్లుప్రచురించుచున్నది:—

"సగ్గుబియ్యము శాగో అనునొక చెట్టునుంచి చేయఁబడుచున్నవి. సగ్గుచెట్టు తాటిచెట్టుజాతిలో చేరిన యొక గొప్పవృక్షము. ఇది జావా, బోర్నియో, సుమిత్రా మొదలగు దీవులలో విస్తారముగా పెరుగుచున్నది. ఇది ఇపుడు బంగాళాదేశమున దక్షిణభారతమునఁగూడ నాటుచున్నారు. దీనిలో చాలా భేదము లున్నవి. దీనియాకులు తాటియాకులకంటెను పొడవుగానుండును. పండ్లు గుండ్రముగా అందముగానుండును. ఈచెట్టుయొక్క నారవల్ల తట్టలు, త్రాడులు, బ్రష్షులు, కుంచెలు మొదలగునవి తయారుచేయఁబడును. అక్కడక్కడ ఈచెట్టుగీచి కల్లుకూడా తీయుదురు. దీనినుండి బెల్లమున్ను వండుదురు. ఈచెట్టు 15 యేండ్లదియైనపుడు దీనిపైని కాయలుబయలుదేరును. అపుడు లావైన దీనిమ్రానుచుట్టును పిండివంటి తెల్లనిపదార్థము ఆవరించును. దీనినికోసి తీసివేయనియెడల చెట్టు యెండిపోవును. అందువల్ల దీనిని కత్తితోగోకి తీసిదంచి చిన్నచిన్న బియ్యపురూపమున పోతబోయుదురు. అవియెండినవే యీసగ్గుబియ్యము. మరియొకవిధమైన చెట్లు కూడా ఉన్నవి. వీటిమ్రాను ముక్కముక్కలుగానరికి లోపలి గుంజుతీసి నీళ్ళతోకలిపి దంచి కారపుబూందీవలె సన్నముగా చట్రములనుండి పోతపోసి యెండబెట్టుదురు. ఈచెట్టుసాధారణముగా నీటిలో నానిన కుళ్ళిపోదు. కాన దోనెలుగాఁజేసి నీటికొట్టములుఁజేసి పొలములలో వాడుదురు. వర్షకాలములో గింజలు భూమిలో పాతినయెడల ఈచెట్టు మొక్కలు బయలుదేరును. ఈలాగుఎండబెట్టిన పదార్థమే సగ్గుబియ్యము అగుచున్నది. కాని చెట్టుకాయలలోనుంచిపుట్టిన గింజలుకావు. ఇవిత్వరలో జీర్ణమగును. కాన పాలలోగాచి రోగులకు పెట్టుచున్నారు."

### ప్రస్తుతవిద్యావిధానము: స్త్రీవిద్య:—

కడపమునిసిపలుసంఘసభికురాలగు విద్యాధికురాలు శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు 'ప్రస్తుతవిద్యావిధానము: స్త్రీవిద్య' అనువిషయమునుగూర్చియిట్లు వ్రాయుచున్నారు:—

"ప్రస్తుతవిద్యావిధానమువలన కలుగుచున్న చెడుగులు వర్ణించుట కలవికావు. దైవభక్తి, పెద్దలయెడ విధేయత, సత్ప్రవర్తనమున్నగు సనాతనధర్మములను నిర్లక్ష్యముతో నుల్లంఘించుట, మానవజీవితమున అత్యావశ్యకమైన ఆరోగ్యమును కోల్పోవుట, పరీక్షలలో నెగ్గవలయునను పట్టుదలతో మితిమీరిన మనోపరిశ్రమ చేసి దేహదార్ఢ్యమును కోల్పోయి కళాహీనములై పాలిపోయిన ముఖములతో శుష్కశరీరులై క్షయమున్నగు

క్రూరవ్యాధులకు లోనగుట, పితృార్జితములైన మడిమాన్యములనమ్ముకొని నిరుపేదలై తుదకు ఉన్నతాళయములను సైతము కోల్పోయి జీవనోపాధికిమార్గము కానక దాస్యవృత్తికై తడవులాడుచు పరులపంచలాశ్రయించి తిరుగుటతప్ప యింకెంతయు వేఱులాభము కాన్పించదు. ఇట్టిఇన్నికష్టముల కాస్పదమైన విద్యావిధానమునే స్త్రీలకుగూడ అంటగట్టి అధఃపతితల చేయవలయుననుట మిక్కిలిశోచనీయము. దేశభాషలయందు ఉన్నత విద్యగరపఁబడుటలేదు. స్త్రీజనోచితములైన పాకశాస్త్రము, సంగీతము, చిత్రలేఖనము, శిశుపోషణావిధానము మున్నగు విద్యలుబొత్తిగా నేర్పఁబడుటలేదు. మీదుమిక్కిలి మాతృభాషాజ్ఞానమైన నార్జించుటకు వీలులేదు. జాతీయపద్ధతులపై విద్యావిధానము మార్పుచెందిననే కాని, స్త్రీజాతి ప్రాచీనౌన్నత్యమొందఁజాలదు. స్త్రీజాతి ప్రాచీనౌన్నత్యము నొందిననే కాని భారతనాగరికత పునర్జీవించఁజాలదు; భావిసంతతిని దేశమాతకు సుపుత్రులుగను గృహములను స్వర్గతుల్యముగ నొనర్చువారిగను చేయుటకవకాశముండదు. పాశ్చాత్యవిద్యార్జనాతృష్ణయిప్పటిసోదరీమణులలో అనేకులనుమిక్కుటముగ నావహించియున్నది. మాతృభాషమంటఁగలిపి పరభాష ప్రాముఖ్యమొందులాగొనర్చుట భారతనారీమణులకు భావ్యముకాదు. మహిళాజనమునకు మాతృభాషారాధనమే శ్రేయోదాయకము. ఇట్లనుటచే పరభాషలయందు బొత్తిగా ప్రవేశము వలదని నాయభిప్రాయముకాదు. పరభాషలయందుకూడ స్త్రీలకు కొంతమాత్రము ప్రవేశముండుట మంచిదేకాని పరభాషామూలకముగా విజ్ఞానము నార్జింపబూనుట అసాధ్యము. కావున మాతృభాషయందే విద్య నేర్పవలయును. భారతనాగరికత మతసంప్రదాయముల ననుసరించి ప్రస్తుతస్త్రీవిద్యాప్రణాళిక పరివర్తన మొందవలెనని నానిశ్చితాభిప్రాయము."

### పళ్లుదోము పుల్లలు:—

గోపరాజు రాజన్నగా రిట్లువ్రాయుచున్నారు:—

'పళ్లుదోముపుల్లలను మనవారు చాలమంది వాడుదురు. వీనిలో ఉత్తరేణిపుల్ల శ్రేష్ఠము. గానుగపుల్ల, వేపపుల్ల, మఱ్ఱియూడలు, బఱ్ఱెంకిపుల్ల—వీనిలో పాలుగలవు. వీనిని ఉపయోగించినయెడల నోరుపరిశుభ్రపడుటయేగాక పైత్యము, కఫము, వేడినశించును. ఒకానొకప్పుడు చాకలివాడొకడు నిత్యము ఉత్తరేణిపుల్లలను బానపొయ్యిలో పెట్టుచుండెను. ఆపొయ్యిలోని బూడిదతో ప్రాతఃకాలమున వాడు ముఖప్రక్షాళనము చేయుచుండెను. ఇట్లుచేసిన యారునెలలకు వాడు మహాపండితుడై కావ్యమొకదానిని గూర్చెను. ఇట్టికథ మన తలిదండ్రులు మనకుచెప్పుదురు. దీనియందలి భావమేమి? ఉత్తరేణిపుల్ల మెదడుకు మంచిదనియే వారి యభిప్రాయము. తుమ్మపుల్ల మెదడుకు మంచిదికాదు. దీనినుపయోగించిన కొంతకాలమునకు మనుష్యునికి మాంద్యమెక్కువగును."

### రషియాలో వివాహముల దురవస్థ:—

'మాన్చెస్టరుగార్డియను' స్వకీయవిలేఖరి రష్యాదేశమందలి మాస్కోనగరమును సందర్శించి తెలిపిన విషయములలో అచ్చటి వివాహములతీరు వివరించు క్రిందిపంక్తులు 'త్రిలింగ'పత్రిక ప్రచురించినది:—

"జాగ్ అనగ వివాహములయొక్కయు విడాకులయొక్కయు రిజిస్టరుచేసుకొను ఆఫీసు. అట్టిజాగులో నొక ఇరువదేండ్లవయస్సుగల తరుణి మిక్కిలిపట్టుదలగా రిజిస్ట్రరుకార్యము నెరవేర్చుచుండెను. వివాహమో విచ్ఛేదమో కోరు స్త్రీపురుషులు ఆమెయెదుటికి వచ్చుచుండిరి. ఆమెయు తదనుసారము వ్యవస్థవ్రాసియిచ్చుచుండెను. అచ్చటికివచ్చుజనులలో వివాహము చేసికొనువారెవరో విడాకులుకోరువారెవరో యొకదృష్టిచేతనే

దెలిసికొనవలసియుండెను. ఏలనన వివాహముచేసికొనగోరువారికముందు తనకు భార్యగాబోవు స్త్రీతో నుందురు. వివాహవిచ్ఛేదముకోరువారు స్త్రీయో పురుషుడో యొంటరిగానేయుందురు. వివాహేచ్ఛులగు దంపతులు ఆఫీసులో ప్రవేశించినవెంటనే యాతరుణి "మీరు పెండ్లిచేసికొనగోరుచున్నారా?" అని తనకు వాడుకగానున్న ప్రశ్నయడుగును. "అవును" అనివారు ప్రత్యుత్తరమిత్తురు. తర్వాత నామె ఆఫీసుఫీజు అని రెండురూబుల్సు (రష్యా దేశపునాణెములు) అడుగును. దంపతులది చెల్లించగానే వివాహసంబంధమైన వారి దరఖాస్తును చేతబట్టుకొని వారిజన్మస్థానమును మరియును నుభయులలో నెవరైనను నింతకుముందు వివాహమై యుండిరా యనుప్రశ్నలడుగును. దంపతులీప్రశ్నలకుదగిన యుత్తరమిచ్చినతర్వాత నెన్నియోరిజిష్టరు పుస్తకములలోవారు సంతకములు పెట్టవలసివచ్చును. ఇంతటిలోనే వారి వివాహమయినట్లుగా భావింపబడును. ఇవ్విధముగా రష్యాదేశపువివాహములు కేవలము చేవ్రాలుమీదనే యాధారపడియున్నవి. ఆనాడు వివాహము చేసికొనగోరివచ్చిన వారలలో ౨౩ సంవత్సరముల వయస్సుగల రష్యాదేశపు స్త్రీని వివాహము చేసికొనబోవు ౨౮ సంవత్సరముల వయస్సుగల జర్మనీదేశపు తరుణుడొకడుండెను. ఆస్త్రీతో నొకచిన్నవాడునునుండెను. ఆస్త్రీ తనవివాహము రిజిష్టరుచేసికొనుసమయమున "నాకెన్నిసార్లు వివాహముచేసికొను హక్కుగల"దని రిజిస్ట్రార్ అధికారములోనున్న యాస్త్రీనడిగెను. నీవు వివాహముచేసుకొనిన తరువాత నీనుకురెండుపరకునని ప్రత్యుత్తరమివ్వబడెను. భళిరేభళియని యాస్త్రీతనయత్యానందమును ప్రదర్శించెను. ఇటువంటివిషయములు మిక్కిలి అసహ్యముగానుండునని యాజర్మనుయువకుడుచెప్పెను. కాని యాస్త్రీ తన భర్తమాటనువిని 'ఊరకుండుము. ఇకమీదట భర్తలు తమభార్యలకు భయపడవలసియేవచ్చు'నని ప్రత్యుత్తరమిచ్చెను. విలేఖరి రిజిష్ట్రార్ అధికారములోనున్న యాస్త్రీనిజూచి "మీరెట్టికారణములుండిన వివాహవిచ్ఛేదమునకు సమ్మతినొసంగుచుందు"రని అడిగెను. ఇదివిని యాస్త్రీ యాశ్చర్యపడుచు "కారణమా? మీరు కారణములకుగాను ప్రశ్నించుటకు గలదేమి? వివాహమైయున్న యేస్త్రీయైనను బురుషుడైనను విచ్ఛేదమునకుగాను దరఖాస్తుపెట్టిన వెంటనే మేము రెండురూబుల్సుఫీజు పుచ్చుకొని తత్క్షణమే సమ్మతియొసంగి యెదురు పార్టీవారికి మీభర్తయో భార్యయో మీతో వివాహవిచ్ఛేదమును చేసుకొనియెనని జాబువ్రాసి తెలియపఱచుచుందుము. స్త్రీకి సంతానములేకుండినచో నేబాధయులేదు. సంతానమున్నచో స్త్రీపునర్వివాహము చేసుకొనువరకు బిల్లలపోషణార్థము పురుషుడు తనకువచ్చురాబడిలో మూడవభాగమో నాల్గవభాగమో యివ్వవలసివచ్చును. ఇవ్విషయము సులభముగా పరిష్కారముకానిచో మేము దానిని న్యాయస్థానమునకంపెదము." అప్పుడే యచ్చట నొకపోలీసుజవాను తనభార్య తల్లితోదనకు సరిపడనందున తనస్త్రీతో వివాహవిచ్ఛేదమునకుగా వచ్చటికివచ్చెను. రిజిష్టరుకార్యముచేయు స్త్రీ వెంటనే విడాకుకుగాను సమ్మతినిచ్చెను. కాని "ఈస్త్రీ పునర్వివాహము చేసుకొనువరకు నీవామెను నీయింట్లోనుండి వెళ్ళిపొమ్మని చెప్పగూడ"దని యప్పుడే జెప్పెను. "ఇట్లాజ్ఞాపించుటకు గారణ"మేమని విలేఖరియడిగెను. 'మాస్కోనగరమందు ఇండ్లు తక్కువగానున్నవి కావున నిట్టిస్త్రీలు వేరేచోటనుండుటకు వసతిలేదు. కావున మనస్సుకలువనందున స్త్రీపురుషులు నడుమ తెరవేసికొని వేరుగానుండవచ్చు'నని యాస్త్రీరిజిష్ట్రారు బదులుచెప్పెను. ఇచ్చట సర్వత్రయిట్టిస్థితియే కలదాయని విలేఖరి మళ్ళియడిగెను. "అవును. కావలసినన్నియిండ్లు లేనందున ననేకస్త్రీపురుషులు వివాహవిచ్ఛేదము చేసికొనినతర్వాతనుగూడ గదిలో మధ్య తెరవేసికొని కాలముగడుపుచుందురు. ఈమధ్యలో బురుషుడు మళ్ళివివాహము చేసికొనినచో దన నూతనభార్యతో దనభాగములోనే యుండును. స్త్రీ పునర్వివాహము చేసికొనినచో దనపిల్లలతో నూతనభర్తయింటికి వెళ్ళిపోవును."




**చచ్చి పైలోకమునకుపోయి తిరిగి భూలోకమునకు వచ్చుట:—**

దక్షిణహైదరాబాదునందు 80 ఏండ్లుగల ఒక మహమ్మదీయస్త్రీకి జ్వరముతగిలెను. అదితుదకు ప్లేగుగాపరిణమించెను. ఊపిరికట్టుపడిపోయెను. వైద్యుడు లాభములేదనెను. సాయంత్రము ఆమె మరణించెను. తోడనే ఆశవమునకు చీమలుపట్టెను. మఱునాడుదయము ఆమెను పాతిపెట్టుటకు సమాధిగోయి త్రవ్వించిరి. పాతిపెట్టుటకుముందు ఆశవముపై కప్పబడినబట్ట ఒత్తగింపబడెను. అప్పుడాశరీరమున చలనము ప్రారంభమాయెను. కొద్దిసేపటికి ఆమె మాటలాడకలిగెను. దాహమువేయగా ఆమెకు మంచినీరిచ్చిరి. ఆనీటినిత్రాగి కోల్కొని ఆమె తనమరణానంతరవృత్తాంతమును ఈరీతినివివరించెను: "రాత్రి నేను పైలోకములోనికి తీసికొనిపోబడితిని. అక్కడ ఒకపెద్దగంగాళము ఉన్నది. లెక్కకుమీరిన మనుష్యులందు త్రోసివేయబడుచుండిరి. నన్నుకూడ అందుత్రోసివేయుటకే ప్రయత్నములు సాగినవి. కాని ఇంతలో నొకపెద్దవ్యక్తి 'ఇంకను జీవితముండగా నీమెనేలగొనివచ్చితిరి?' అని ప్రశ్నించెను. అప్పుడు నేను ఆప్రదేశమునుండి సమాధిలోనికి తీసుకొనిరాబడితిని. ఆసమాధిలో నాకుబంధువులెందఱో యగుపించిరి. కాని వారెవరును నాతో ముచ్చటింపలేదు. కాని అచ్చటకూడ నాకుతావులేదని నిర్ణయింపబడుటచే నేనక్రిందికి త్రోసివేయబడితిని." ఈవృత్తాంతముజరిగి ఎన్నియోదినములుకాలేదు. ఇందు అసత్యమెంతమాత్రమును లేదు. చచ్చిబ్రతికిన వృద్ధస్త్రీ ఇప్పటికిని ఆరోగ్యముగ తిరుగుచున్నది. ఆలోకమున గంగాళములో త్రోసివేయబడుసమయమున ఆమెకు తగిలినదెబ్బలు భూలోకమునందలి ఆమె పూర్వపువైద్యుడేకుదిర్చెను. ఆశ్చర్యకరమగు ఈవృత్తాంతమువంటిదే మఱియొకటి ఈనడుమ బ్యాంకురానుండివినవచ్చుచున్నది. శ్రీమతి కరాళిదేవికి ఇరువదివత్సరముల వయస్సు. విష్ణుపురమునకు చెందిన బాబుకాళిపాదబెనర్జీగారి భార్య. ఆమెకు హిస్టీరియావ్యాధి కనిపించెను. ఇట్లు మూర్ఛలతో తీసుకొనుచుండగనే ఆమెప్రసవించెను. పుట్టినతోడనే బిడ్డచనిపోయెను. తల్లికి వైద్యునిచే మందిప్పించుటకు ప్రారంభింపబడెను. ఒకనాటిరాత్రి రెండున్నరగంటలకు ఆమెమరణించినట్లునిర్ణయింపబడెను. అంతట ఆమెబంధువులకు వార్తలంపబడెను. కొన్నిగంటలకు వారువచ్చిరి. వలయుపరికరములను గూర్చుకొని శవమును దారకేశ్వరనదీతీరమునకున్న శ్మశానమునకు గొనిపోయిరి. చితిపేర్చబడెను. సత్తకట్ల సవారీమీదనున్న శవమును చితిపైనుంచుటకు శవముపైగుడ్డ కొద్దిగతొలగింపబడెను. శవమును ఎత్తిరి. అప్పుడాశవము దీర్ఘశ్వాసము గొనుచున్నట్లు తెలియవచ్చెను. ప్రాణమునిలిచియున్న సూచనలుగానవచ్చెను. చితిపై ఎక్కించనున్నశవమును అచ్చటి ఇసుకతిన్నెపై పెట్టుకొని వారువేచియుండిరి. కొంచముసేపటికి ఆమె దగ్గెను. అప్పుడు ఆమెనోటిలో మంచినీళ్లుకొంచముపోసిరి. ఆమెగుటకవేసెను. ఈవార్తవెంటనే గ్రామములో అల్లుకొనెను. జనము ఈవింతచూచుటకు విఱుచుకొనివచ్చిరి. మంచినీళ్లీయగా ఆమెస్వయముగ

త్రాగెను. మరికొన్ని నిముషములకు ఆమె సన్ననిఎలుగుతో సంభాషింపదొరకొనెను. ఎండను సహింపజాలకున్నానని ఆమె తెలిపెను. వెంటనే ఒకమంచముగొనివచ్చి ఆమెను దానిమీదపండుకొనబెట్టి ఇంటికికొనివచ్చిరి. ఆమె ఇప్పుడు కులాసాగానేయున్నది, కాని నేత్రాపరోధము కలిగినది. మరణదృశ్యమును ఆమె తనబంధువులకిట్లు చెప్పినది: "ఆరుసంవత్సరముల క్రితము చనిపోయిన నాపినతల్లి నాకడకువచ్చి తనవెంట ఒకరమ్యస్థలమునకు రమ్మనిచెప్పినది. నేనందుమీద ఆమెవెంట వెడలితిని. వెళ్లివెళ్లి ఒకానొక కారుచీకటిప్రదేశమును చేరితిమి. అప్పుడమ్మ నాపినతల్లినాకుకనిపించలేదు. నేను పెద్దపెట్టున ఏడ్చితిని. అంతలో కొన్నిచీకటిరూపములు నాకు గనిపించినవి. అవి 'ఈమె ఇక్కడ ఎందుకున్నది? కావలసినది ఈమెకాదే!' అన్నవి. అప్పుడుఅవివెంటనే ఆక్కడనుంచి నన్ను తఱిమివేయుచున్నట్లు తెలిపికొంటిని."

# ప్రజోత్పత్తిసంచికలు

## సుధ వార్షికసంచిక:—

ఈ సంచికలోని వ్యాసములందు శ్రీ కవికొండల వేంకటరావుగారి 'పెనుమంచలి జైనుదేవుడు' తలమానికముగానున్నది. లలితమైనహాస్యము, గూఢమైన భావమును అత్మసంగతములై వ్యాసమునకు అందముతెచ్చినవి. వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి 'దీర్ఘజీవనసాధనము' ఋతుచర్యాపద్ధతిననుసరించుచు పఠనీయమై సంచికవిలువను రెట్టించుచున్నది. శ్రీసహదేవ సూర్యప్రకాశరావుగారి 'వకుళమాల' ప్రచురింపబడిన పద్యవ్యాసములలో ఉత్తమముగానున్నది. దానికి అర్థవ్యాఖ్యానమీయబడలేదని మాతలంపు. శ్రీపురిపండా అప్పలస్వామిగారి 'అనార్కలీ'అను పద్యవ్యాసము మనోహరముగనున్నది. శ్రీ జెంపటి నాగభూషణముగారి 'పాటకచ్చేరి'అను కథపఠింపదగియున్నది. శ్రీగుడిపాటి వెంకటాచలంగారి 'అమీనా'అనుకథ అసభ్యముగను, అనుచితవాక్యములకు నిలయముగను ఉన్నది. అందలికొన్నికొన్ని తావులు అరోచకమును పుట్టించుచున్నవి. అసభ్యములగు ఇట్టికథలకు ప్రచురణమిచ్చుటలో పత్రికాధిపతుల ఉద్దేశ్యమేమియో తెలియరాదు. 'భారతీయుడా! నీదేభాగ్యము' అనుసంపాదకునివ్యాసము భారతకీర్తిని స్మరణకు దెచ్చునదిగానున్నది. 'అమీనా'వినా ఇందలి ఇతరవ్యాసములు పఠనార్హములై సంచికను ఉపయోగముకలదానినిగా నొనర్చుచున్నవి. సంపాదకులు: వై. కుటుంబరావు, యస్.జి. ఆచార్యగార్లు. రాయలుసైజు దాదాపు 100 పుటలు. ఫైదరువెయిటు కాగితములు. రెండుచిత్రములు. వెలయువారు సుధాకార్యాలయము, పోష్టుఆఫీసు బాక్సు నెంబరు 287, మదరాసు అనుచిరునామాకు వ్రాయునది.

## ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక:—

ఆంధ్రపత్రిక ఇరువదిరెండవ సంవత్సరాదిసంచిక. త్రివర్ణచిత్రములారు. ఇందు శ్రీచామకూర సత్యనారాయణగారి 'అభిసారిక'అనుచిత్రము సుందరతరము. శ్రీమతి గౌరిదేవిగారి 'గొల్లకాపరి'అనుచిత్రము చూడతగియున్నది. గద్యవ్యాసములలో చా. వెం. హనుమంతరావు (యమ్.ఏ;బి.ఇ.డి.)గారి 'ప్రజాస్వాతంత్ర్య పరిపాలనము: దానికిగల ప్రతిబంధకములు'; కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారి 'స్వభావోక్తి'; బండారు తమ్మయ్యగారి 'పాలకురికి సోమనాథకవి: పంచప్రకారగద్య'; విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి 'ప్రయోగవిశేషవివరణము: నిర్వచనోత్తరరామాయణము'; ముద్దా విశ్వనాథంగారి 'దేశమా? ప్రాణమా?'; నేలటూరి వేంకటరమణయ్య (యమ్.ఏ;పి.హెచ్.డి.)గారి 'తెనాలిరామకృష్ణకవి'; సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారి 'కళింగదేశము'; శ్రీ శేషాద్రిరమణకవుల 'కాకతీయరాజులు'

అనువ్యాసములు పేర్కొనదగినవి. 'సనాతనధర్మవాదులు' అను వల్లూరి సూర్యనారాయణరావు (బి.ఏ. బి.ఎల్) గారి వ్యాసమును; 'వివాహవిచ్ఛేదకశాసనము' అను అయ్యదేవర లక్ష్మీనరసింహముగారి వ్యాసమును ఆలోచనను రేపుచున్నవి. శ్రీవిక్రమదేవవర్మగారి 'స్త్రీవిద్యావిధానము' అనువ్యాసము స్త్రీవిద్యాభిమానులు చదువదగియున్నది. పద్యవ్యాసములలో పండిత శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'సౌత్రాపసము' ముచ్చటగనున్నది; జిజాషువకవిగారి 'ఫిరదౌసి' ధారగలిగియున్నది; కీ. శే. పెనుమర్తి వేంకటరత్నముగారి 'విశ్రాంతి' గభీరభావవిలసితముగనున్నది; శ్రీతురగా వేంకటరామయ్యగారి 'దొరవు నీవయ్యెదవురా!' అను చక్కని గేయము జాతీయభావప్రేరితమైయున్నది; వేంకటకాళిదాసకవుల 'మొంగలిరేకు' మనోజ్ఞముగనున్నది. సంచికయందలి తుదిపుటలలో ముద్రింపబడిన వడ్డాది సుబ్బారాయడుగారి 'భక్తచింతామణి' పద్యములు తొలిపూజలందదగియున్నవి. ఈసంచికయందు నాలుగు స్త్రీవ్యాసములు ప్రచురితములు. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి 'పాతివ్రత్యసతీత్వము' విమర్శకవ్యాసము; శ్రీమతి అద్దంపూడి అన్నపూర్ణమ్మగారి 'వింతవిశాలాక్షి' కథావ్యాసము; శ్రీమతి పి. పూర్ణమ్మగారి 'నేనెవరో' అనునది వేదాంతవిషయికవ్యాసము; శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారి 'రాత్రి' పద్యవ్యాసము. ఇట్లు వివిధవిషయములకు చెందినవ్యాసములు వ్రాసి నేటిఆంధ్రవిదుషీమణులబుద్ధి వివిధవిషయములం దెట్లువ్యాసంగము చేయుచున్నదో ఈవ్యాసకర్త్రులు వెల్లడించియున్నారు. శ్రీకృష్ణజన్మస్థానము కేగిన భారతస్త్రీపురుషుల ఛాయాచిత్రములతోడను, శ్రీ తలిశెట్టి రామారావుగారి వ్యంగ్యచిత్రములతోడను, రౌండుటేబిలుసభాప్రతినిధుల ఛాయాచిత్రములతోడను సంచిక పిక్కటిల్లియున్నది. 'ప్రస్తావన' గతవత్సరపు వృత్తాంతములనెల్ల ప్రస్తావించుచు పఠనీయమైయున్నది. సంచిక డబుల్ డెమ్మి సైజున 300 పుటలు. వెల దినపత్రిక సంవత్సరచందాదారులకును రు 1-0-0; దినపత్రికసంవత్సరపు తక్కువ చందాదారులకును, వారపత్రిక చందాదారులకును రు 1-4-0; ఇతరులకు రు 2-0-0. వి. పి. ఖర్చులు ప్రత్యేకము. దొరకుచోటు: ఆంధ్రపత్రికాకార్యాలయము; 7, తంబుశెట్టివీధి, మదరాసు.

# గ్రంథపరిచయము

**వీరకాంతలు:—**

గ్రంథకర్త వడ్లమూడి వేంకటరత్నముగారు. క్రౌనుసైజున 100 పుటలు. వెల ఆఱణాలు. ఇది ఈగ్రంథముయొక్క ప్రథమభాగము. ఇందు కలావతి, దేవల్ దేవి, దాహిరుకన్యలు, పద్మ, చంద్రకళ, జయమతి, కోటారాణి, గన్నోరురాణి, అర్గల్ రాణి అను తొమ్మండుగురు వీరవనితారత్నముల రమ్యచరిత్రములు గానముచేయబడినవి. కలావతి, దాహిరుకన్యలు, జయమతి ఈముగ్గురిచరిత్రలును విశేషము ఉత్తేజము పుట్టించునవిగనున్నవి. శైలి సులభసుందరము. స్త్రీ లాదరింపదగిన ఉత్తమగ్రంథము. ఈగ్రంథముయొక్క మిగతాభాగములనుకూడ సాధ్యమైనంతత్వరలో ప్రచురించి స్త్రీజనపఠనార్హములగు గ్రంథములు విశేషముగ లేనిలోపమును తెలుగుతల్లికి తీర్తురుగాకయని గ్రంథకర్తగారిని హెచ్చరించుచున్నాము. దొరకుచోటు: కులలక్ష్మీకార్యాలయము; తెనాలి; గుంటూరు జిల్లా.

**కీర్తనలు:—**

ప్రథమభాగము. గ్రంథకర్త్రి చోడవరపు రంగనాయకమ్మగారు. గ్రంథమున గ్రంథకర్త్రి ఛాయాచిత్రముగలదు. క్రౌనుసైజున 96 పుటలు. వెల 0-8-0. దొరకుచోటు: చోడవరపు వేంకటశేషగిరిరావుగారు, మైదాన్ వ్యూ, కొత్తపేట, గుంటూరు. గానప్రియులగు స్త్రీలీగ్రంథమును చక్కఁగ నుపయోగించుకొన

గలరు. వినాయకుడు, సరస్వతి, పార్వతి మొదలగు దేవతలస్తుతించుకీర్తనలు, భక్తిరసపోషకములగు కీర్తనలు ఈగ్రంథమున నిండారియున్నవి.

### శ్రీరాముని వైరాగ్యము:—

గురుప్రబోధము. గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మగారు. ఈగ్రంథము గాంధిమహాత్మునకు అంకితమీయబడినది. శ్రీరామునివైరాగ్య మను పేరబరుగు ఈగ్రంథమునందలి ఇతివృత్తము జ్ఞానవాసిష్ఠ రామాయణమునుండి సంగ్రహింపబడినది. 'భక్తిజ్ఞానవైరాగ్యశాశ్వతసౌఖ్యంబులఁజెందఁ' బామరులు పఠింప వలసినగ్రంథము. డెమ్మీసైజున 30 పుటలు. వెల 0-8-0. గ్రంథముదొరకుచోటు: బి. హెచ్. యన్. శర్మ గారు, ప్రొప్రయిటర్, వేగుచుక్క గ్రంథమాల, పూడిపెద్దివారివీధి; బరంపురము; గంజాం జిల్లా.

### యోగచికిత్స:—

మనశ్శరీరక్రియలద్వారా రోగరహితముఁజేయు సుగమోపాయము లీగ్రంథమున తెలుపబడినవి. ఇయ్యది వైదికవిద్యార్థియగు పాలడుగు శేషాచలమార్యునిచే నాంధ్రీకరింపబడినది. మూలము స్వామివిజ్ఞాన భారతివిరచితము. గ్రంథము క్రౌనుసైజున 36 పుటలు. వెల 0-4-0. దొరకుచోటు: ఆర్యయువకసమితి, ఎలమర్రు, కృష్ణాజిల్లా.

### శ్రీవీరేశలింగ సంస్మృతి:—

శ్రీసత్యసంవర్ధనీగ్రంథమాల ప్రథమకుసుమము. గ్రంథకర్త రాయసము వేంకటశివుఁడుగారు ఎం.ఏ., ఎల్.టి. 1888-వ సంవత్సరమునుండి 1902-వ సంవత్సరమువఱకును పిమ్మటకాలమునను గ్రంథకర్తగారు వ్రాసియుంచిన దినచర్యపుస్తకములు, పంతులుగారు తదితరులును వారికి వ్రాసినజాబులు, 1891-వ సంవత్సరము జూలైమాసములో వీరేశలింగముపంతులు, వేంకటశివుఁడుగార్లచే స్థాపింపఁబడి కొన్నిసంవత్సరములు ప్రచురితమైన 'సత్యసంవర్ధని' పత్రికసంపుటములు, 1894-వ సంవత్సరమున వేంకటశివుఁడుగారిచే ప్రారంభింపబడి 1904-వ సంవత్సరమునుండి పంతులుఁ, వేంకటశివుడుగార్ల సంపాదకత్వమున సుమారొకసంవత్సరము ప్రచురితమైన 'జనానాపత్రిక' సంపుటములు మొదలగు వానిసహాయమున చేయబడిన వీరేశలింగముగారిని గూర్చిన ఆంతరంగికవిమర్శ ఈగ్రంథము. ఇట్టి గ్రంథరచనము తెనుగునక్రొత్త. వీరేశలింగముగారి మొక్కవోని కార్యదీక్ష, పట్టుదల, కోపము మొదలగు గుణములను ప్రదర్శించుటకుతోడు ఈగ్రంథము ఆనాటి తెలుగు నాటి సంఘసంస్కరణోద్యమము, పత్రికాప్రకటనము మొదలగు విషయములనుగూడ వివరించుచున్నది. గాథలు అనుప్రకరణము ప్రత్యేకముచదువదగినది. ఆంధ్రులాదరింపదగిన గ్రంథము. క్రౌనుసైజున 160 పుటలు. వెల రు 0-8-0. వలయువారు ఏతద్గ్రంథకర్తగారిపేర గుంటూరుగాని భీమవరముగాని లేక రాయసము సోదరులు : గుంటూరు, భీమవరము, లేక నరసాపురము అనిగాని వ్రాసికొనవలయును.

### రణతిక్కన:—

గ్రంథకర్తలు కేసరి సుందరరామశర్మ, దేహారం రామబ్రహ్మశర్మగార్లు. పుటలు 16. వెల 0-1-6. ఈ చిన్నిపొత్తమున మానమునకై ప్రాణమును తృణప్రాయముగానొడ్డి, పరాక్రమమున భీష్మ, ద్రోణ, కృపాచార్యాశ్వత్థామల మఱపించిన ఆంధ్రవీరపుంగవుడు రణతిక్కన వీరజీవితము వివరింపబడినది. అతనికీర్తిని గానముచేయు చాటుపద్యములు గ్రంథమున ఉదాహరింపబడినవి. దొరకుచోటు: కేసరి సుందరరామశర్మ, సంస్కృతకళాశాల, మూలప్పేట, నెల్లూరు.

## డైరి

### మార్చి

24:—మదరాసులో శ్రీమతి కౌసల్యాబాయి అను నామె మరికొందరు స్త్రీ వాలంటీర్లతో సిద్దంగివీధి లోని కొన్నిబట్టల దుకాణములవద్ద పికెటింగు జరుపుచుండెను. ఈమె భోలానాథ్‌గుప్త అనునొక ప్రముఖుడగు సావుకార్ పేటవర్తకుని భార్య. హాజీహకీంమహమ్మద్ అబుల్ అజీజ్ అనునొక మహమ్మదీయవర్తకునిదుకాణములోనికి ఇద్దరు అరవస్త్రీలు పోవుచుండిరి. అదిచూచి కౌసల్యాబాయి వెంటనే వారి దగ్గరకుబోయి విదేశీవస్త్రములను కొనవలదని ప్రార్థించెను. వారు తాము సరుకుకొనుటకు పోవుటలేదనియు తమ ప్రాతబాకీ చెల్లించుకొనుటకు పోవుచుంటిమనియు చెప్పిరి. అందుపై నామె వారిని లోనికిబోనిచ్చి వెలుపలనుండి చూచుచుండెను. వారు బాకీచెల్లించుటకు మారుగ క్రొత్తబట్టలను కొనుచుండిరి. అదిచూచి యామె "విదేశవస్త్రములను మీరెందుకు కొనవలయును? అంతచౌకకు స్వదేశీగుడ్డలుగూడ దొరకుచున్నవే. ఆవిదేశీగుడ్డలు వాలంటీర్లరక్తముతోను, స్త్రీలకన్నీటితోను తడిసియున్నవి" అనిచెప్పెను. ఇదియంతయు చూచుచుండిన ఒక ముసలితురక ఆమె దగ్గరకువచ్చి ఆమెను మెట్లపైనుండి మెడబట్టి గెంటివైచెను. ఆమె దీనికేమాత్రమునుకోపగించుకొనక "నాదేశమునకై ప్రాణముల నర్పించుటకు నేనుసిద్ధముగనున్నాను. నన్నవమానించుటలో నీవేమి చేయుచున్నావో నీకే తెలియదు. భగవంతుడు నిన్ను క్షమించునుగాక. నేనీ యవమానములకు భయపడను" అనెను.

25:—

26:— పెషావరులో సర్దారు భగత్ సింగు ప్రభృతుల ఆత్మశాంతికై 'చౌతా' ప్రార్థనలు జరుపబడెను. హిందూ, ముసల్మాను, సిక్కు స్త్రీలు పాల్గొనిరి.

27:—

28:—

29:—కరాచిలో స్త్రీలందరుగలసి శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారియధ్యక్షత నొకసభజరిపిరి. స్త్రీ వాలంటీరుదళమును నియమించుటకై ఉపసంఘమొకటి యేర్పరుపవలెనని సభవారు తీర్మానించిరి.

30:—బందరులో శ్రీమతి భోగరాజు రాజేశ్వరమ్మగారు మొదలగువారు విదేశవస్త్రదుకాణములవద్ద పికెటింగుచేయ ప్రారంభించిరి.

31:—భీమవరములో విదేశవస్త్రముల దుకాణములవద్ద శ్రీమతులు కోటమర్తి కనకమ్మ, హద్దనూరి సుందరమ్మగార్ల ప్రోత్సాహమున సుమారిరువదియైదుమంది క్షత్రియస్త్రీలు తమ గృహములను విడిచివచ్చి పికెటింగుచేయ ప్రారంభించిరి.

### ఏప్రియలు

1:—బెజవాడలో విదేశవస్త్రముల కొట్లవద్ద స్త్రీలు పికెటింగు ప్రారంభించిరి.

2:—గుడివాడలో శ్రీమతులు దుగ్గిరాల కమలమ్మ, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగార్లు విదేశవస్త్రపు దుకాణములవద్ద పికెటింగు ప్రారంభించిరి.

3:—

4:—మంగుళూరులో విదేశవస్త్రముల పికెటింగుస్త్రీలు ప్రారంభించిరి. ప్రతిదుకాణమువద్ద ఇరువురుస్త్రీల చొప్పున ముఖ్యమయిన దుకాణములన్నింటివద్దను స్త్రీలుగలరు.

5:—తిరువల్లిక్కేణి గంగయికొండా మండపమునందు స్త్రీల స్వదేశీసంఘము యాజమాన్యమున స్త్రీలసభ జరిగెను.

6:—మీరాబెను (స్లేడుకన్య: మహాత్ముని ఆంగ్లేయశిష్యురాలు) కరాచిలో స్ఫోటకమువచ్చి మునిసిపలు ఆస్పత్రియందు చికిత్స నొందుచున్నది.

7:—తిరువల్లిక్కేణిలో పైక్రాఫ్ట్సురోడ్డునందు స్టోర్సులవద్ద స్త్రీలు శాంతియుతముగ పికెటింగు సలిపిరి.

8:—కరాచికాంగ్రెసునుండి వెళ్లుచుండిన అఖిలభారతజాతీయమహాసభోపసంఘసభ్యురాలగు శ్రీమతి వేదాంతం కమలాదేవిగారికి కళ్యాణినగరాంధ్రులు సన్మానమొసంగిరి.

:—గుడివాడతాలూకా బొమ్మలూరులో చెరసాలనుండి వచ్చిన సత్యాగ్రహులకు స్వాగతముచేయుటకు స్త్రీలసభ జరిగినది. శ్రీమతి కమలమ్మగారు అధ్యక్షతవహించిరి. శ్రీమతులు ఆరికపూడి వెంకట రామమ్మ, పుష్పవతి రామబ్రహ్మమ్మ, సీతామహాలక్ష్మి, శకుంతల, సౌభాగ్యమ్మ, పర్వతనేని రాజ లక్ష్మమ్మగార్లు ఉపన్యసించిరి.

10:—పంజాబునాయకుడగు మౌలానాజఫరలీఖాంగారు బొంబాయి స్త్రీలసభలో నిట్లుపన్యసించిరి: 'కాంగ్రెసు ఉద్యమముపట్ల స్త్రీలు ఉత్సాహముతో పనిచేసి దేశమునకు గొప్పమేలుకలుగజేసిరి. స్త్రీలు ఈవిధమున విరివిగ ఉద్యమమునందు చేరిపనిచేయకున్న ఉద్యమము విజయముగాంచియుండదు.'

11:—మద్రాసు తిరువల్లిక్కేణి పార్థసారథిస్వామి దేవాలయము ఎదుట శ్రీమతి టి. ప్రకాశముసతీగారి యాజమాన్యమున దేశసేవికలు పతాకవందనోత్సవముజరిపిరి.

12:—శారదాచట్టమునుబోలినవివాహచట్టమును మైసూరుశాసనసభలో సర్ పుట్టణ్ణచెట్టిగారు ప్రవేశపెట్టిరి. ప్రజాభిప్రాయార్థము దానిని ప్రభుత్వమువారు ప్రకటించిరి.

13:—శ్రీమతి కమలాదేవిచటోపాధ్యాయగారు తిరుచునాపల్లిలో నుపన్యసించిరి.

14:—మైసూరురాష్ట్రములో జరిగిన రెండుబాల్యవివాహముల కేసులను మైసూరుజిల్లా మేజస్ట్రేటు విచారణ చేసెను. ఒకపెండ్లికొమార్తె వయస్సు 5 సంవత్సరములు; రెండవదామెవయస్సు 7 సంవత్సరములు. ఈవివాహములకు కారణభూతులైన తండ్రులును, పురోహితులును శిక్షింపబడిరి. ఒక్కొక్కరికి రు500 లు జరిమానావిధింపబడెను.

15:—శ్రీమతి సరోజినీనాయుడుగారు నిన్నసాయంత్రము బొంబాయిచేరిరి. హిందూమహమ్మదీయ సమస్యా పరిష్కారార్థమై ఆమె తన యావచ్ఛక్తిని వినియోగింప నిశ్చయించెను.

16:—అంగలూరులో శ్రీమతులు ఎర్నేని వెంకట్రామమ్మ, ఎర్నేని నాగభూషణం, కొసరాజు కనకరత్నమ్మ, ఆరికపూడి సగుణమణి, వట్టా మల్లికాంబ, తిపిర్నేని భాస్కరాంబ, తిపిర్నేని అనసూయ, విజయలక్ష్మి, ఎర్నేని లీలావతి, వల్లభనేని మోహనమ్మగార్లు కల్లుసారాదుకాణముల పికెటింగు ప్రారంభించిరి.

:—సికింద్రబాదులో కనకమ్మగారనెడి ఆంధ్రయువతి బ్రిటిష్‌అధికారముగల ప్రదేశమునందుగల సారా దుకాణములవద్ద పికెటింగుచేయుచుండ అరెస్టుచేయబడెను. అచట 144-వసెక్షను అమలులోనున్నది. చట్టమునతిక్రమించుటచే ఆమె అరెస్టుచేయబడెను. కనకమ్మగారును ఆమె చిన్నకుమార్తెయును లాకప్‌లో నుంచబడిరి.

17:—

18:—

19:—మదరాసు కులాల స్త్రీలసభ గోవిందప్పనాయునివీధి నెం 80 గృహములో డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షతను జరిగెను.




**న్యాయవాదిని న్యాయశాస్త్రోపాధ్యాయినిగ నియమింపబడుట:—**

శ్రీమతి మిథిలాబాయి అర్దేషిర్ తాతాకన్య బొంబాయినివాసిని. ఆమె బ్యారిష్టరు పరీక్షలో విజయమునుబడసినది. బొంబాయిహైకోర్టులో న్యాయవాదినిగ ప్రాక్టీసుచేయుచున్నది. ఆమె ఇప్పుడు బొంబాయిన్యాయకళాశాలలో న్యాయశాస్త్రోపాధ్యాయినిగ నియమింపబడినది. ఇట్టి ఉద్యోగమునుపొందుటకు భారతస్త్రీలలో మిథిలాబాయి అర్దేషిర్ తాతాకన్యయే ప్రథమురాలు. ఆమెకు మాఅభివాదములు.

**ఇడారు సంస్థానములో బాల్యవివాహనిరోధక శాసనము:—**

మహీకాంతఏజెన్సీలోనున్న ఇడారు సంస్థానపరిపాలనసంఘాధ్యక్షుడు ఖానుబహదూరు ఫ్రామ్‌రోజుమాస్టరు స్టేటుగెజెట్టులో నీప్రకటనముగావించెను: "ఇడారు శాసనసభవారు చిరకాలము క్రితము ఆమోదించిన బాల్యవివాహనిరోధకచట్టము మేమాసము ౧-వ తేదీనుంచి సంస్థానమునందు అమలులోనుండును. బాలికలకు పంద్రెండుసంవత్సరములును, బాలురకు పదునేడుసంవత్సరములును నిండినపిమ్మటగాని ఇక వివాహములుచేయరాదు. నలుబదియైదేండ్లకుపైబడిన పురుషుడు తనవయస్సులో సగమునకు పైబడినస్త్రీనిమాత్రమే పెండ్లియాడుటకు అనుమతింపబడును. చట్టమునతిక్రమించువారు 500 రూపాయిలవఱకు నుండగల జరిమానాకుగాని, మూడుమాసములవఱకు నుండగలవిడిఖయిదునకుగాని, లేక రెంటికినిగాని గుఱియగుదురు. ప్రత్యేకమైన వివాహాచారములుగల కాద్వాకున్బిన్ జాతివారికి ప్రత్యేకసౌకర్యములు గలిగింపబడినవి. శాసనము అమలులోనికివచ్చిన ఆఱుమాసములలోపుగ రహితముకావింపబడు వివాహముల విషయమునగూడ ప్రత్యేకసౌకర్యములు చేయబడినవి." బ్రిటీషుఇండియాలోని బాల్యవివాహనిరోధకశాసనముకంటె ఈశాసనమునందు కొన్ని మెలుకువలు ఏర్పరుపబడినవి. వివాహోచితవయస్సు పంద్రెండువత్సరములనుటచే పూర్వాచారపరాయణుల ప్రతిబంధకము విశేషముగనుండజాలదు. అదియునుగాక ముదుసలులు తమవయస్సులో సగమువయస్సుకు తగ్గినవారిని పెండ్లియాడుట కిక్కడవీలు

లేదు. ఇదియొక క్రొత్తమెలుకువ. ప్రత్యేకముగగావింపబడిన సౌకర్యములు మూడవమెలుకువ. ఇవి మిక్కిలి ప్రశంసనీయములు. బాల్యవివాహదురాచార మిట్లు స్వదేశసంస్థానములనుండిగూడ తఱిమివేయబడుచున్నది. గ్వాలియరు, బరోడా, మండీ, కాశ్మీరము ఈసంస్థానములందు బాల్యవివాహనిరోధకశాసనము అమలులోనున్నది; మైసూరుసంస్థానమున గొనివచ్చుటకు సర్ కె. పుట్టన్న శెట్టిగారు పూనుకున్నారు; హైదరాబాదుసంస్థానమునగూడ నిట్టి శాసనప్రవేశమునకు ప్రయత్నములు సాగుచున్నవనివిందుము. సేతుశీతనగవ్యాప్తమైన భారతదేశములో బాల్యవివాహదురాచారము కాలునిలుపగలతావు సూదిమొనయంతేని లేకుండు శుభదినములు శీఘ్రముగవచ్చుగాకయని కోరెదము.

### వరశుల్కదురాచారమును భంజించుటకు శాసనము:—

బరోడాసంస్థానశాసనసభాసభ్యులగు శ్రీయుత బాపుభాయిదేశాయిగారు బరోడా శాసనసభవారికి వరశుల్కదురాచారభంజకమగుశాసనము శాసనసభలో ప్రవేశపెట్టుటకు నోటీసునిచ్చినారు. వరుడుగాని, వరునిసంరక్షకుడుగాని వరకట్నమును కోరినను, పుచ్చుకొనినను ఆఱుమాసములవఱకు ఉండగల విడికైదుకుగాని, అయిదువందలవఱకుగల జరిమానాకుగాని లేక రెంటికిగాని గుఱియగుదురు. భారతదేశమునందలి ఎన్నియోసంసారముల చరిత్రలు ఈవరశుల్కదురాచారముమూలమున దుఃఖకలుషితములగుచున్నవి; వంశమభ్యుద్ధరింపగల స్త్రీలజీవితములు యౌవనాశామృదుపుష్పవికసనమునకు నోచకనే వృంతచ్యుతములగుచున్నవి. కావున శాసనఖడ్గమునుపయోగించియైనను ఆదురాచారమును నరికివేయుట వాంఛనీయమే. బ్రిటీషుఇండియాలోగూడ నిట్టిశాసనము శీఘ్రముగగొనిరాబడుగాకయని ఆశించుచున్నాము.

### మహాత్యాగము:—

"ఇది ముప్పది సంవత్సరముల క్రితము జరిగినవిషయము. జపానుదేశమునందలి క్యోటోనగరమున నొకపెద్దదేవాలయము అగ్నివలనభగ్నమయ్యెను. దానిని పునరుద్ధరించుటకు ప్రయత్నములు నడచినవి. బ్రహ్మాండమగు కొయ్యదూలములు పైకికొనిపోవలసియుండెను. దేశమునందలి ఎట్టిపగ్గములును, ఎట్టిమోకులును ఆపెద్దకొయ్యదూలములను పైకిలాగుటకుసమర్థములు కాకపోయెను. ఆదూలములను పైకి ఎక్కించుప్రయత్నములలో ఎంజినీర్లు ఎంతతికమకలుపడినను ఏమియులాభములేకపోయెను. మానవుని వెండ్రుకలతో పేనబడినపగ్గములు ఈదూలములను పైకిలాగుటకు ఆగగలవని ఒక ఎంజినీరుకనిపెట్టెను. అందుమీఁద అట్టిపగ్గముచేయుటకు తమశిరోజములనర్పింపనిచ్ఛగించుస్త్రీలు వానిని తమకుపంపవలయునని విజ్ఞప్తులను ప్రచురించిరి. ప్రచురించుటతోడనే జపానుదేశమునందలి నాలుగుమూలలనుండి స్త్రీలు తమశిరోజములను కత్తిరించి వానితోమోకుచేయుటకు పంపిరి. జపానుస్త్రీల శిరోజసంపద అద్వితీయము. వారు దానిని గర్వముతో తిలకింతురు. అయినను

వారు తమదేశమాతకు తిలకముగనుండగల దేవాలయముయొక్క సుందరనిర్మాణమునకు తమ సౌందర్యసాధనములలో ముఖ్యమైనదగు శిరోజసంపదను సమర్పించినారు. ఈవిషయము నాకు మనకందఱకు చిరపరిచితురాలగు శ్రీమతి కజిన్సుసతిగారు చెప్పినారు. ఇతర దేశపుస్త్రీ లిట్టిమహాత్యాగము నొసర్చుచుండగా త్యాగరాశులగు భారతస్త్రీలు దేశము కొఱకు త్యాగముచేయుటలో వెనుకంజవైతురని నేననుకొనను." అని శ్రీమతి అమ్ముస్వామినాధనుసతిగ్గారు కేరళనాయరుమహిళాసభలో తమ అధ్యక్షకోపన్యాసమున చెప్పిరి.

స్త్రీల ఇండియా సంఘనివేదిక:—

స్త్రీల ఇండియాసంఘమువారి 1930-1931 సంవత్సరపు కార్యనివేదిక విమర్శనార్థము మాకార్యాలయమునకు బంపబడినది. భారతదేశమున స్త్రీల అభ్యుదయార్థము విశేషప్రయత్నముచేయుచున్న పెద్దసంఘములలో మదరాసునందలి స్త్రీల ఇండియా సంఘము పేర్కొనదగినది. కాశ్మీరముమొదలు కన్యాకుమారివఱకును గల వివిధప్రాంతములందు ఈసంఘమునకు బ్రాంచీలుగలవు. తెలుగుదేశమున అనంతపురము, బళ్లారి, బెజవాడ, చిత్తూరు, చికాకోల్, మదనపల్లి, నరసాపురము, నెల్లూరు, రాజమండ్రి, గుంటూరు, విశాఖపట్టణములయందు బ్రాంచీలుగలవు. మద్రాసునందలి ఈసంఘకార్యస్థానము ఎగ్మూరునందలి ప్యాంథియన్‌గార్డెన్సునందుగలదు. నివేదితవత్సరమున ఈసంఘమువారి ఆదాయము రు 13142-4-8. ఈసంఘము 1917-వ సంవత్సరమున మే 8-వ తారీఖున శ్రీమతి జినారుదాసుసతిగారిచే స్థాపింపబడి దినదినాభివృద్ధిగాంచుచున్నది. బాలికలకు నిర్బంధప్రాథమిక విద్యాప్రసాదము, బాల్యవివాహనిరోధము, గర్భాదానోచితవయస్సు హెచ్చించుట, శాసనసభలకు స్థానికసంఘములకు స్త్రీలకు ఎన్నికహక్కు, ఓటింగుహక్కు సంపాదించుట మొదలగునవి ఈసంఘమువారి ముఖ్యోద్దేశములు. ఈసంఘమువారు 'స్త్రీధర్మ'యను మాసపత్రికను ప్రచురించుచున్నారు. ప్రపంచమునందలి వివిధదేశముల కిదిపోవుచున్నది. దేశీయపత్రికలును, అంతర్జాతీయపత్రికలును ఇందుండి వ్యాసభాగముల నుద్ధరించి ప్రచురించుచున్నవి. ఈవిషయము పత్రిక ఉన్నతాశయములతోడను సమర్థతతోడను నిర్వహింపబడుచున్నదనుటకు నిదర్శనము. ఇంగ్లీషు, అరవము, తెనుగు, హిందీభాషలలో ఈపత్రిక వ్యాసములను ప్రచురించుచు ఆయాభాషలు తెలిసినవారి విజ్ఞానసంపాదనమునకు దోహదమొనర్చుచున్నది. ఈసంఘమువారు నివేదితవత్సరమున ప్రథమఅఖిలాసియా స్త్రీల మహాసభను జయప్రదముగ నిర్వహించిరి. నివేదితవత్సరమున భారతరాజకీయాకాశమున గలిగిన సంచలనమున భారతస్త్రీలుగైకొనిన ప్రశంసనీయమగు పాల్గొను ఈసంఘమువారు ప్రపంచమునకు వెల్లడించుటలో చాలపాటుబడిరి. శ్రీమతి మార్గరెటు కజిన్సుసతి, శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి, శ్రీమతి అమ్ముస్వామినాధన్, శ్రీమతి వెంకటసుబ్బారావుసతి మొదలగు మహనీయురాండ్రు ఈసంఘాభివృద్ధికి తమచీమునెత్తురులు వెచ్చించుచున్నారు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్
బళ్లారి: వి. రాజు మొదలియార్ & సన్స్, బ్రాహ్మణవీధి.
నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.
బెజవాడ: నామల ఆంతోని.
మచిలీపట్టణము: కె. బాలకృష్ణ
జె.వి. ఆర్. శర్మ, న్యూస్ ఏజెంటు
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్
హైదరాబాదు: ఎస్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్తా మార్కెటురోడ్డు, (మన ప్రాంతపు 1 రూ॥ స్మానియారూ 1-3-0 అగును)
నిడదవోలు: శాస్త్రి బ్రదర్స్, న్యూస్ ఏజంట్సు.
కొవ్వూరు: జి. వి. రామరావుగారు.
ఏలూరు: ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట.
రాజమండ్రి: ఎన్. బి. కృష్ణరావుగారు
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు
బరంపురం: గోనియశెట్టిగారు, గొల్లపల్లి.
కొల్లూరు: కాజా సుబ్బయ్యగారు, బాలికాపాఠశాల.
గుంటూరు: విన్డ్సన్ కంపెని.
అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.
చికాకోలు: తాటికొండ మాణిక్యరావుగారు.
పాలకొల్లు: వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపల్లి.
ఎలమంచిలి: మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి.
కాకరపఱ్ఱు: కే. సత్యనారాయణగారు, సరస్వతీగ్రంథమాల.
విజయనగరం: కేసనపల్లి రామలింగంగారు, పాత్తూరివారి వీధి.
పిఠాపురం: మొం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం.
విశాఖపట్టణం: అందే కృష్ణమూర్తి బ్రదర్సు.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

తృణబిందువను మహాముని ఉగ్రతపము సేయుచుండఁగా దేవేంద్రుఁడాతపమునకు భయపడి తపోవిఘ్నము చేయుటకై సెజ్జాణయను హరిణయను నచ్చరనుపంపెను. అంతట నామహాముని తన తపోభంగముజేయఁదలచివచ్చిన యాకన్యపై మిక్కిలికోపించి నీవు మనుష్యాంగనవై పుట్టవలసినదనిశపించెను. ఆశాపముచే నది భయపడి 'స్వామీ! నేను పరాధీనురాలను. దోషముచేసితిని. కాన క్షమియింపు'మని ప్రార్థించుటయు నతఁడు జాలిగలిగి దివ్యకుసుమములు నీపైఁబడునంతవఱకు నీవు మనుష్యాంగనవై భూమిపైనుందువని శాపావధినానతిచ్చె. ఆకారణమున నాయచ్చర విదర్భరాజ వంశమున నిందుమతియను నామమున జనియించి అజమహారాజును వరియించెను. ఆమహారాజొక్కనాడు దేవీసమేతుఁడై నందనవనంబువిహరించు నమరనాయకుఁడట్లు నగరోపకంఠమునను్న యుద్యానవనమందు విహరించెను. అప్పుడు దక్షిణసముద్రతీరప్రాంతమున గోకర్ణమను క్షేత్రమున వసియించుచున్న బ్రహ్మదేవునియొద్ద వీణవాయింపఁదలచి నారదుఁడుత్తరదిక్కునుండి యాక్షేత్రమునకు వెళ్లుచుండెను. ఆమహామునియొక్క వీణాగ్రమున జుట్టఁబడిన దివ్యకుసుమమాలికనుదాను వాసనజూచుటకో యనవాయువు హరించెను. ఆపుష్పసంబంధమైన వాసనలచేత జుట్టుముందిరుగు తుమ్మెదలు, వాయువు తనకుఁజేసిన యవమానమునకు మిక్కిలి వగచి వీణవిడుచుచున్న కాటుక కన్నీరుబోట్లవలె నల్లనై శోభిల్లెను. పువ్వుదేనియకలిమిని సౌరభవిశేషమున వసంతకాలలతను బోలియున్న యాపుష్పదామము నృపాలశేఖరుని ధర్మపత్నిపైబడెను. ఆపూలదండ వేయఁబడినతోడనే యిందుమతీదేవి భయంపడి ప్రాణములువాసి నేలఁబడియెను. భర్తయు నామెతోడనే నేలనొరిగెను. దీపకళిక తనకాధారమైన చమురుచుక్కతోఁగూడ క్రిందఁబడునుగదా! ఏలికలిద్దరిత్తెఱంగునఁబడుటచూచి సన్నిధానవర్తులగు సేవకులు దుఃఖింపఁగా నచ్చటి కమలాకరమునందున్న పక్షులన్నియు సమదుఃఖము కలిగినట్లు రోదచేసెను.

వ్యజనములు వీచుట మొదలగు నుపచారములచేత రాజు తెప్పిరిలిలేచెను. కాని యామె కదలక యట్లే యుండెను. ఆయువున్నప్పుడేకద చికిత్సలు మొదలగు ప్రతీకారవిధానము లుపయోగించుట. శ్రుతులు తెగియున్న వీణియ నొడిలోఁబెట్టుకొనినట్లు ప్రాణములు బాసిన యాయిందుమతి నతఁడు నితాంతప్రేమమున నొడిలోఁబెట్టుకొని సహజమైన ధైర్యమును బాసి కన్నీరువిడుచుచు గద్గదకంఠముతో మిక్కిలివిలపించెను. మిక్కిలి తప్తమైన నినుమునయితము మెత్తబడుచుండఁగా నింక మనుష్యమాత్రుని మాట చెప్పనేల? అతఁడీక్రిందివిధమున వగచెను:

"శరీరమునోఁకినంతమాత్రమున పువ్వులు సయితము ప్రాణముతీయఁజాలినయెడల జంపఁదలచుకొన్నప్పుడు దైవమునకేది యాయుధము కాకుండును? ఒకవేళ మెత్తనివస్తువులను మెత్తనివానిచేతనే యముఁడు చంపఁదలచుకొన్నట్లు తోఁచుచున్నది. మంచుపడినంతమాత్రముననే తామరపువ్వు మాడిపోవుటచూచుచున్నాము. ఇందు కిదియె ప్రథమోదాహరణము. ఈపుష్పమాలికయే ప్రాణములు తీయఁగలదేని దానిని నేను వక్షస్థలమున ధరించుచున్నాఁడఁగదా! అది నన్నేలచంపఁగూడదు? ఈశ్వరేచ్ఛయనుకూలమగునేని విషమమృతమగును. ప్రతికూలమైనచో నమృతము విషమగును. ఈపూలదండ నాభాగ్యదోషమున బ్రహ్మదేవునిచేత గల్పింపఁబడినదని చెప్పవచ్చును. ఏలయన నది కొమ్మలపై నల్లుకొన్నతీగను జంపెను. కాని చెట్టును చంపఁజాలకపోయెను. నేరము చేసినప్పుడయినను నన్ను దప్పుపట్టియెఱుఁగవు. అట్టినీవు నేఁడే నేరము చేయనినన్ను బలుకరించి ఒక్కమాటైన నాడవేమి? నీవు నన్నెడబాసి మరల రాకుండఁబోవుచున్నను నేను నీవెంటరాజాలనైతిని. దీనిఁబట్టి నేను నీయెడలఁ గపటవాత్సల్యముగల వంచకుఁడనైతిని గదా. ఓపాడుప్రాణమా! మొదట నామెతోఁ గలిసిపోయి మరల నేలవచ్చితివి? స్వయంకృతాపరాధముచేత నాజన్మాంతము దుస్సహమైన వియోగదుఃఖమనుభవించుచుండుము. ఈవనమందు విహరించుటవలన

నీ మొఁగమున బొడమిన చెమటబిందువులైన నారవేరు. ఇంతలోనే నీప్రాణముపోయెను. ఛీ! యీదేహము లెంత యస్థిరములు. మనస్సు చేతనైనను నీ కెన్నఁడును నే నప్రియముచేసి యెఱుఁగను. అట్టి నన్ను నీ వేల విడిచి పోవలయును? నేను పేరునకుమాత్రమే భూమిపతిని గాని నిజముగా నీకనురాగబద్ధుఁడనుగదా! పువ్వు లలోఁగలసియున్న తుమ్మెదలవలెనున్న నీకురులు గాలికిఁగదలుచుండుటచే నీకు మరల ప్రాణమువచ్చిన దేమోయని నేను సంశయించుచున్నాను. కావున నో ప్రియురాలా! మరల నీవు బ్రతికి రాత్రిహిమపర్వత గుహాలలోనుండు చీఁకటిని మహాతేజోవంతములగు నోషధులు నాశనముచేసినట్లు దుస్సహమైన నాదుఃఖ మును బాపి రక్షింపుము. లోపలితుమ్మెదలు ధ్వనులు సేయుట మానియుండ రాత్రిముకుళించుకొని పోవు పద్మమట్లు మాటలుడిగియున్న నీముఖము నామన స్సును మిక్కిలి బాధపెట్టుచున్నది. పులుఁగులలో మగ జక్కవపిట్ట మరల నాఁడు జక్కవపిట్టను తెల్ల వాఱఁగానే కలియును. నిశాకాంత పగలు చంద్రు నితో విరహమొందినను సూర్యాస్తమయసమయము కాఁగానే యతనిని వెండియుఁ గలసికొనును. మరల గలయికగలుగునను నాసచే జంద్రచక్రవాకములు విర హము సైరించును. నీవో మఱలనన్నెన్నఁడు గలియవు. ఈవియోగదుఃఖము నన్ను మరల బ్రతుకనిచ్చునె? మెత్తనిచిగురు పాన్పులమీఁద బవ్వళించినప్పుడు సయి తము నీమేను నొచ్చుచుండెడిది. అట్టి నీవు మిక్కిలి దారుణమైన చితిమీఁద నెట్లు బవ్వళించెదవు? నీకు విశ్వాసపాత్రమగు ప్రథమసఖివంటిదైన యీ మొల నూలు నీవు ధరింపకపోవుటచే ధ్వనిమాని పెద్దనిద్దుర పోయిననీతోడఁ దానుగూడ గతించినట్లే కనఁబడు చున్నది. తియ్యనైన నీపలుకులను గోయిలలందును మంద మందగమనంబులు రాయంచలయందును చూపులు జింకలయందును విలాసములను గాలిచేఁగదలుతీఁగల యందును నానిమిత్తము నిలిపి నీవరుగుచుంటివి. కాని దుఃఖోపశమనము సేయుటకు నీతో నేనువచ్చుటదక్క యవి యెల్లఁజాలునా? ఫలినీలతను సహకారవృక్షము మీఁద బ్రాకఁజేసి యారెంటికి వివాహముచేసి దంపతు లను గావించి సంతోషించకుండ నీవిట్లుపోవుటన్యా యమా? నీవు దోహదముచేసి పెంచిన యశోకవృక్షము నీవు మిక్కిలిప్రియమున దాల్పఁదగిన పువ్వులనిచ్చు చున్నది. అయ్యో! అవి నీతలలో ముడువక యెట్లు వీనిని నీచితిపైనైనను. అందెలకాలితోఁ దన్ని యశో కమునకు దోహదముచేసి నీ వెంతో మేలుచేసిన కత మున నదికృతజ్ఞతగలిగి పువ్వులనియెడు బాష్పబిం దువులు విడిచి నీకై యెంతో శోకించుచున్నది. నీ యూర్పులవలె సువాసనలుగల యీ పొగడపూవు లతో సగమునీవును సగము నేనును దండగూర్చుటకు పందెమువైచికొంటిమి. అందు నాసగము నేను గూర్చి తిని. నీసగము నీవుకూర్చి ముగింపక యిటుల పెద్ద నిదురఁబోవుట నీకున్యాయమా? సుఖదుఃఖసమానమైన సఖీజనమిదిగో యిచ్చటనున్నది. పున్నమచంద్రుని బోలు పుత్రకుఁడిదిగో యిచ్చటనున్నాఁడు. విశేషించి యఖండప్రేమముగల నేనున్నవాఁడను. ఇట్టిమమ్మం దఱవిడిచి నీవరుగుట మిక్కిలినిష్ఠురముసుమా! నేటితో నాకు ధైర్యమెల్ల నశించెను; భోగములుపోయెను; గానముమీఁదియాసక్తి యడుగంటెను; ఋతువుల మీఁదిప్రీతి క్షీణించెను; ఆభరణముల ప్రయోజనము లంతకుమున్నె పోయె; నాపాన్పు శూన్యమయ్యె: నీవు నాధర్మపత్నివి; మంత్రివి: ప్రియసఖివి; మృదుకళ యందు శిష్యురాలవు. కరుణాశూన్యమైన మృత్యువు నిన్ను హరించుటచేసి నాసంబంధమైన సమస్తమును హరింపఁబడియెను: నేను ముందుగా రుచిచూచి నీకిచ్చిన మధురరసముత్రాగుచుండెడిదానవు. అట్టి నీవు బాష్పజలకలుషితమైన జలాంజలి నెట్లు త్రాగ నేర్తువు? అన్యచింతయెన్నఁడును నామనస్సునుహరించి యెఱుఁగదు. నాకోరికలెల్ల నిన్నే యాశ్రయించి యుండెను. నీవులేకపోవుటచేత నెంతమహైశ్వర్య మున్నను నదియునాకు వ్యర్థమే సుమా!"

కోసలేంద్రుఁ డీరీతినిల్లాలినిగూర్చి జాలిగదురు నట్లు విలపించుచుండ నచ్చటివృక్షములుగూడ శాఖల నుండి కారురసరూపమున గన్నీటివర్షము గురిసి దుర్దిన ము గావించెను.

—చిలకమర్తి లక్ష్మీనరసింహము.